ఈ భారతజాతిలోనే, పురాణకాలంలో వర్ణవ్యవస్థ ఏర్పడి అయిదు ప్రధానకులాలు స్థిరపడిపోయినవి. ప్రస్తుతం యీ కులభేదం క్రమంగా తొలగిపోతున్నది. ఏకజాతి, ఏకకులంగల భారతప్రజావ్యవస్థ క్రమంగా పరిణామం పొందకపోదు.

## జనాభా

పది సంవత్సరాల కొకసారి మన దేశంలో జనాభా లెక్కలను ప్రభుత్వం తయారుచేస్తుంది. ఆప్రకారం, 1951 లో జనాభా లెఖలు తయారుచేయబడినవి. 1951 ఫిబ్రవరి 9 తేదిన ప్రారంభమై, మార్చి 1 తేదీతో యీ గణితి పూర్తిఅయినది. దేశమంతటా ఒకేకాలంలో జరిగిన యీ గణితి చెయ్యడానికి 6,00,000 మంది గణితిదార్లు పనిచేశారు.

ఇంతకు పూర్వపు జనాభా 1941 లో గణితిచేయబడింది. కాని; ఆనాటికీ యీనాటికీ ఇండియాలో రాజకీయంగాను, భౌతికంగానూ గొప్ప మార్పులు కలిగాయి. 1947 ఆగస్టు 15 న ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందడమూ, ఆనాడే దేశం విభజనకావడమూ జరిగింది. అందువలన 1941 లో తీసిన జనాభా లెఖలు 1947 ఆగస్టు 15 తో ఆధారపడడానికి వీలులేని మార్పులు పొందినవి. విభజనానంతరం ఇండియా జనాభాను గురించిన సరియైన లెఖలు 1951 జనాభా లెఖలవల్లనే లభించగలవు.

1951 జనాభావల్ల, కాశ్మీర్‌లోను, అస్సాంలోని కొండ జాతి ప్రాంతాలలోను తప్ప తక్కిన భారతదేశంలో మొత్తం 35,68,29,485 మంది ప్రజలున్నారనీ, వారిలో 18,33,05,654 మంది పురుషులూ, 17,35,23;831 మంది స్త్రీలూ వున్నారనీ తేలింది.

### 1951 జనాభా

| రాష్ట్రం : | జనాభా : | పురుషులు : | స్త్రీలు : |
|---|---|---|---|
| అస్సాం : | 90,43,707 | 48,12,166 | 42,31,541 |
| ఉత్తరప్రదేశ్ | 6,32,15,742 | 3,30 98,866 | 3,01,16,876 |
| ఒరిస్సా | 1,46,45,946 | 72 42,892 | 74;03,054 |

| | | | |
|---|---|---|---|
| పంజాబ్ : | 1,26,41,205 | 67,86,934 | 58,54,271 |
| పశ్చిమబెంగాల్ : | 2,48,10,308 | 1,33;45,441 | 1,14,64,867 |
| బీహార్ : | 4,02 25,947 | 2,02,23,675 | 2,00,02,272 |
| బొంబాయి : | 3,59,56,150 | 1;86,14,862 | 1,73,41,288 |
| మదరాసు : | 5,70,16,002 | 2,84,19,003 | 2,85,96,999 |
| మధ్యప్రదేశ్ : | 2,12;47,533 | 1,06.62,812 | 1,05,84,721 |
| కాశ్మీర్ : | 43,70;000 | | |
| తిరువాంకూర్-కొచ్చిన్ : | 92,80,425 | 46.20,803 | 46,59,622 |
| పెప్సు : | 34,93,685 | 18,94,844 | 15,98.841 |
| మధ్యభారత్ : | 79,54,154 | 41,33,075 | 38,21,079 |
| మైసూర్ : | 90,74,972 | 46,57,409 | 44,17,563 |
| రాజస్థాన్ : | 1,52,90,797 | 79,61,673 | 73,29,124 |
| సౌరాష్ట్ర : | 41,37,359 | 20,94,442 | 20;42,917 |
| హైదరాబాద్ : | 1,86,55,108 | 94,31,062 | 92,24,046 |
| అజ్మీర్ : | 6,93,372 | 3,60,236 | 3,33,136 |
| అండమాన్ నికోబార్ : | 39,971 | 19,055 | 11 916 |
| కచ్ : | 5,67,606 | 2,72,977 | 2 94,629 |
| కూర్గు : | 2,29,405 | 1,25,327 | 1,04,078 |
| ఢిల్లీ : | 17,44,072 | 9,86,538 | 7,57,534 |
| త్రిపుర : | 6,39,029 | 3;35,589 | 3,03,440 |
| భోపాల్ : | 8,36,474 | 4,37,635 | 3,98.839 |
| మణిపూర్ : | 5,77,635 | 2,83,685 | 2,93,950 |
| బిలాస్‌పూర్ : | 1,26,099 | 64,738 | 61,361 |
| వింధ్యప్రదేశ్ : | 35,74,690 | 18,32,940 | 17,41,750 |
| హిమాచలప్రదేశ్ : | 9,83,367 | 5,14,765 | 4,68,602 |

రాష్ట్రాలన్నిటిలోకి ఎక్కువ జనాభాగలది ఉత్తరప్రదేశ్; దేశంలోని జనాభాలో 29,50,04,271 మంది గ్రామాలలో నివసిస్తున్నారు. తక్కిన 6,18,25,214 మంది నగరాలలో నివసిస్తున్నారు.

పదిలక్షలకంటె ఎక్కువ జనాభాగల పట్టణాలు దేశంలో అయిదు మాత్రమే ఉన్నాయి. అవేమిటంటె :

బొంబాయి : 28;39,270.
మదరాసు : 14,16,056.
కలకత్తా : 25,48,677.
హైదరాబాదు : 10,85,722.
ఢిల్లీ : 11,91,104.

## కొన్ని ముఖ్యనగరాల జనాభా

| | | | |
|---|---|---|---|
| పాట్నా : | 2,83,479 ; | కటక్ : | 1,02,501 |
| జంషెడ్‌పూర్ : | 2,18,162 ; | లక్నో : | 4,96,865 |
| గయ : | 1.33,700 ; | కాన్పూర్ : | 7,05,383 |
| అహమ్మదాబాద్ : | 7,88,333 ; | ఆగ్రా : | 3,75,665 |
| పూనా : | 4,80,982 ; | కాశీ : | 3,55,777 |
| సూరత్ : | 2.23,182 ; | అలహాబాద్ : | 3,32,295 |
| కొల్హాపూర్ : | 1,36,835 ; | వరంగల్ : | 1,33,130 |
| నాగపూర్ : | 4.49,099 ; | బెంగుళూర్ : | 7,78,977 |
| మధుర : | 3,61 .781 ; | మైసూరు : | 2,44,323 |
| తిరుచిరాపల్లి : | 2,18,921 ; | జైపూర్ : | 2,91,130 |
| కోయంబత్తూరు : | 1,97,755 ; | జోధ్‌పూర్ . | 1,80,717 |
| విజయవాడ : | 1,61,198 ; | రాజకోట : | 1,32,069 |
| గుంటూరు : | 1,25,255 ; | త్రివేండ్రం : | 1,86,931 |
| విశాఖపట్టణం : | 1,08,042 ; | ఉజ్జయిని : | 1,29;8177 |
| రాజమండ్రి : | 1,05,276 ; | అమృతసర్ : | 3,25,747 |

## వృత్తులు

దేశంలోని జనాభాలో 24,90,74;901 మంది వ్యవసాయం మీద జీవిస్తున్నారని 1951 జనాభా లెక్కలవల్ల తేలింది.

భూమి ఖామందులుగావుండి, వ్యవసాయవృత్తిమీద జీవిస్తున్న వారూ, వారి ఆశ్రితులూ, స్త్రీ పురుషులు : 16,73,26,578.

భూఖామందులు కాకుండా వ్యవసాయం చేస్తున్నవారు, స్త్రీ పురుషులు కలిపి, 3,16,18,073.

వ్యవసాయ వృత్తిమీద జీవించే పాటకప్రజనులు, స్త్రీ పురుషులు కలిపి, 4,48,09,019.

వ్యవసాయం చెయ్యకుండా వుండే భూఖామందులు, స్త్రీలు పురుషులు కలిపి, 53,21,231.

వ్యాపారవృత్తివలన జీవించేవారూ, వారి పోషణమీద ఆధార పడినవారూ కలిపి, 2,13,11,898.

రవాణా సౌకర్యాలలో పనిచేస్తున్నవారూ, వారి పోషణమీద ఆధారపడినవారూ కలిపి; 56,20,717.

## మతములవారీగా

భారతదేశంలోని జనాభాలో నూటికి 84.99 వంతులు హిందువులు, 9.93 వంతులు ముస్లిములు, 2.3 వంతులు క్రైస్తవులు, 1.74 వంతులు సిక్కులు, 0.45 వంతులు జైనులు, 0.06 వంతులు బౌద్ధులు, 0.03 వంతులు ఫార్శీలు వున్నారని 1951 జనాభా లెఖల వల్ల తేలింది.

దేశంలోని ప్రజలలో వివిధ మతాలకు చెందినవారి సంఖ్య ఇది :

| | |
|---|---|
| హిందువులు : | 30,31,86,986 |
| ముస్లిములు : | 3,54 00,117 |
| క్రైస్తవులు : | 81,57,765 |
| సిక్కులు : | 62,19,134 |
| జైనులు : | 16,18,406 |
| బౌద్ధులు : | 1,80,767 |

| | |
|---|---|
| పార్శీలు : | 1,11,791 |
| యూదులు : | 26,781 |
| కొండజాతులు : | 16,61,897 |
| ఇతరమతములు : | 47,148 |

వివిధ రాష్ట్రములలో హిందువులు, ముస్లిములు, క్రైస్తవులు యీ క్రింది సంఖ్యలో వున్నారు.

| రాష్ట్రం : | హిందువులు : | ముస్లిములు : | క్రైస్తవులు |
|---|---|---|---|
| అస్సాం : | 58,94, 33 : | 19,96,456 : | 5,85,399 |
| ఉత్తరప్రదేశ్ : | 5,37,62,925 : | 90,28,992 : | 1 23,876 |
| ఒరిస్సా : | 1,43;18,411 : | 1,76,338 : | 1,41,934 |
| పంజాబ్ : | 81,76,430 : | 2,29,080 : | 95,293 |
| పశ్చిమ బెంగాల్ : | 1,95,10,600 : | 49,27 163 . | 1,75,293 |
| బీహార్ : | 3,43,10,416 : | 45,64,466 ; | 4,22,030 |
| బొంబాయి : | 3,17,85,614 : | 29,06,887 : | 5,25,454 |
| మదరాసు : | 4,99,95,318 : | 45,88,135 : | 24,31,006 |
| మధ్యప్రదేశ్ : | 2,02,15,607 : | 8,00,781 : | 88,502 |
| కాశ్మీర్ ; | | | |
| తిరువాంకూర్-కొచ్చిన్ : | 55,87,852 : | 7,21,227 : | 29,68,030 |
| పెప్సు : | 17,04,349 : | 55,913 : | 3,565 |
| మధ్యభారత్ : | 73,33,021 : | 4,96,153 : | 10,947 |
| మైసూర్ : | 81,77,291 : | 6,98,831 : | 1,70;909 |
| రాజస్థాన్ : | 1,38,62;150 : | 9,49,348 : | 6 762 |
| సౌరాష్ట్ర : | 35,87.384 : | 4,22,186 : | 1,814 |
| హైదరాబాద్ : | 1,60,88,905 : | 22,06,132 ; | 2,90,973 |
| అజ్మీర్ : | 5,99,524 : | 48,886 : | 4,413 |
| అండమాన్ నికోబార్ : | 9,294 : | 4,783 : | 9,494 |
| కచ్ : | 3,93,128 : | 1,11,434 : | 117 |
| కూర్గు : | 1,99,465 : | 23,062 : | 6,788 |

| | | | |
|---|---|---|---|
| ఢిల్లి : | 14,67,854 : | 99,501 : | 18,685 |
| త్రిపుర : | 4,80,662 : | 1,86,940 : | 5,562 |
| భోపాల్ : | 7,00,381 : | 1,28,672 : | 812 |
| మణిపూర్ : | 3,47,325 . | 37,197 : | |
| వింధ్యప్రదేశ్ : | 34,85,083 ; | 76,126 : | 1,092 |
| హిమాచలప్రదేశ్ విలాస్‌పూర్ | 10,88,841 : | 15,253 : | 317 |
| సిక్కిం : | 97,863 : | 124 : | 304 |

## వివాహితులు : అవివాహితులు

1951 జనాభా లెఖల ప్రకారం, ఇండియాలో 8,81,47,296 మంది వివాహం కాని పురుషులూ. 6,59,50,673 మంది వివాహం కాని స్త్రీలూ వున్నారని తేలింది. వివాహితులైన పురుషులు, 8,22,43,086; స్త్రీలు, 8,23,87,997.

భార్యచనిపోయినవారు, లేక భార్యలను వదలిపెట్టినవారు, మొత్తం పురుషులు, 90,33,458. భర్తచనిపోయినవారు, లేక భర్తలను వదలిపెట్టినవారు, మొత్తం స్త్రీలు, 2,18,11,014.

## బస్తీలు : గ్రామాలు

ఇండియాలో 5,58,089 గ్రామాలున్నాయి. 3,018 బస్తీలున్నాయి.

మొత్తం 6,43,61,676 ఇళ్లలోను 5,40,65,388 పల్లెటూరి ఇళ్ళు. 103,05,288 బస్తీ బళ్లు. ఈ బస్తీ ఇళ్లలో 6,18,75,123 మంది నివసిస్తున్నారు. దీనిని బట్టి గ్రామప్రాంతాలలో ప్రతి ఇంటిలోను 5.4 మంది, బస్తీలలో 5 మంది సగటున నివసిస్తున్నట్టు లెక్క తేలింది.

ఇండియాలో మొత్తం 500 మంది అయినా లేని గ్రామాల సంఖ్య 38,020. వాటి మొత్తం జనాభా 78,347,691; 500—1,000 మంది. జనాభాగల గ్రామాల సంఖ్య 1,04,268. ఇంక 1,000—2000

జనాభా ఉండే గ్రామాలు 51,769. 2,000—5,000 మధ్య జనాభా గల బస్తీల సంఖ్య 20,588.

5,000—10,000 జనాభా గల బస్తీలు 3,101. వీటిలో 2,07,53 736 మంది నివసిస్తున్నారు. 10,000-20,000 జనాభా గల పెద్ద పట్టణాలు 856. వీటిలో 1,16,85 768 మంది నివసిస్తున్నారు. 20,000—50,000 లోపు జనాభా గల పట్టణాలు 401. వీటిలో 1,18,04;047 మంది నివసిస్తున్నారు. 50,000-1,00,000 జనాభాగల పెద్ద పట్టణాలు 111. వీటిల్లో 75,55,324 మంది నివస్తున్నారు.

లక్షకు పైబడి జనులు నివసిస్తున్న నగరాలు 73. వీటిలో 23,551,617 మంది నివసిస్తున్నారు.

## తెలుగు దేశం

1951 జనాభా లెక్కలను బట్టి. భాషాప్రాంతాల స్వరూపాన్ని వివరిస్తూ తయారు చేసిన నివేదికలో తెలుగు ప్రాంతం 20 జిల్లాల ప్రాంతంగా స్పష్టపరచబడివుంది.

ఈ 20 జిల్లాలు ఇవి-ఆంధ్రరాష్ట్రంలో 11 జిల్లాలు; హైద్రాబాదులో 8 జిల్లాలు; మైసూరులో కోలారుజిల్లా. ఈ అన్ని జిల్లాల్లోను వున్న జనాభా 3,12,75,686. వీరిలో 100 కి 85 మంది తెలుగువారు.

ఈ జిల్లాలలో కోలారు జిల్లాలో 100 కి 54 మంది తెలుగు మాట్లాడే జనం వున్నారు. హైద్రాబాదు రాష్ట్రంలో హైద్రాబాదు జిల్లాలో 100 కి 53 మంది తెలుగువాళ్ళు. తక్కిన ఏడు జిల్లాల్లోను ఆంధ్రుల జన సంఖ్య బాగావుంది. కరీం నగరంలో ఈ జన సంఖ్య నూటికి 94 దాకావుంది.

ఆంధ్ర దేశంలో భాషా ప్రాంతాన్ని వివరించినట్లే దక్షిణ భారత దేశ స్తమైన ఇతర భాషా ప్రాంతాలు కూడా వివరింపబడినది. ఆప్రాంతాలలో (1) మహారాష్ట్ర ప్రాంతం; (2) కన్నడ ప్రాంతం

(3) తమిళ ప్రాంతం (4) మళయాళ ప్రాంతం (5) హిందీ ప్రాంతం (6) గుజరాత్ ప్రాంతం.

మహారాష్ట్రం 26 జిల్లాల ప్రాంతం. బొంబాయి రాష్ట్రంలో 13, హైద్రాబాదులో 5 మధ్య ప్రదేశ్‌లో 8 మహారాష్ట్రం మాట్లాడే జిల్లాలు వున్నాయి. ఈ జిల్లాల జనాభా 2,88,84,572. ఇందులో 100 కి 80 మంది మహారాష్ట్రులు.

కన్నడ ప్రాంతం మైసూరు రాష్ట్రంలోని 8 జిల్లాలు, బొంబాయి లోని బెల్గాం, బీజపూర్, ధార్వార్, కెనరా జిల్లాలు, హైద్రాబాద్‌లో రాయచూరు, గుల్బర్గా జిల్లాలు మొత్తం 14 జిల్లాల ప్రాంతం. జనాభా 1 48,78,750. ఇందులో 100 కి 72 మంది కన్నడులు.

తమిళ ప్రాంతంలో మద్రాసు రాష్ట్రంలోని 11 జిల్లాలు మాత్రం వున్నాయి. వీటి జనాభా 2,89;15,427. ఇందులో 100 కి 82 మంది తమిళులు.

మళయాళ ప్రాంతంలో మద్రాసు రాష్ట్రంలో మలబారు జిల్లా చేరింది. దీన్ని తిరువాన్కూరు-కొచ్చిలోని త్రివేండ్రం క్విలన్, కొట్టాయం, త్రిచూరుజిల్లాలతో కలిపితే మొత్తం ఇది 5 జిల్లాల ప్రాంతంగా వుంది. జనాభా. 1,40,38,767 ఇందులో 100 కి 89 మంది మళయాళం మాట్లాడతారు.

దక్షిణ భారతంలో హిందీప్రాంతం 34 జిల్లాల ప్రాంతం ఇందులో మధ్య ప్రదేశ్‌లోని 11 జిల్లాలు, మధ్యభారతులోని 13 జిల్లాలు, వింధ్య ప్రదేశ్‌లోని 8 జిల్లాలు, భోపాలులో 2 జిల్లాలు. జనాభా 2,24,70,281.

## సగటు ఆయుర్దాయం

భారతదేశంలో ప్రజల ఆయుర్దాయం సగటున చూస్తే 32 సంవత్సరాలు.

1951 జనాభా లెక్కలను బట్టి పురుషుల సగటు ఆయుర్దాయ 32.45 అనీ, స్త్రీలసగటు ఆయుర్దాయం 31.66 ఏళ్లు అని తేలింది.

## పసిపిల్లల మరణాలు

ఇతర దేశాలతో పోల్చి చూస్తే, భారతదేశంలో పసిపిల్లల మరణాలు చాలాఎక్కువ. బిడ్డలపోషణ విషయంలోతల్లి దండ్రులఅజ్ఞానము, పుష్టిలేని ఆహారము; దారిద్ర్యము మొదలైన అనేక కారణాలవల్ల బిడ్డల మరణం ఈ ఖండంలో ఎక్కువ. అయినప్పటికీ గత 25 సంవత్సరాలలోనూ, యీ మరణాలు క్రమేపీ తగ్గుతూవచ్చాయి.

1947 లో పుట్టిన బిడ్డలలో ప్రతి వెయ్యిమందికీ 146 మంది చనిపోయారనీ, 1948లో పుట్టిన బిడ్డలలో ప్రతి వెయ్యిమందికి 131 మంది చనిపోయారని లెక్కలవల్ల తెలుస్తుంది. 1947లో 9,32,620 మంది, 1948లో 8,06,260 మంది, 1949 లో 8,30,270 మంది, 1950 లో 8,55,261 మంది పసి పిల్లలు చనిపోయారు.

## సగటు ఆదాయం

1951లో ఇండియాలోని ప్రజలసగటు ఆదాయం తలకు, ఏడాదికి రు. 265 అని అంచనా

ఇదేలెక్కలో, ఇతరదేశాల ప్రజలసగటు ఆదాయపు అంచనాలు ఇవి (1949లో):

| | | | పౌనులు |
|---|---|---|---|
| యునైటెడ్ స్టేట్సు | ... 519 | యుగోస్లావియా | ... 52 |
| కెనడా | ... 311 | టర్కీ | .... 44 |
| ఇంగ్లండు | ... 276 | ఈజిప్టు | ... 93 |
| ఆస్ట్రేలియా | ... 242 | పెర్షియా | ... 30 |
| బెల్జియం | ... 208 | జపాన్ | ... 39 |
| ఫ్రాన్సు | ... 172 | పాకిస్తాన్ | ... 18 |
| ఇటలీ | ... 84 | బర్మా | ... 13 |
| చెకొస్లోవేకియా | ... 132 | చైనా | ... 10 |
| రష్యా | ... 110 | ఇండోనేషియా | ... 9 |
| పోలెండ్ | ... 107 | హంగరీ | ... 96 |

## విదేశాలలో భారతీయులు

విదేశాలలోవున్న భారతీయుల సంఖ్యనుగురించి, 1947 మార్చిలో, కేంద్రశాసనసభలో పండిట్ నెహ్రూ యీ క్రింది ప్రకటనచేశారు.

**యూరప్ :**

జర్మనీ 44, ఇటలీ 23, ఫ్రాన్సు 10.

**ఉత్తర అమెరికా :**

యునైటెడ్ స్టేట్సు 5,000. పెనామా 1000.

**దక్షిణ అమెరికా :**

బ్రజిల్ 2,000, బ్రిటిష్ గయానా 1,57.185, డచ్ గయానా 54.

**ఆఫ్రికా :**

బెల్జియన్ కాంగో 1,000 ; పోర్చుగీసు తూర్పుఆఫ్రికా 4,000 ; ఈజిప్టు, సుడాన్ 1,025 ; అబిసీనియా 2 000.

ఫ్రెంచి ఇండోచైనా 2,000 : ఇండొనేషియా, 24,000; ఫిలిప్పైన్స్ 8^0 ; సయాం 13,000 ; జపాన్ 50 , పెర్షియా 500 ; ఇరాక్ 4,500, టర్కీ 37; పాలస్టయిన్ 60, కాష్గరు 400; బర్మా 10,17,825.

**బ్రిటిషు సామ్రాజ్యము :**

ఆస్ట్రేలియా 4,544, కెనడా 1,500, న్యూజిలెండ్ 1;200 దక్షిణాఫ్రికా 2,66,016, దక్షిణరొడీషియా 2,547, సిలోన్ 7,50,000 బ్రిటిష్మలయా 6,52,769, హాంగ్ కాంగ్ , 4,745, మారిషస్ 2,69,546 సెచిల్లిస్ 503, జిబ్రాల్టరు 80, నైగీరియా 32, కెన్యా 90,528, ఉగాండా 26,972, న్యాసాలాండ్ 1,851, జాంజిబారు 14,000, టాంగనైకా 3,559, జమైకా 26,507, ట్రినిడాడ్ 1,70,396 ఫిజి 1,32,941, ఉత్తర రొడీషియా 427, మాల్డీవ్స్ 550, బ్రిటిష్ ఉత్తర బోర్నియో 1,288, ఏడెన్ 5,594, మాల్టా 44, గ్రెనడా 5,000, సెంట్ లూషియా 2,189, బ్రిటిష్ హొండురాస్ 477, సిరాలోన్ 444 బ్రిటన్ 7,128.

# విద్య

1951 జనాభా లెఖల ప్రకారం, భారత దేశంలోని ప్రజలలో నూటికి 16.6 మంది మాత్రమే అక్షర జ్ఞానం కలవారని తేలింది.

1950-51 లో ఇండియాలో 805 కాలేజీలు, 20,767 సెకండరీ స్కూళ్ళు; 2,09,303 ప్రైమరీస్కూళ్లు, 40,343 వృత్తివిద్యలస్కూళ్లు వున్నాయి. కాలేజీలలో 3,77,371 మంది, సెకండరీస్కూళ్ళలో 52,01,907 మంది ప్రైమరీస్కూళ్ళలో 1 83,27,263 మంది, వృత్తి విద్యల స్కూళ్ళలో 13,48,799 మంది చదువుతున్నారు.

1948 నుంచి 1953 నాటికి ఇండియాలో మొత్తం రెండులక్షల మంది వయోజన నిరక్షరాస్యులు, ప్రాథమిక విద్యాబోధన పొందినారు.

1953 నాటికి ఇండియాలో మొత్తం 22,000 లైబ్రరీలు వున్నాయి.

## విశ్వకళా పరిషత్తులు

1954 ఏప్రిల్ నాటికి ఇండియాలో 31 విశ్వకళా పరిషత్తులు వున్నాయి వాటి పేర్లు, వైస్‌ఛాన్సెలర్ల పేర్లు యీ క్రింద యివ్వబడినవి.

| పేరు | ఉన్న నగరం | వైస్-ఛాన్సెలర్ |
|---|---|---|
| అన్నామలై | చిదంబరం | డాక్టర్ సి. పి. రామస్వామి అయ్యర్ |
| అలహాబాద్ | అలహాబాద్ | డాక్టర్ ఏ. సి. బెనర్జి |
| అలీఘర్ | అలీఘర్ | డాక్టర్ తహెర్ సైఫుద్దీన్ |
| ఆగ్రా | ఆగ్రా | డాక్టర్ సి. వి. మహాజన్ |
| ఆంధ్ర | వాల్తేర్ | డాక్టర్ వి. ఎస్. కృష్ణ |
| ఉత్కళ | కటక్ | డాక్టర్ పరశురాం మిశ్ర |
| ఉస్మానియా | హైదరాబాద్ | డాక్టర్ సూరి భగవంతం |
| కలకత్తా | కలకత్తా | జస్టిస్ శంభునాథ్ బెనర్జి |

| | | |
|---|---|---|
| కర్నాటక్ | ధార్వార్ | సి. సి. హాలోల్కొటి |
| కాశ్మీర్ | కాశ్మీర్ | జానకి నాథ్ వజీర్ |
| గుజరాత్ | అహమదాబాద్ | జి. వి. మవలంకర్ |
| గౌహతి | గౌహతి | బి. కె. బారువ |
| జమియమిల్లియా | ఢిల్లి | డాక్టర్ ఎం. మజీద్ |
| ఢిల్లి | ఢిల్లి | డాక్టర్ జి. ఎస్. మహాజని |
| తిరువాన్కూర్ | త్రివేండ్రం | ఎ. రామస్వామి మొదలియార్ |
| పంజాబ్ | అంబాలా | దివాన్ ఆనంద్ కుమార్ |
| నాగపూర్ | నాగపూర్ | పండిత కుంజిలాల్ దుబే |
| థామసన్ ఇంజనీరింగు | రూర్కి | ఎ. సి. హార్ట్ |
| పాట్నా | పాట్నా | ప్రొఫెసర్ వి. కె. ఎన్. మీనన్ |
| బీహార్ | పాట్నా | శ్యామనందన సహాయ |
| పూనా | పూనా | డాక్టర్ ఎం. ఆర్. జయకర్ |
| పూనా (మహిళ) | పూనా | శ్రీమతి శారద మెహాత |
| బరోడా | బరోడా | శ్రీమతి సి. ఎన్. పటేల్ |
| బొంబాయి | బొంబాయి | ఎన్. జె. వాడియా |
| మదరాస్ | మదరాస్ | ఎ. లక్ష్మణస్వామి మొదలియార్ |
| మైసూర్ | మైసూర్ | డాక్టర్ బి. ఎల్. మంజునాథ్ |
| రాజస్థాన్ | జయపూర్ | జి. స. ఛటర్జి |
| లక్నో | లక్నో | ఆచార్య జుగల్ కిషోర్ |
| విశ్వభారతి | శాంతినికేతన్ | రతీంద్రనాథ్ టాగూర్ |
| సాగర్ | సాగర్ | డాక్టర్ ఆర్. సి. త్రిపాఠి |
| హిందు | కాశీ | ఆచార్య నరేంద్రదేవ్ |

## ఉస్మానియా యూనివర్శిటీ

హైదరాబాదులోని ఉస్మానియా యూనివర్శిటీని తమ పరం చేసుకొని, దక్షిణదేశంలోహిందీ భాషను అభివృద్ధి చెయ్యడానికీ

హిందీ విశ్వకళాపరిషత్తుగా తయారుచెయ్యడానికి కేంద్ర ప్రభుత్వం నిశ్చయించింది. ఇచ్చటి, విద్యాబోధన అంతా ప్రధానంగా హిందీ భాషలోనే జరిపించాలని ప్రభుత్వ ఉద్దేశం. ఈ యూనివర్శిటీని కేంద్ర ప్రభుత్వానికి స్వాధీనం చెయ్యడానికి హైదరాబాదు ప్రభుత్వం అంగీకరించింది.

## గాయకులకు బహూకరణ

ప్రసిద్ధులైన గాయకులకు ప్రతి సంవత్సరము బహూకరణలు ఇవ్వడానికి ఇండియా ప్రభుత్వ విద్యామంత్రి కార్యాలయం నిశ్చయించింది.

1952 లో ఇలాంటి బహూకరణలు నాలుగు ఇవ్వబడినవి. ఒక్కొక్క బహూకరణ, రూ. 1,000 రొక్కం రూ. 500 విలువ గల కాశ్మీరశాలువ. హిందుస్తానీ గాత్రం, హిందుస్తానీ వాయిద్యం, కర్ణాటక గాత్రం, కర్ణాటక వాద్యం—యీ నాలుగు శాఖలలోను ప్రసిద్ధులైన ఒకొకరికి యీ బహుమతులు ఇవ్వబడినవి. ఆ బహూకరణలు పొందినవారి పేర్లు ఇవి:

కర్ణాటక గాత్రం: అరియకుడి రామానుజయ్యంగార్
కర్ణాటక వాద్యం: (వీణ) కారైకుడి సాంబశివ అయ్యర్
హిందుస్తానీ గాత్రం: ఉస్తాద్ ముస్తాక్ హుస్సేన్
హిందుస్తానీ వాద్యం: (సరోద్): ఉస్తాద్ అల్లావుద్దీన్ ఖాన్.

1953

కర్ణాటక గాత్రం: సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్
కర్ణాటక వాద్యం:(వయొలిన్): ద్వారం వెంకటస్వామినాయుడు
హిందుస్తానీ గాత్రం: శ్రీమతి కేసర్‌బాయి
హిందుస్తానీ వాద్యం: ఉస్తాద్ హాఫీజ్ అలిఖాన్.

## నృత్య, నాటక, సంగీత అకాడమీ

భారతదేశంలో, నృత్య, నాటక, సంగీత కళలలో నూతన పరిశోధనలను చెయ్యడానికీ, ఆకళల అభివృద్ధికి దోహదం ఇవ్వడానికీ, ఈ కళకు సంబంధించిన సారస్వతాన్ని పెంపొందించడానికీ, ఒక గ్రంథాలయాన్ని స్థాపించడానికీ, అవసరమైన చోట్ల ప్రదర్శన శాలలను ఏర్పాటు చెయ్యడానికీ, ఈ కళకు సంబంధించిన గ్రంథాలను ప్రచురించ డానికి నృత్య, నాటక, సంగీత కళాపరిషత్ అనే సంస్థను కేంద్ర ప్రభుత్వం స్థాపించింది. ఈ సంస్థకు ప్రారంభోత్సవాన్ని 1953 జనవరి 28 తేదిన రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్ జరిపారు.

ఈ పరిషత్‌కు ఒక పరిపాలనా కౌన్సిల్ వుంటుంది. వివిధ రాష్ట్ర ప్రభుత్వాలకు యీ కౌన్సిల్‌లో ప్రాతినిధ్యం వుంటుంది. ఈ పరిషత్ కార్య నిర్వహణకు అయే ఖర్చును కేంద్ర ప్రభుత్వమే భరిస్తుంది.

ఈ పరిషత్‌కు అధ్యక్షుడు, మదరాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి, శ్రీ పాకాల వెంకటరాజమన్నార్; కోశాధిపతి, శ్రీ ఎం. ఎస్. భట్నగర్.

ఈ పరిషత్ కార్యనిర్వాహక వర్గం జనవరి 30న ఎన్నుకోబడింది.

వైస్-చైర్మన్: శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ; సభ్యులు: జె. సి. మథుర్; డాక్టర్ డి. జి. వ్యాస్; నిత్యానంద కానుంగో; రతంజన్ కర్; బాబూలాల్ గుప్త; బ్రహ్మానంద్ గోస్వామి; శ్రీమతి దేవికారాణి; పృథ్వీరాజ్ కపూర్; ఉదయశంకర్; రాయ్ ఉమానాథ్ బాలి; ప్రొఫెసర్ హుమయూన్ కబీర్.

ఈ పరిషత్ సభ్యత్వం ఎన్నికద్వారా జరుగుతుంది. పరిపాలనా కౌన్సిల్ సభ్యులు, తాము ఏకగ్రీవంగా ఎన్నుకొన్నవారిని పరిషత్ సభ్యులుగా చేర్చుకుంటారు. ఈపరిషత్ స్థాపన జరిగిన సందర్భంలో, తొలి సభ్యులుగా యీ క్రిందివారు; జనవరి 29 న ఎన్నుకోబడినారు.

1. ఉస్తాద్ అలావుద్దీన్ ఖాన్; 2. ఉదయశంకర్ 3. ఉస్తాద్ హాఫీజ్ అలీఖాన్; 4. పృధ్వీరాజ్ కపూర్. 5. కరైకుడి సాంబశివ అయ్యర్; 6. శిశిర్ భాదురి; 7. అరియాకుడి రామానుజ అయ్యంగార్.

ఈ పరిషత్ సభ్యత్వం ఎప్పుడూ 30 మంది కంటె మించకూడదని నియమం ఏర్పరుచబడింది.

## సాహిత్య అకాడమీ

సాహిత్య రచనను ప్రోత్సహించడానికీ, సాహిత్యంపట్ల ప్రజాభిరుచిని పెంపొందించడానికీ, సాహిత్యరచనలో అత్యున్నతమైన నియమములను నెలకొల్పడానికీ సాహిత్య అకాడమీని కేంద్రప్రభుత్వం స్థాపించింది.

రచయితగా పేరుపొందినవారుగాని, రచనలను ప్రోత్సహించి సాహిత్యాభివృద్ధికి తోడ్పడినవారుగాని, యీ అకాడెమీలో సభ్యులుగా వుంటారు.

సభ్యులు కాక; యీ అకాడమీకి పారిషదులు కూడా వుంటారు. ఈపారిషదుల సంఖ్య ఎప్పుడూ 21 కన్న మించి వుండకూడదని నియమం ఏర్పరుచబడింది. పరిగణనీయమైన సాహిత్య రచనను చేసినవారిలో అతి ముఖ్యులను మాత్రమే, పారిషదులుగా ఎన్నుకుంటారు.

ప్రతిసంవత్సరము, సుప్రసిద్ధ రచయితలను యీ అకాడమీ బహూకరిస్తుంది. బహుమతులను ఇవ్వడంలో, ప్రతిసంవత్సమూ, అంతకు పూర్వం మూడు సంవత్సరాలలో ప్రచురితమైన రచనలను పరిశీలించి; ఉత్తమ రచనలనుచేసిన వారికి బహుమతి ఇస్తుంది. ఈ బహుమతులు, ప్రతిసంవత్సరం భారతదేశంలోని 14 ముఖ్య భాషలలోని రచనలలో, ఒకొక్క భాషకు ఒకొక్క బహుమతి మాత్రమే ఇవ్వబడుతవి. ఆ పధ్నాలుగు భాషలు ఏమిటంటే: అస్సామీ, బెంగాలీ, గుజరాతీ, హింది, కన్నడ, కాశ్మీర్; మలయాళం, మరాఠీ, ఒరియా, పంజాబి, సంస్కృతం, తమిళం, తెలుగు, ఉర్దు. పై ప్రతి భాషలోను

ఒక ఉత్తమ రచయితకు, ప్రతిసంవత్సరం, రు. 5000 బహుమతి ఇవ్వబడుతుంది. ఒకసారి బహుమతిపొందిన రచయితకు, మళ్ళీ రెండవ సారి బహుమతి ఇవ్వబడదు. ఈ బహుమతులు, సాహిత్య అకాడమీచేసే సిఫార్సునుబట్టి ఇవ్వబడుతవి.

పైన ఉదహరించిన 14 భాషల ప్రతినిధులున్నూ; వివిధరాష్ట్ర ప్రభుత్వ ప్రతినిధులున్నూ; యూనివర్సిటీల ప్రతినిధులున్నూ; కేంద్ర ప్రభుత్వ ప్రతినిధులున్నూ కాక, సాహిత్య రంగంలో పరిగణనీయమైన సేవచేసిన వారిని ఎనిమిదిని యీ అకాడమీ సభ్యులుగా కేంద్ర ప్రభుత్వ విద్యామంత్రి నామినేట్ చేస్తారు.

సాహిత్య అకాడమీ మొట్టమొదట పరిపాలనా వర్గం 1954 మార్చిలో ఎన్నుకోబడింది. దీనికి చైర్మన్, జవహర్‌లాల్ నెహ్రూ; వైస్‌చైర్మన్, డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణ; సభ్యులు: మౌలానా అబుల్‌కలాం ఆజద్, సర్దార్ కె. ఎం. పణిక్కర్, శ్రీ అన్నదశంకర్ రే, శ్రీ జైనేంద్రకుమార్ జెయిన్, శ్రీ ఉమాశంకర్ జోషి, డాక్టర్ హజారి ప్రసాద్ ద్వివేది, ప్రొఫెసర్ పి. వి. కానె, శ్రీ నామక్కల్ వి. రామలింగం పిళ్లై, శ్రీ పింగళి లక్ష్మీకాంతం.

## సాయుధ బలాలు

ఇప్పుడు ఇండియాలోవున్న సైన్యదళానికి పునాది ఈస్టిండియా కంపెనీవారు తమ ఫ్యాక్టరీల రక్షణకు పదిహేడవశతాబ్దంలో ఏర్పాటు చేసుకున్న చిన్న చిన్న కాపలాదళాలు. క్రమేపీ, యీ దళాలసంఖ్య హెచ్చుచేయబడింది. ఈస్టిండియాకంపెనీవారు, దేశీయవ్యవహారాలలో జోక్యం కలిగించుకొని, దేశీయరాజులపరస్పరకలహాలలో,ఎవరికో ఒకరికి సహాయపడడమూ, క్రమేపీ తాముకూడా ఇండియాలో రాజ్యాన్ని సంపాదించుకోవడమూ జరగడంతో తమసైన్యాన్ని విస్తరింపజెయ్యడమూ, సైనికులకు మంచి తర్ఫీదు ఇవ్వడమూ జరిగింది. బ్రిటీషువారు తయారు చేసిన యీ సైన్యంలోవున్న బ్రిటిషుసైనికులకు సోల్జర్లనీ, భారతీయసైనికులకు సిపాయిలనీ వ్యవహారనామం ఉండేది.

1857 లో సిపాయిలు సాగించిన మొదటి భారతీయ స్వాతంత్ర్య సమరఫలితంగా, ఇండియా పరిపాలనను ఈస్టిండియాకంపెనీ చేతినుండి బ్రిటిషు ప్రభుత్వం తీసుకున్నది. అప్పుడు ఇండియాలోని సైన్యం, బొంబాయి, మదరాసు; బెంగాల్ రాష్ట్రపు సైన్యాలుగా, మూడు భాగాలు చెయ్యబడింది.

ఆనాటికి ఇండియాలోని సైన్యంలో 65,000 మంది బ్రిటిషుసైనికులు. 1,40,000 భారతీయసైనికులూ వుండేవారు. 1895 లో సైన్యశాఖ నిర్వహణ విషయంలో మార్పుజరిగింది. సైన్యబలాలు నాలుగు కేంద్రాల క్రింద విభజింపబడినవి. 1904 లో, మళ్లీ, మూడు కేంద్రాలుగా ఏర్పాటు చేయబడినవి. 1920 లో మళ్ళీ నాలుగు కేంద్రాలు ఏర్పాటుచేయబడినవి.

బ్రిటిషువారు భారతదేశంలో సైన్యాలను సమకూర్చడం ఆరంభించినప్పటినుంచి చాలాకాలందాకా, భారతీయు లెవరికీ బాధ్యతగల హోదాలను సైన్యంలో ఇవ్వలేను. మొట్టమొదటిసారి, 1918 లో భారతీయులకు సైన్యంలో ఆఫీసరుహోదా యివ్వడం జరిగింది.తరువాత, క్రమేపీ కొద్దికొద్దిగా, కింగ్స్‌కమిషన్ (ఆఫీసరు హోదా) లను భారతీయులకు ఇవ్వడం జరిగినా, 1939 నాటికి భారతదేశంలోని సైన్యం అంతటిలోనూ 5000 మందికంటె ఎక్కువమంది ఆఫీసర్లు ఉద్యోగాలలో లేరు.

1939 లో రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైన తరువాత, కొంచెం ఎక్కువగానే భారతీయులకు ఇండియా సైన్యంలో ఆఫీసరు ఉద్యోగాలు యివ్వబడినవి. యుద్ధం ముగిసేటప్పటికి, దాదాపు 8,000 మంది భారతీయులు ఆఫీసరు హోదాలో వున్నారు.

ప్రపంచయుద్ధం ముగిసిన రెండు సంవత్సరాలలో, రాజకీయ పరిస్థితులు అతివేగంగా మార్పులు చెందటముతో, సైన్యశాఖ పునర్నిర్మాణం విషయమై ఏమీ ఏర్పాట్లు జరుగలేదు. 1947 ఆగస్టు 15 తేదిన భారతదేశం విభజన జరగడంతో, భారతదేశపు సైన్యంకూడా విభజింపబడింది. ఆనాటికి భారతదేశంలోవున్న సైన్యంలో రెండుభాగాలు ఇండియా వంతుకీ, ఒకభాగం పాకిస్థాన్ వంతుకీ వచ్చాయి.

దేశవిభజనతో పాటు, దేశస్వాతంత్ర్యంకూడా లభించినందున ఇండియాలోని బ్రిటిషు సైనికులందరినీ విడుదల చెయ్యడంకూడా జరిగింది. ఇండియాలోని ఆఖరు బ్రిటిషు పటాలం, 1948 ఫిబ్రవరి 28 తేదిన ఇండియా /నుంచి వెళ్ళిపోయింది. అయితే, కొంతమంది బ్రిటీషువారు ఇంకా ఇండియా సైన్యంలో, ఇండియా ప్రభుత్వం కోరికపై పనిచేస్తూనే వున్నారు. వీరు యుద్ధచర్యకుగాని, సైనిక నాయకత్వానికిగాని కాకభారతీయ సైనికులకు తర్ఫీదు ఇవ్వడం, సైనిక వ్యవహారాలలోని మెళుకువలను నేర్పడంలో నియమితులై వున్నారు. వీరిసంఖ్యచాలా తక్కువ.

ఇండియా సర్వసైన్యాధిపతిగా మొట్టమొదటి భారతీయునినియామకం, 1948 డిసెంబరులో జరిగింది. ఈ పదవికి నియమింపబడిన జనరల్ కె. ఎం. కరియప్ప, 1949 జనవరి 15 తేదిన పదవి స్వీకారం చేశారు.

## సాయుధబలాల నిర్వహణ

ప్రస్తుతం ఇండియా సాయుధబలాల నిర్వహణ ఎలాజరుగుతున్నదంటే:

సైన్యాలన్నీ సర్వసైన్యాధిపతికి లోబడివుంటాయి. నౌకాదళాలన్నీ సర్వనౌకాదళాధిపతికి లోబడివుంటాయి. విమానదళాలన్నీ సర్వ విమానదళాధిపతికి లోబడి వుంటాయి. ఈముగ్గురున్నూ ప్రభుత్వ రక్షణ శాఖామంత్రికి బాధ్యులై వుంటారు. సైన్య నిర్వహణ విషయంలో ఏయే విధానాలు అవలంబించాలో, యుద్ధచర్యలలో ఏయే విధానాలు అవలంభించాలో మొదలైనవాటిని ప్రభుత్వమండలి నిర్ణయించి, వాటిని మంత్రిమండలిలో ఏర్పాటుచేయబడిన డిఫెన్సుకమిటీద్వారా రక్షణశాఖామంత్రికి. తెలియజేస్తారు. రక్షణశాఖామంత్రి, యీవిధానాలను తన కార్యాలయం ద్వారా వివిధబలాల అధిపతులకు తెలియజేసి, అవి అమలు జరిగేటట్లు చూస్తారు.

## సైన్యం

ఇండియాసైన్యం అనేకభాగాలుగా విభజింపబడివుంది. అవేమిటంటే: కవచదళాలు, ఫిరంగి దళాలు; సైనిక ఇంజనీరు దళాలు, కాల్బలము; మోటారు దళాలు; వైద్యసహాయ దళాలు; గుమస్తా దళాలు.

## నేషనల్ కేడెట్ కోర్

ఇండియాలోని యువకులకు సైనికశిక్షను యివ్వడానికీ, అలా శిక్షణపొందినవారిలో అర్హులైనవారికి సైన్యంలో ఉద్యోగాలు యివ్వడానికీ ఒక పథకం తయారుచేయబడింది, ఆ పథకం ప్రకారం ఇండియాలో నేషనల్ కేడెట్ కోర్ స్థాపింపబడుతుంది. కేడెట్ అంటే సైనికశిక్షణ పొందేయువకుడని అర్థం. కోర్ అంటే దళం అని అర్థం ఇలాటి నేషనల్ కేడెట్ కోరును స్థాపించడానికి కేంద్రప్రభుత్వంవారి పథకానికి అన్ని రాష్ట్రాల ప్రభుత్వాలవారూ అంగీకరించారు.

ఈ పథకం ఏమిటంటే: ఈదళం రెండు భాగాలుగావుంటుంది. భాగానికి డివిజన్ అని పేరు. సీనియర్ డివిజన్, అంటే కాలేజి విద్యార్థుల దళం: జూనియర్ డివిజన్ అంటే హైస్కూలు విద్యార్థుల దళం.

1954 జనవరి 26 నాటికి ఇండియా అంతటిలోనూ సీనియర్ డివిజన్లో 677 మంది ఆఫీసర్లు, 27,540 మంది కేడెట్లూ; జూనియర్ డివిజన్లో 1,603 మంది ఆఫీసర్లూ, 62,797 మంది కేడెట్లూ, బాలికల డివిజన్లో 20 మంది ఆఫీసర్లూ, 600 మంది కేడెట్సువున్నట్లు తేలింది.

నేషనల్ కేడెట్ కోర్లో ప్రతి విద్యార్థీ చేరాలని నిర్బంధం లేదు; ఇష్టం వచ్చినవారే చేరవచ్చును. ఇలా చేరి, తర్ఫీదుపొందినవారు తప్పనిసరిగా సైన్యములోచేరి యుద్ధకార్యాలలో పాల్గొనాలనే నిర్బంధంకూడా ఏమీలేదు. ఈ తర్ఫీదు కేవలమూ, యువకులకు సైనిక శిక్షణనుయిచ్చి, వారు ప్రయోజకులుగా తయారయ్యేటట్టు చెయ్యడానికే ఉద్దేశింపబడింది.

జూనియర్ డివిజన్లో చేర్చుకొనబడే కేడెట్ వయస్సు 13 ఏండ్లలోపు వుండకూడదు. 17 ఏండ్లకు మించకూడదు.

# ప్రాంతీయ సైన్య దళాలు
## (Territorial Army)

సైన్యంలో చేరి పనిచేస్తున్న వారికేగాక; దేశంలోని యువకులందరికి సైనికశిక్షణ యివ్వవలసిందనీ, అవసరం వచ్చినప్పుడు దేశరక్షణ కార్యాలలో సైన్యానికి చేదోడుగా వుండేటట్టు ప్రాంతీయ సైన్య దళాలను ఏర్పాటు చేయవలసిందనీ, చాలామంది నాయకులు కోరారు. ఈ కోరికను అనుసరించి, ఇండియా ప్రభుత్వంవారు ప్రాంతీయ సైన్యదళాలను ఏర్పాటు చెయ్యడానికి నిశ్చయించారు.

ప్రథమంలో, యీ ప్రాంతీయ సైన్యం సంఖ్య 1,30,000 వుంటుంది. ఇది ఎనిమిదిదళాలుగా విభజింపబడివుంటుంది. ఒక్కొక్క దళానికి ఒక్కొక్క ప్రాంతం నిర్ణీతమై వుంటుంది. ఆ ప్రాంతాలు ఇవి:

(1) పంజాబ్ రాష్ట్రం: తూర్పు పంజాబ్ సంస్థానాల యూనియన్; ఢిల్లి, (2) ఉత్తరప్రదేశ్; (3) మధ్యప్రదేశ్; తూర్పు సంస్థానాలు. (4) బొంబాయి, కథియవాడ్. (5) మదరాసు; మైసూర్; తిరువాంకూరు సంస్థానాలు. (6) బీహార్; ఒరిస్సా, (7) పశ్చిమ బెంగాల్, కూచ్ బీహార్, (8) అస్సాం, త్రిపుర; మణిపూర్ సంస్థానాలు.

మదరాసు రాష్ట్రంలో ప్రాంతీయ సైన్యదళం 1949 అక్టోబర్ 7 తేదిన స్థాపించబడింది.

ఈ దళాలుచేసే పని ఏమిటంటే: యుద్ధపరిస్థితులు ఏర్పడినపుడు, సైన్యానికి తగినవారు లభించేటట్టు సహాయకరంగా వుండటం: సైన్యం యుద్ధ కార్యాలలో నిమగ్నమైవున్నందున, అంతరంగిక దేశరక్షణ కార్యాలలో పోలీసువారికి సహాయపడుతూ అల్లరులు, కల్లోలాలు జరగకుండా శాంతిభద్రతలను కాపాడడం తీరరక్షణ, విమానదాడి ప్రతిఘటన మొదలైన పనులలో పాల్గొనడం. అవసరమైనప్పుడు దేశం రక్షణలో పాల్గొని, దేశ స్వాతంత్ర్యాన్ని కాపాడడానికి సహాయపడాలనే ఉత్సాహం గలవారంతా, యీ దళంలోచేరి సైనిక శిక్షను పొంద

వచ్చును. ఈ దళాలకు చెందిన వారికి, ఏడాదికి రెండు మూడు మాసములు మాత్రమే శిక్షణ ఇవ్వబడుతుంది. మిగతా కాలంలో, వారు తమ మామూలు పనిపాటలను చూసుకుంటూ వుంటారు.

## నేషనల్ వార్ ఎకడెమీ

ఇండియాలోని సైన్య, నౌకా, విమాన దళాలలోని ఆఫీసరు ఉద్యోగాలకు భారతీయులను తయారుచేయడానికి ఒక కళాశాల [మిలిటరీ ఎకడెమీ] ను స్థాపించడానికి ఇండియా ప్రభుత్వంవారు నిశ్చయించారు. ఈ కళాశాల, రెండవ ప్రపంచయుద్ధంలో భారతీయ సైన్యాలు చూపిన ప్రతిభకు చిహ్నంగా పరిగణింప బడుతుందని కూడా ప్రకటింపబడింది. అదే వుద్దేశంతో నేషనల్ వార్ ఎకడెమీ అనే పేరు పెట్టబడింది.

ఈ కళాశాలను ఎక్కడ స్థాపించాలో, దానికి ఏ పేరు పెట్టాలో, శిక్షణ పద్ధతులు ఎలా వుండాలో, విద్యార్థుల వయస్సు, అర్హతలు ఎలావుండాలో, నిర్ణయించడానికి ప్రభుత్వంవారు ఒక కమిటీని నియమించారు. ఆ కమిటీచేసిన సలహాలను ఆమోదిస్తూ, 1948 మే 2 తేదీన ఇండియా ప్రభుత్వం చేసిన ప్రకటనను బట్టి, యీ ఎకడెమీ స్థాపన పథకం ఇది :

నేషనల్ వార్ ఎకడెమీ, పూనాకు 13 మైళ్ళ దూరంలోవున్న ఖరక్‌వస్లవద్ద స్థాపింపబడుతుంది. ఇండియాసైన్య, నౌకా, విమానదళాలకు ఆఫీసర్లను తర్ఫీదు చెయ్యడానికి ఇది వుద్దేశింపబడింది. దీనిలో చేర్చుకొనబడే విద్యార్థులు, కేవలము అర్హతలనుబట్టే ఎన్నుకోబడుతారు. వారి వయస్సు 15 ఏండ్లకుపైన 19 ఏండ్లకులోపు వుండాలి. దీనిలో చేరడానికి ముందు వారు మెట్రిక్యులేషనుగాని-దానితో సమానమైన పరీక్షగాని చదివివుండాలి. దీనిలో చేర్చుకొనబడిన విద్యార్థులకు తర్ఫీదు భోజనవసతి దుస్తులు ఉచితంగా యివ్వబడుతవి. ఇక్కడ తర్ఫీదు మూడేళ్ళు వుంటుంది: నౌకాశాఖలో చేరదలచిన విద్యార్థులు మాత్రం, 15 ఏటనే చేరాలి. సైన్యశాఖలో చేరదలచిన యువకులు,

మూడేళ్ళ తర్ఫీదు అయిన తరువాత. మరొక ఏడాది యిక్కడవుండి యితర సైన్య శాఖలగురించి నేర్చుకోవాలి.

ఖరక్ వస్లలో, యీ కళాశాలకు కావలసిన భవన నిర్మాణానికి పునాదిని 1949 అక్టోబరు 6 న పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ వేశారు. ఈ భవననిర్మాణం జరిగేవరకు, యీ కళాశాల డేరాడూన్‌లో నిర్వహింపబడుతుంది. ఈ శిక్షణకు ఎన్నుకోబడే విద్యార్థుల మొదటి జట్టుతర్ఫీదు 1949 జనవరి 4 వ తేదీన ప్రారంభమైంది.

దీనిలో ప్రతిసంవత్సరమూ 600 లేక 700 మంది విద్యార్థులు చేర్చుకొనబడుతారు.

## నౌకాదళం

ఈనాటి ఇండియా నౌకాదళపు పుట్టుక, 1612 లో జరిగిందని చెప్పవచ్చును. ఆ రోజులలో డచ్చివారు, పోర్చుగీసువారు తమ నౌకలను ఆటంకపరచకుండానూ, సముద్రపుదొంగలు తమ నౌకలను దోచుకోకుండానూ తమ నౌకలలో సాయుధ నావికదళాలను వుంచుకోడానికి నిశ్చయించి, ఈస్టిండియాకంపెనీవారు రెండు సాయుధనౌకలను ఏర్పాటుచేసుకున్నారు. క్రమేపి, యీ నౌకలసంఖ్య పెరిగి, ఇండియా ప్రభుత్వాధిపత్యంలో పెద్ద నౌకాదళమే ఏర్పడింది.

ఇండియాతీరం చాలా పొడవైనది కనుక, ప్రస్తుతంవున్న నౌకాదళం తీరరక్షణకు చాలదు. పదేళ్ళలో, ఇండియా నౌకాదళాన్ని తగినంతగా విస్తరింపచెయ్యడానికి ప్రభుత్వం ఒక పథకాన్ని తయారుచేశారు. నౌకాదళంలో పనిచేసే నావికసైనికుల (రేటింగ్స్)కు ట్రేయినింగు బొంబాయి, విశాఖపట్టణములలో ఇవ్వబడుతున్నది. నౌకాదళంలో ఆఫీసర్లుగా తర్ఫీదు పొందడానికి 47 మంది ఇంగ్లండు పంపబడినారు.

ఎక్కువమంది యువకులు నౌకాదళంలోచేరి, అతిముఖ్యమైన యీ దేశరక్షణ సేవలో పాల్గొనవలసిన అవసరం ఎంతేనావుంది.

ఇండియా స్వాతంత్ర్యాన్ని పొందిన తరువాత, అంటే 1947 ఆగస్టు 15 తరువాత 1947 నవంబరు 29 నాటికి కొత్తగా ఏడు నౌకలను సుమారు 2,43,00,00 రూపాయల వ్యయంతో ఇండియా ప్రభుత్వం కొన్నారు.

ఇండియాకు ప్రత్యేకంగా ఒక డెస్ట్రాయర్ దళాన్ని ఏర్పాటు చేసే వుద్దేశంతో ఇండియా ప్రభుత్వం బ్రిటనునుంచి మూడు నౌకలను (ఒక్కొక్కటి 1700 టన్నులు) కొన్నారు. రాజపుట్, రంజిత్, రాణా అనే పేర్లతో యీ మూడు నౌకలు బొంబాయికి 1950 జనవరి 23 తేదిన చేరినవి. ఈ నౌకలు మూడునూ 1942 లో నిర్మింపబడినవి. ఒక్కొక్కదాని పొడవు 358 అడుగులు. ఒక్కొక్కదానిలో నాల్గేసి 4.7 అంగుళాల మూతిగల ఫిరంగులు వుంటాయి.

## విమానదళం

భారతదేశంలో మొట్టమొదటి విమానదళం, 1933 ఏప్రిల్ లో ఏర్పాటు చేయబడింది. ఆ విమానదళ బలపు సంఖ్య ఎంతంటే: మూడు విమానాలు: ఆరుగురు వైమానికులు. ఇంత స్వల్పబలంతో ఆరంభమైన విమానదళం, రెండవ ప్రపంచయుద్ధం ముగిసేటప్పటికి పది స్క్వాడ్రనుల బలంగా తయారయింది. వీటిలో ఎనిమిది యుద్ధచర్యలలో పాల్గొనే విమానాలుగల స్క్వాడ్రనులు. రెండు యుద్ధసామగ్రిని సరాఫరాచేసేవి.

1947 ఆగస్టులో దేశవిభజనతోపాటు విమానదళ విభజనకూడా జరిగింది. యుద్ధచర్యలలో పాల్గొనే విమానాలుగల స్క్వాడ్రనులు ఏడు. యుద్ధసామగ్రిని సరఫరాచేసే విమానాలుగల స్క్వాడ్రను ఒకటి ఇండియా వంతుకు వచ్చాయి.

ఇండియా వైశాల్యం, ఇండియాకుగల ప్రాముఖ్యతనుబట్టి, ప్రస్తుతం వున్న విమానదళపు బలంచాలదు. ఈ దళాన్ని బాగా విస్తరింపచెయ్యడానికి ప్రభుత్వంవారు నిశ్చయించారు.

ఇండియా విమానదళంలో బాంబరు స్క్వాడ్రనులు, జెట్ విమాన స్క్వాడ్రనులుకూడా ఏర్పాటుచేయబడుతవి. అయిదు సంవత్సరాలలో, విమానదళ బలం మొత్తం 15 స్క్వాడ్రనులు చెయ్యడం ప్రభుత్వం సంకల్పం.

ప్రస్తుతం, కోయంబత్తూరు, జోధ్‌పూర్, అంబాల, బెంగుళూరు, మదరాసులలో వైమానికులకు తర్ఫీదునిచ్చే కేంద్రాలు వున్నాయి. ఇండియాలో తర్ఫీదుపొందిన వైమానికులలో కొందరిని ప్రతి ఏటా ఇంగ్లండుపంపి, ఉత్తమశిక్షణను యిప్పించడానికికూడా ఏర్పాటు చేయబడినది

## వీ ర స త్కా ర ం

ఇండియా నౌకా, సైన్య, విమానదళాలలో అసాధారణమైన ధైర్యసౌర్యాలను ప్రదర్శించిన వీరులను సత్కరించడానికి, యీ క్రింది బిరుదములు ఇవ్వడానికి కేంద్రప్రభుత్వంవారు నిశ్చయించారు.

ప్రథమ సత్కారం : పరమ వీర చక్ర

ద్వితీయ సత్కారం : మహా వీర చక్ర

తృతీయ సత్కారం : వీర చక్ర

పరమ వీర చక్ర పతకసత్కారం, ఇంతకుపూర్వ బ్రిటిష ప్రభుత్వంయిచ్చే విక్టోరియా క్రాస్ పతకంతో సమానమైన హోదాగలది. భారత ప్రజారాజ్య అవతరణసందర్భంలో, 1950 జనవరి 26 తేదీన ప్రభుత్వం వీరసత్కారం చేశారు. పరమ వీరచక్రం, మేజర్ సోమనాథశర్మ, లాన్స్‌నాయక్ కరంసింగ్, కెప్టెన్ ఆర్. ఆర్. రాణే, నాయక్ యదునాద్‌సింగ్ అనువారు నల్గురికి ఇవ్వబడింది. వీరిలో మేజర్ సోమనాథశర్మ, నాయక్ యదునాథ్‌సింగ్‌లకు వారిమరణానంతరం యీ సత్కారం జరిగింది. 1953 జనవరి 26 న హావల్దార్ మేజర్ పీరుసింగ్‌కు, మరణానంతం ఇవ్వబడింది.

చాలామందికి మహావీర్ చక్ర, వీర చక్ర సత్కారం జరిగింది. ఈ సత్కారాలన్నీ కాశ్మీర్ యుద్ధంలో పాల్గొన్నవారికే.

పరమ వీరచక్ర సత్కారాన్ని పొందినవారికి నెలకు రు. 50 భృతి ఇవ్వబడుతుంది. ఒకసారి పరమ వీరచక్రపొంది, మళ్ళీ గొప్పపని

చేసినవారికి పరమ వీరచక్ర బార్ ఇవ్వబడుతుంది. అలా బార్ పొందిన వారికి, ప్రతిబార్‌కు అదనంగా రు. 20 భృతి ఇవ్వబడుతుంది.

మహా వీరచక్ర పొందినవారికి నెలకు రు. 30 భృతి ఇవ్వబడుతుంది. ఒకొక బార్‌కు అదనంగా రు. 10 భృతి ఇవ్వబడుతుంది.

వీరచక్ర సత్కారం పొందినవారికి నెలకు రు. 20 భృతి ఇవ్వబడుతుంది. అదనంగా ప్రతిబార్‌కు రు. 8 భృతి ఇవ్వబడుతుంది.

సత్కారంపొందిన వీరుడు మరణించినట్లయితే, యీభృతి, అతని భార్యకు ఇవ్వబడుతుంది.

ఈభృతి జూనియర్ కమిషన్డ్ ఆఫీసర్లకు, అంతకుతక్కువహోదా గలవారికిమాత్రమే ఇవ్వబడుతుంది. కమిషన్ ఆఫీసర్లకు ఇవ్వబడదు.

## అశోక చక్ర

యుద్ధచర్యలలోగాక, ఇతరసందర్భాలలో సాహస; ఔదార్యాలను ప్రదర్శించి ప్రశంసనీయమైన సేవచేసినవారికి సాయుధబలాలలో వున్నవారికేగాక ఇతర సామాన్యప్రజలకుకూడా బహూకరణ చెయ్యడానికి 'అశోకచక్ర' పతకాన్ని ఏర్పాటుచేస్తూ, ప్రెసిడెంటుఉత్తరువు 1952 జనవరి 12 న జరిగింది.

ఈ పతకం మూడు తరగతులు కలిగివుంటుంది.

గొప్ప సాహసము, త్యాగము చూపినవారికి మొదటి తరగతి; గొప్ప సాహసము చూపినవారికి రెండవతరగతి; ప్రశంసనీయమైనసాహసము చూపినవారికి, మూడవ తరగతి.

# ప్రజాసేవకు బహూకరణ

## పద్మవిభూషణ్

ఏ విధంగానైనా, మహోత్తమమైన ప్రజాసేవ చేసినవారిని బహూకరించడానికి పద్మవిభూషణ్ అనే పతకము ఇవ్వవలసిందిగా,

ఇండియా ప్రెసిడెంటు, 1954 జనవరి 5 తేదిన ప్రకటించారు. ఈ పతకము మూడు తరగతులలో వుంటుంది. 1. పహెలావర్గ, 2. దుస్రావర్గ, 3. తిస్రావర్గ.

పహెలావర్గ పతకము బంగారు గిల్టుతో తయారుచేయుబడినదిగా వుంటుంది. మహోత్తమమైన ప్రజాసేవను చేసినవారికి ఇవ్వబడుతుంది.

దుస్రావర్గ పతకము వెండితో తయారుచేయబడినదిగా వుంటుంది. చాలా ప్రశంసార్హమైన ప్రజాసేవను చేసినవారికి ఇవ్వబడుతుంది.

తిస్రావర్గ పతకము కంచుతో తయారుచేయుబడినదిగా వుంటుంది. పరిగణనీయమైన ప్రజాసేవను చేసినవారికి ఇవ్వబడుతుంది.

## భారత్ రత్న

కళ, సారస్వతము, శాస్త్రపరిశోధన, పరిగణనీయమైన ప్రజాసేవ చేసినవారికి, జాతి, మత, స్త్రీ పుంవివక్షత లేకుండా, గౌరవించడానికి భారత్ రత్న అనే బిరుదును, ఇవ్వవలసిందిగా, ఇండియా ప్రెసిడెంటు 1954 జనవరి 5 తేదిన ప్రకటించారు. ఈ బిరుదముతోపాటు, ఒక బంగారు పతకముకూడా ఇవ్వబడుతుంది.

# విదేశీయుల అధీనంలో వున్న ప్రాంతాలు

భారతదేశంలో ఫ్రాన్సు, పోర్చుగల్ దేశాల ఆక్రమణలోకొంత భూభాగంవుంది. మూడు శతాబ్దాలనాడు, వర్తకానికి భారతదేశానికి వచ్చి, దేశీయ రాజకీయవ్యవహారాలలో జోక్యం కలిగించుకొని, ఫ్రాన్సు పోర్చుగల్ దేశాలు కొంతదేశాన్ని తమ పరిపాలనలోకి తెచ్చుకున్నవి. తరువాతవచ్చిన బ్రిటిష్‌వారితో పోరాటఫలితంగా, ఈ రెండు దేశాల పలుకుబడి, వాటిపాలనలోవున్న భూభాగమూచాలవరకుతగ్గిపోయాయి. నేడు ఈ రెండుదేశాల పాలనలోవున్న ప్రదేశాలను సెటిల్మెంట్లు అని వాడుకలో అంటారు. ఈ ప్రదేశాలలో యిటీవల స్వాతంత్ర్యోద్యమం ప్రబలుతూవుంది. ఈ రెండు సెటిల్మెంట్లలోనూవున్న ప్రజానాయకులు

ఈ రెండు సెటిల్మెంట్లనూ, భారతదేశంలోని యితర ప్రాంతాలలో కలిపివెయ్యాలని కోరుతున్నారు. ఆ సెటిల్మెంట్ల వివరాలివి:

## ఫ్రెంచి సెటిల్మెంట్లు

వీటి వైశాల్యం మొత్తం 203 చదరపు మైళ్లు. ఈ సెటిల్మెంట్లు మొత్తం అయిదు. అవి పుదుచ్చేరి, కరికాల్, మాహీ, యానాం అనే వూళ్ళూ, వాటిపరిసర ప్రదేశాలు. వీటన్నిటిలోనూ మొత్తంజనాభా, 1941 లెఖల ప్రకారం, 3,23,295. వీరిలో 1,62,916 మందిపురుషులు, 1,69,379 మంది స్త్రీలు. వీటన్నిటి పరిపాలన నిర్వహించడానికి, ఒక కమిషర్ ఉన్నారు. ఆయన వుండే స్థలం పుదుచ్చేరి. కమిషనర్: ఏంద్రి మేనార్డు.

## పుదుచ్చేరి

ఈ నగరం, భారతదేశపు తూర్పుతీరంలో మదరాసుకు దక్షిణంగా 105 మైళ్ళదూరంలోవుంది. ఈ నగరమూ, దీనిపరిసర ప్రదేశాలూ మొత్తం ఫ్రెంచివారి అధీనంలోవున్న భూమి, 115 చ. మైళ్లు. జనాభా, 1941 లెక్కల ప్రకారం 2,04,653.

## కరికాల్

ఇదికూడా మదరాసుకు దక్షిణంగా; సముద్రతీరాన తంజావూరు జిల్లాలో వుంది. ఈ సెటిల్మెంటులో మొత్తం 110 గ్రామాలు వున్నాయి. వీటి జనాభా 1941 లో 69,555. దీని వైశాల్యం 53 చ. మైళ్ళు.

**మాహీ:**

ఇది భారతదేశపు పశ్చిమతీరాన, మలబారులోవుంది.

**యానాం:**

ఇది తూర్పుగోదావరిజిల్లాలో, గోదావరి బంగాళా ఖాతంలోపడే చోటికి సమీపంలో; కాకినాడకు సుమారు 18 మైళ్ళదూరంలోవున్నది. దీని జనాభా 1941 లో 5,711.

దక్షిణఇండియాలోని ఫ్రెంచి సెటిల్మెంట్లు ఇండియాలో చేరాలా, ఫ్రాన్సుకు లోబడివుండాలా. అనే విషయాన్ని గురించి రిఫరెండం 1949 డిసెంబరు 11 న జరుపాలని ఫ్రెంచిఇండియామునిసిపల్ కౌన్సిలర్ల జనరల్ అసెంబ్లీ 1949 మార్చి 21 న తీర్మానించింది. ఫ్రెంచి ప్రభుత్వంతోను, ఇండియా ప్రభుత్వంతోను సమాలోచనలు జరుపడానికి ముగ్గురుసభ్యులతో ఒక రాయబారవర్గాన్ని కూడా యీ అసెంబ్లీ నియమించింది. ఈ రాయబారవర్గం ఫ్రాన్సుకువెళ్ళి అచ్చటి ప్రభుత్వంతోనూ, ఢిల్లీలో ఇండియా ప్రభుత్వంతోను మంతనాలు జరిపింది.

ఇండియాలోని ఫ్రెంచి సెటిల్మెంట్లు ఫ్రాన్సుతో సంబంధం కలిగివుండేటట్లయితే, వాటికి ఫ్రెంచి యూనియన్‌లో స్వపరిపాలన హక్కు ఇస్తామని ఫ్రెంచి ప్రభుత్వవర్గాలవారు చెప్పినట్లు యీ రాయబారవర్గం ప్రకటించింది.

ఫ్రెంచి ఇండియా మునిసిపల్ కాంగ్రెసు 1949 అక్టోబరు 17, 18 తేదులలో సమావేశమై, 1949 డిసెంబరులో జరుపుటకు నిశ్చయించిన రిఫరెండమును వాయిదా వెయ్యవలసినదనీ. ఫ్రెంచి ప్రభుత్వం ఇస్తానన్న స్వపరిపాలన హక్కును ఆమోదిస్తూ ఫ్రాన్సుతో సంబంధాన్ని ఉంచుకోడానికి నిశ్చయించింది.

1950 ఫిబ్రవరి 26 తేదిన వచ్చిన వార్తప్రకారం, రిఫరెండం జరపడానికి ఫ్రెంచి ప్రభుత్వం నిర్ణయించినట్లు తెలిసింది.

## పోర్చుగీసు సెటిల్మెంట్లు

పోర్చుగీసువారు మొట్టమొదట (1510) లో భారతదేశంలోఆక్రమించుకున్న ప్రదేశం గోవా. ఇప్పటికీ ఇది వారి పాలనలోనేవుంది. నేడు దేశంలో పోర్చుగీసువారి అధీనంలోవున్న ప్రాంతంమొత్తం 3,983 కిలోమీటర్లు. ఈ ప్రాంతమంతా బొంబాయి రాష్ట్రంలో నూడు విడివిడి ప్రదేశాలుగావుంది. అదేమిటంటే, గోవా, దయ్యూ, డామన్. వీటన్నిటికీ రాజధాని నొవాగోవా. ఇది, పశ్చిమతీరంలోవున్న మర్మగోవాప 6 మైళ్ల దూరంలో నూతనంగా నిర్మింపబడింది. పోర్చుగీసు సెటిల్మెంట్ల గవర్నర్

జనరల్ ఇక్కడే వుంటాడు. డయ్యు, డామన్‌లలో ఒక్కొక్క లెఫ్టి నెంట్ గవర్నర్ ఉంటాడు. పోర్చుగీసు సెటిల్మెంట్ల మొత్తంలో 1931 లో 5,79,970 మంది ప్రజలున్నారు. తరవాత జనాభా లెక్కలు తీసుకో లేదు. ఈ సెటిల్మెంట్ల మొత్తంలో నాలుగు పట్టణాలు, మూడు నగరాలు, సుమారు 600 గ్రామాలు వున్నాయి.

మర్మగోవా :

నోవాగోవా, మర్మగోవా పట్టణాలూ, పరిసరప్రాంతాలూ కలిపి గోవాజిల్లా అని వాడుకలో వున్నాయి. నోవాగోవా, పోర్చుగీసు సెటి ల్మెంటుకు రాజధాని అయినప్పటికీ రేవుపట్టణం మర్మగోవా. ఇది బొంబా యికి దక్షిణంగా 226 మైళ్ళదూరంలోవుంది.

డామన్ :

ఈజిల్లా, బొంబాయికి ఉత్తరంగా సుమారు 100 మైళ్ళదూరంలో సముద్రతీరానవుంది. ఈజిల్లా వైశాల్యం 86 చ. మైళ్ళు.

డయ్యు :

ఈ జిల్లా, భారతదేశపు పశ్చిమతీరాన, కథియవాడకు దక్షిణంగా వున్న చిన్నద్వీపం. దీనివైశాల్యం సుమారు 20 చ. మైళ్ళు. ఒకప్పుడు ఇది గొప్ప వ్యాపార కేంద్రంగా వుండేదిగాని, ప్రస్తుతం అనామకస్థితిలో వుంది.

# ప్రజారోగ్యము

ప్రజారోగ్యము విషయంలో ప్రభుత్వమువారు శ్రద్ధతీసుకొని దీని కొరకు ఒక ప్రత్యేక డిపార్టుమెంటును స్థాపించడం జరిగి యిప్పటికి సుమారు 76 ఏండ్లు అయింది. నగరములు పరిశుద్ధముగా వుండేటట్టు చూడడంలోనూ-అంటువ్యాధులు వ్యాపించకుండా చూడడంలోనూ. వ్యాధి చికిత్సకు ఉచితంగా సదుపాయాలు కలిగించడంలోనూ చాలా

అభివృద్ధి జరిగింది కాని ఇప్పటివరకు మనదేశంలో జరిగిన కృషి అంతా కూడా, జరుగవలసినదానిలో పదవవంతుకూడా కాదన్నమాట వాస్తవం.

మనదేశం, ప్రజారోగ్యం విషయంలో ప్రపంచంలోని యితర దేశాలతో పోలిస్తే, చాలా వెనుకబడి వున్నది. ఇంగ్లండు, జర్మనీ దేశాలలో సగటున ఒకమనిషి ఆయుర్దాయం 63 సంవత్సరాలూ, ఆస్ట్రేలియాలో 66 సంవత్సరాలూ అయితే, మనదేశంలో ప్రజల సగటు ఆయుర్దాయం 32 సంవత్సరాలు మాత్రమే అని లెక్క తేలింది.

ఇండియాలో 1951 ఏప్రిల్ 7 తేది నాటికి 30 మెడికల్ కాలేజీలు, 4 మెడికల్ స్కూళ్ళు ఉన్నాయి.

మనదేశంలో గవర్నమెంటు పరీక్షలు ప్యాసయిన వైద్యులు మొత్తం 60,000. అంటే సగటున ప్రతి 6,000 మంది ప్రజలకీ ఒక డాక్టరు ఉన్నాడన్నమాట, ఇదే లెక్కలో ఇంగ్లండులోచూస్తే ప్రతి 700 మంది ప్రజలకీ ఒక డాక్టరువున్నాడు. మనదేశమంతటా సుమారు 5,000 మంది నర్సులు వున్నారు.

అయితే, డాక్టర్లలోనూ నర్సులలోనూ నూటికి 80 వంతుల మంది పట్టణాలలోనే వున్నారు. పట్టణాలలో వుండే ప్రజలు, దేశపు జనాభాలో పదవవంతుమాత్రమే. అంచేత, నేడుమన గ్రామస్థులకు బొత్తిగా సరియైన వైద్యసహాయమే లేదన్నమాట.

ఇక, మనదేశంలో అత్యధిక సంఖ్యాకులుపడే జబ్బులుఏమిటంటే మలేరియా, టైఫాయిడ్, రక్తగ్రహిణి, కలరా, క్షయ, స్ఫోటకము, ఆహారలోపమువల్ల వచ్చే జబ్బులు.

అన్ని జబ్బులలోనూ, ఎక్కువమంది ప్రాణాలను హరిస్తున్నది మలేరియా. ఈ జబ్బు ఏడాదికి పదికోట్లమందికి వస్తోందనీ, ఏడాదికి $12\frac{1}{2}$ లక్షల మంది చచ్చిపోతున్నారనీ తెలుస్తోంది.

రెండవ ప్రమాదకరమైన జబ్బు క్షయ. ఈ జబ్బువల్ల ఏడాదికి సుమారు అయిదు లక్షలమంది చనిపోతున్నారనీ, దాదాపు 35 లక్షల మంది యీ జబ్బుతో అవస్థపడుతున్నారనీ, అంచనా.

ఇండియాలో క్షయరోగుల చికిత్సకు 194 ఆస్పత్రులు మాత్రమే వున్నాయి. మామూలు ఆస్పత్రులలో 114 వార్డులు వున్నాయి. మొత్తం. 10,371 మంది రోగుల పడకకు వసతివుంది. ఈ రోగ చికిత్సకు సరియైన ప్రయత్నం జరగాలంటే అధమం 4,000 ఆస్పత్రులు, సుమారు అయిదులక్షల రోగులు వుండటానికి వసతితో, స్థాపించాలని అంచనా.

మనదేశంలో స్ఫోటకంవల్ల చనిపోయినవారిలో అత్యధిక సంఖ్యాకులు, పది సంవత్సరాలలోపు పిల్లలు.

మలేరియా జ్వరాలు, గత సంవత్సరాలకంటె ఎక్కువగా లేవు.

ఇండియాలో సుమారు పదిలక్షలమంది కుష్ఠురోగులున్నారు.

క్షయరోగం రాకుండా ముందు టీకాలువేసే పద్ధతి ఇటీవల కనుగొనబడింది. ఈ టీకాలను బి. సి. జి. వాక్సీన్ అంటారు. యునైటెడ్ నేషన్సుకు చెందిన ప్రపంచ ఆరోగ్యసమిన అధ్వర్యాన అనేకదేశాలలో యీ టీకాలను వెయ్యడం అయిదు సంవత్సరాలుగా జరుగుతున్నది. 1948 ఆగస్టులో ఇండియాలోకూడా యీ పద్ధతి ప్రవేశపెట్టబడింది. స్కాండినేవియానుంచి కొంతమంది నిపుణులు ఇండియాకువచ్చి, చిన్న సమూహాలుగా ఏర్పడి ఇండియాలో పనిచేస్తున్నారు. 1949 సంవత్సరాంతానికి ఇండియాలో స్కాండినేవియన్ నిపుణుల సమూహాలు ఆరున్నూ భారతీయ నిపుణుల సమూహాలు 21 పనిచేస్తున్నాయి. ఇలాటి పనిలో యింకా ఎక్కువమందికి శిక్షణ యివ్వడంకూడా జరుగుతోంది. 1950 సంవత్సరాంతానికి యిలాటి సమూహాలు 200 తయారవుతాయని అంచనా.

ప్లేగు :

ప్లేగువ్యాధి కారణం ఎలుకలు. ఈ వ్యాధిగల ఎలుకలను కుట్టిన దోమలు, లేక యీగలు మనుష్యులకు యీ వ్యాధిని తగిలిస్తాయి. ఇంటిలో ఎలుకలు లేకుండా ప్రతివారూ జాగ్రత్తపడాలి. ఎలుకలు వృద్ధిపొంద

డానికి సహాయకరములైన చెత్త, కుళ్ళు పదార్థములు ఇంటిలోనూ, ఇంటి పరిసరములలోనూ వుండకుండా చూడాలి. ఆహార పదార్థములను ఎలుకలు ముట్టుకోకుండా, మూతలు వేసిన పాత్రలో వుంచాలి.

ప్లేగు రాకుండా ప్రతివ్యక్తి టీకాలు వేయించుకోడం మంచిది. చచ్చిపడిన ఎలుకలు ఇంటిలోగాని, ఇంటిపరిసరములలోగాని కనపడితే. వెంటనే ఆరోగ్య శాఖాధికారులకు తెలియపరచాలి. ప్లేగు జ్వరపులక్షణాలు కనపడినట్లయితే, ప్రతివ్యక్తీ వెంటనే వైద్యుని దగ్గరకు వెళ్ళి చికిత్స పొందాలి.

## ఆరోగ్యము : ఆహారము

మనదేశంలోని ప్రజలకు పెద్దలోపం ఏమిటంటే, విద్యావిహీనత్వంతోపాటు సరియైన ఆహారంకూడా లేకపోవడం. ఇటీవల మన దేశంలోని ప్రజల ఆహారస్థితిని పరిశీలించిన ఒక కమిషనువారు దేశంలోని జనాభాలో నూటికి ముప్పయివంతులమంది, శరీరాన్ని రోగాల పాలబడకుండా తగిన దార్ఢ్యత యివ్వవలసిన దానికంటె చాలా తక్కువ ఆహారాన్ని తింటున్నారని తేల్చారు.

ఆహారం సరియైనది లేకపోవడంవల్ల మనిషికి అనేకజబ్బులు వస్తాయి. సరియైన ఆహారం తినగలిగిన శక్తిగలవారుకూడా, అనేకమంది దేహపుష్టికి కావలసిన ఆహారం ఏమిటో తెలియక కొన్ని పదార్థాలను ఎక్కువగానూ కొన్ని పదార్థాలను తక్కువగానూ తినడం జరుగుతోంది. అందువల్ల దేహానికి సమపుష్టి కలిగించవలసిన పద్ధతిలో ఆహారం సమపాళ్లలో అందక అనేకమంది వ్యాధుల పాలబడుతున్నారు.

ప్రతిమనిషికి తనపని తాను చేసుకోడానికి శక్తికావాలికదా. ఈ శక్తికి తగినపుష్టిని యిచ్చే ఆహారాన్ని తినాలి. ఈ శక్తికి, శాస్త్రజ్ఞులు 'కేలరీ' అనే పేరుపెట్టారు. మనం తినే ఆహారపుకొలత, యీ కేలరీలలో సూచిస్తారు. వివిధవృత్తులలో వున్నవారికి, వివిధపరిమాణంలో కొన్ని

కేలరీలశక్తిగల ఆహారం కావాలి. ఈ విషయంలో శాస్త్రజ్ఞులు, యీ క్రింది పట్టిప్రకారం ఆహారపు కేలరీల విలువ వుండాలని సూచించారు.

| వృత్తి | ఆహారపు కేలరీలు |
| --- | --- |
| గుమస్తా | 2,600 |
| డాక్టరు | 2,760 |
| టైపిస్టు | 2,800 |
| గృహిణి | 2,800 |
| సైనికుడు | 3,150 |
| వడ్రంగి | 3,190 |
| కూలిపనివాడు | 3,610 |
| కమ్మరి | 4,120 |
| కట్టెలు కొట్టేవాడు | 5,500 |

మామూలుగా పురుషుడు చేసేపనినే చేసే స్త్రీ, పురుషుడు తినే ఆహారంలో అయిదింట నాలుగువంతులు తింటుందని అంచనా.

మనదేశంలో ప్రతివ్యక్తి రోజుకు 2,500 కేలరీలశక్తినియిచ్చే ఆహారాన్ని తినాలని శాస్త్రజ్ఞుల అభిప్రాయం, అయితే, మనదేశంలో చాలామంది తినే ఆహారం, రోజుకు 1,200 కేలరీలలోపలే వుంటున్నది కాని అంతకు మించడంలేదని పరిశోధనలవల్ల తేలింది.

రోజుకి శరీరానికి 2.500 కేలరీలశక్తిని యివ్వడానికి యీ క్రింది లెక్కలో ఆహారం తినాలని శాస్త్రజ్ఞులు సూచించారు.

| | | |
| --- | --- | --- |
| ధాన్యములు | 16 | ఔన్సులు |
| పప్పుదినుసులు | 3 | ,, |
| చక్కెర | 2 | ,, |
| కూరగాయలు | 6 | ,, |
| పండ్లు | 2 | ,, |
| నూనెలు | 2 | ,, |
| పాలు | 8 | ,, |

పైనచెప్పిన కొలతలో ఆహారం తినేవారికి, ఆహారలోప సంబంధమైనజబ్బు లేమీ రావడానికి అవకాశంలేదు. అయితే, యీ ఆహారం తీసుకోవడంలో-కూరగాయల విషయంలో ప్రత్యేకశ్రద్ధ కనపరచాలి. వివిధములైన విటమినులుగల కూరగాయలను, ప్రతిరోజూ మారుస్తూ తింటూవుండాలి. లేనట్లయితే-విటమిన్లలోపంవల్ల వచ్చే జబ్బులు వస్తాయి.

## విటమినులు

మనిషికి జీవశక్తినిఇచ్చే ఆహారపదార్థాలను విటమినులు అంటారు. ప్రతిమనిషీ, తన ఆహారంలో యీ విటమినులన్నీ వుండేటట్టు చూచుకోవాలి. ఈ విటమినులు ఏమిటో, అవి లోపిస్తే ఏమిజబ్బులువస్తాయో, అవి ఏ ఆహారంలో వున్నాయో మొదలైన వివరాలన్నీ యీ క్రింద యివ్వబడినవి.

విటమిన్ 'ఏ'—ఇది శరీరానికి దార్ఢ్యాన్ని యిచ్చి, రోగ క్రిములను ఎదుర్కొనేశక్తిని దేహానికి యిస్తుంది. విటమిను 'ఏ' లోపించిన వారికి నీరసము, శ్వాసావయవములకు సంబంధించిన జబ్బులు, కంటిజబ్బులు, సరిగా యెదగకపోవడం, రేచీకటి, మొదలైన జబ్బులు కలుగుతాయి. ఈ విటమిన్ లోపించకుండా వుండాలంటే ఆకుపచ్చని కూరగాయలు, చేపలు, చేపనూనె, పాలు, వెన్న, మీగడ, పెరుగు, నెయ్యి, గుడ్లు, మొదలైనవి తినాలి.

విటమిన్ 'బి' 1—ఇది జీర్ణశక్తిని కాపాడే విటమిన్. ఇది ఆహారంలో లోపించినట్లయితే, మనిషికి అన్నంమీద ఏవగింపుపుట్టడం, తూకం తగ్గిపోవడం, జీర్ణశక్తి మందగించడం, గుండెజబ్బులు, అలసట, నరముల బలహీనత. నరముల కంపము, వంటికి నీరుపట్టడం మొదలైన జబ్బులు వస్తాయి. ఈ విటమిను ఎక్కువగా మజ్జిగలోనూ, మొక్కగట్టిన ధాన్యాలలోను, మేకకాలేయములోనూ, యీస్టులోను వుంది.

విటమిన్ 'బి' 2—ఇది శరీరపు ఎదుగుదలకు అవసరమైనది. ఇది ఆహారంలో లోపించినట్లయితే, చర్మరోగాలు, నాలుకపూత; నోటిపూత, కడుపులోపుండ్లు, కడుపునొప్పి, అజీర్ణము, కళ్ళజబ్బులువస్తాయి.

ఇది ఎక్కువగావుండే ఆహారపదార్థాలు ఏమిటంటే. ఈస్టు, పాలు, ఆకు కూరలు, మాంసము; మేక కాలేయము, పప్పుదినుసులు.

విటమిన్ 'సి'—దీనిని సరిపడినంతగా తినలేకపోతే, 'స్కర్వీ' అనే జబ్బువస్తుంది. జీర్ణశక్తి సరిగావుండదు. ఈ విటమిను చాలా ఎక్కువగా ఉసిరికాయలలోను, టొమటో పండ్లలోను వుంది. మామిడి, నారింజ, బత్తాయి మొదలైన పండ్లలోకూడ తగినంతగా వుంది.

విటమిన్ 'డి'—శరీర దార్ఢ్యానికి ప్రధానమైనది. చిన్నపిల్లల ఆహారంలో యీ విటమిను లోపించినట్లయితే వారికి దొడ్డికాళ్ళుపడడం, ఎముకలు గట్టిగావుండక మెత్తపడటం మొదలైన జబ్బులు వస్తాయి. గర్భిణీ స్త్రీలు ముఖ్యంగా, యీ విటమినును ఎక్కువగా తినాలి. ఇది ఎక్కువగావుండే పదార్థాలు ఏమిటంటే: పాలు, వెన్న, నెయ్యి, పంచదార, చేపనూనె మొదలైనవి: అంతేగాక, కొంచెముసేపు ఎండలో నిలబడితే, శరీరంలో విటమిన్ 'డి' వుత్పత్తి అవుతుంది.

పైచెప్పిన విటమినులుకాక, శరీరంక్షణకు ప్రొటీను పదార్థములు, శరీర దార్ఢ్యానికి పిండిపదార్థములు, ఎముక గట్టితనానికి కాల్షియం (సున్నం); రక్తవృద్ధికి లోహము (ఇనుము), కూడా తగినంతగా ఆహారంలో వుండేటట్లు చూచుకోవాలి.

ప్రొటీను పదార్థములు :పాలు, మాంసము, చేపలు, పప్పుదినుసులు.

పిండిపదార్థములు : బియ్యము, గోధుమలు, మొదలైన ధాన్యములు అరటిపండ్లు.

కాల్షియం: ప్రధానంగా పాలు, ఆకుకూరలు, తమలపాకులలో వేసుకునే సున్నం.

లోహం : ఆకుకూరలు.

# ఆహారధాన్యాలపంట

ప్రస్తుతం భారతదేశంలో 35 కోట్లు పైగా జనాభా వుంది. మనిషికి రోజుకు 18 ఔన్సుల లెక్కన; ఏడాదికి 4,80,00,000 టన్నుల ఆహారధాన్యాలు మనకు కావాలి.

1948 లో 3,84,35,000 టన్నులూ, 1949 లో 3,53,40,000 టన్నులూ, 1950 లో 4,60,18,000 టన్నులూ, 1951లో4,17,23,000 టన్నులూ ఆహారధాన్యాలు ఇండియాలో పండినవి. ఈ పంట ప్రజల అవసరాలకు చాలనందున, మనం విదేశాలనుంచి ఆహారపదార్థాలను విశేషంగా దిగుమతి చేసుకోవలసి వచ్చింది. 1948-49లో రు. 110 కోట్ల 66 లక్షలు, 1949-50 లో రు. 92 కోట్ల 54 లక్షలు, 1950-51 లో రు. 40 కోట్ల 30 లక్షలు విలువగల ధాన్యాలను విదేశాలలో ఇండియా కొన్నది. ఆ ధాన్యాలను ఇండియాకు చేర్చడానికి అయిన ఖర్చులతో, ఆహారధాన్యాలకు గాను 1948-49 లో రు. 186 కోట్ల 85 లక్షలు, 1949-50 లో రు. 124 కోట్ల 63 లక్షలు, 1950-51 లో రు.130కోట్ల 55 లక్షలు మొత్తం వ్యయమైంది.

1952 లో రు. 210 కోట్ల విలువగల 38,60,000 టన్నుల ఆహారధాన్యాలను ఇండియా, విదేశాలనుంచి దిగుమతి చేసుకొన్నది.

విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవడంవల్ల డబ్బు చాలా వ్యయమై పోతున్నది. దేశంలోనే అవసరమైనంతవరకు ఆహారపదార్థాలను వుత్పత్తి చేసుకుంటే, విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోడానికి ఖర్చుపెట్టేడబ్బు మిగులుతుంది. ఆ డబ్బుతో, పరిశ్రమలను వృద్ధిపొందించడానికి కావలసిన యంత్ర సామగ్రిని కొనవచ్చును. కాబట్టి, విదేశాలనుంచి ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవడం శీఘ్రమైనంత త్వరలో నిలిపివెయ్యడానికి నిశ్చయించి, దేశంలోనే ఎక్కువ భూమిని వ్యవసాయం చెయ్యడానికీ, నీటితీరువ సదుపాయలను కల్పించి, ఒకసారి పంటపండే భూమిలో రెండు పంటలు పండించడానికీ కార్యక్రమాలను ప్రభుత్వం తయారుచేసింది.

ఈ కార్యక్రమాల ఫలితంగా, ఇండియాలో 1952-53 లో 5,60,00,000 టన్నుల ఆహారధాన్యాలను అంటే 1951-52 లో పండినదానికంటె 54,80,000 టన్నులు అధికంగా, పండించడము జరిగింది. 1952 లో 38,60,000 టన్నుల ఆహారధాన్యాలను దిగుమతి చేస్తే, 1953 లో 20,20,000 టన్నుల ఆహారధాన్యాలను మాత్రమే ఇండియా దిగుమతి చేసుకొన్నది. 1954 లో 20 లక్షల టన్నులకంటె ఎక్కువ ఆహారధాన్యాలను దిగుమతి చేసుకోవలసిన అవసరం వుండదని ఊహించబడుతున్నది.

1952 లో ఇండియా 7,00,000 టన్నుల బియ్యాన్ని దిగుమతి చేసింది. కాని, 1953 లో 2,00,000 టన్నుల బియ్యం మాత్రమే దిగుమతి చేయబడింది.

1952-53 లో ఇండియాలో 67,60,000 టన్నుల బియ్యము పండినవి.

## వ్యవసాయ భూమి

ఇండియాలో వ్యవసాయములోవున్న భూమి, అడవి, వ్యవసాయానికి రానిభూమి, యెంతవున్నదీ ఈ క్రింది పట్టీనిబట్టి తెలుసుకోవచ్చును. (భూమి కొంత ఎకరాలలో యివ్వబడినది).

| భూమి వివరం | 1950-51 |
|---|---|
| సర్వేవల్ల తేలిన లెక్క | 81,08,09,000 |
| అడవి | 10,02,41,000 |
| వ్యవసాయానికి రానిది | 11,68,55,000 |
| వాగుల మధ్య చిక్కుపడి వ్యవసాయం లేకుండావున్నది | 6,88,50,000 |
| పంట వేసిన భూమి | 29,15,95,000 |
| పంట వేసినదానిలో, నీటి పారుదలవున్న భూమి | 5,13,39,000 |

## పంట వేసినభూమి. పంటలు :

1951-52 లో ఇండియాలో ఏఏపంటక్రింద ఎంతభూమివున్నదీ. ఏపంట ఎంతపండినదీ వివరాలు ఇవి :

| ధాన్యం | భూమి (వేల ఎకరాలలో) | పంట (వేలటన్నులలో) |
|---|---|---|
| వరి | 73 595 | 20,767 |
| గోధుమ | 23,235 | 5,768 |
| జొన్న | 38,329 | 5,509 |
| సజ్జ | 21,856 | 2,153 |
| రాగులు | 5,296 | 1,167 |
| వేరుశనగ | 11,130 | 3,037 |
| చెరకు | 4,727 | 5,895 (బెల్లం) |
| జనపనార | 1951 | 4,678 (బేళ్లు) |
| ప్రత్తి | 16,213 | 3,134 (బేళ్లు) |
| పప్పుదినుసులు | 43,269 | 7,738 |

## కృషి పండిత్

భారతదేశంలోని వివిధరాష్ట్రాలలో, ఇతరులకన్న ఎక్కువగా పంట పండించినవారికి రు. 5000 నగదుగాని, రు. 7,700 విలువ జేసే ట్రాక్టరుగాని బహుమతిగా ఇవ్వడానికి ఇండియా ప్రభుత్వం నిశ్చయించింది. ఈ బహుమతితోపాటు కృషి పండిత్ అనే బిరుదు కూడా ఇవ్వబడుతుంది. 1952 లో, యీ బహుమతికి ఆర్గురు అర్హత పొందారు. వారికి బిరుద ప్రదానం, బహుమతి ప్రదానం, 1953 జనవరి 6 న ఢిల్లీలో జరిగింది. వారి పేర్లు ఇవి : 1. జయపాల్ భనేరా; ఉత్తర ప్రదేశ్; 2. సర్దార్ గురుదేవ్ సింగ్, పంజాబ్; 3. వలాయత్ రాం పంజాబ్; 4. జంగమ సంగయ్య, కూర్గు; 5. భీమ గౌడ దాదా, బొంబాయి; 6. రామచంద్ర మరాటీ, బొంబాయి.

పై ఆర్డరిలో, జంగమసంగయ్య, ఒక ఎకరంలో 136 మణుగుల ధాన్యం పండించాడు. ప్రపంచంలో ఇంతవరకు, ఒకే ఎకరంలో ఇంత ధాన్యం ఎవరూ పండించలేదట.

# అడవులు

ఇండియా వైశాల్యంలో నూటికి 22.6 వంతులు, అంటే సుమారు 1,71,000 చ. మైళ్లు అడవి.

సంస్థానాల యూనియనులు మినహాగా ఇండియాలోని రాష్ట్రాలన్నిటిలోను (1946-47 లెక్కల ప్రకారం) ఉన్న అడవుల విస్తీర్ణం మొత్తం 1,60,356 చ. మైళ్లు. ఈ అడవి వివరం, రాష్ట్రాలవారీగా ఇది: అంకెలు చదరపు మైళ్లు.

అస్సాం, 21,637; అజ్మీర్, 593, అండమాన్ దీవులు, 2,500; బీహార్, 9,947; బొంబాయి, 12,872, మధ్యప్రదేశ్, 47,057; కూర్గ్, 1,175; పంజాబ్, 4,761, మదరాసు, 33,666; ఒరిస్సా, 4,492; ఉత్తరప్రదేశ్, 17,362; పశ్చిమ బెంగాల్, 4,284.

ఈ అడవి 1,60,356 చ. మైళ్లలో 1,04,670 చ. మైళ్లు ప్రభుత్వపాలనలోను, 55,282 చ. మైళ్లు ప్రత్యేక వ్యక్తుల అధీనంలోను, 404 చ. మైళ్లు సంస్థల అధీనంలోనువుంది.

రాష్ట్రాలన్నిటిలోను ప్రభుత్వ స్వాధీనంలోవున్న 1,04,670 చ. మైళ్లు అడవిలోనూ 47,759 చ. మైళ్ళ అడవిలో కలప లభిస్తున్నది.

మొత్తం అడవిలో 29,578 చ. మైళ్ళ అడవిలో పశువులను సంవత్సరం పొడుగునా మేపడానికి ఉత్తరువులు ఇవ్వబడినవి.

అడవులవల్ల కేంద్రప్రభుత్వానికి ఏడాదికి రు. 10,48,00,000 ఆదాయం వస్తుందని అంచనా.

# పంట కాలువలు

భారతదేశంలో పొలాలకు నీటిని అందిచ్చే కాలువలపొడవు 60,000 మైళ్లు వుంటుంది. ఈ కాలువలవల్ల దాదాపు అయిదు కోట్ల ఎకరాలపొలం సాగుఅవుతుంది. అయినప్పటికీ, ఇంకా ఎక్కువ పంటకాలువలను త్రవ్వించి ఎంతో ఎక్కువభూమికి నీటిని అందచెయ్య వలసిన అవసరం ఎక్కువగావుంది. అలాచేసినట్లయితే, ఇంకా ఎంతో ఎక్కువపంట పండుతుంది. ప్రస్తుతం బీడుగావున్న భూమిలో చాలా భాగం నీటిపారుదలవుంటే వ్యవసాయానికి అక్కరకు వస్తుంది.

1950-51 లో ఇండియా మొత్తంలో 29,15,95,000 ఎకరాల భూమిలో పంట వెయ్యబడింది. దీనిలో 5,13,39,000 ఎకరాల భూమికి నీటిసాగు లభించింది.

నీటిపారుదల సౌకర్యాలను ఇంకా ఎక్కువచెయ్యడమూ, నదుల లోనినీరు వృధాగా సముద్రంలోకిపోకుండా ఆనకట్టలను, రిజర్వాయర్లను కట్టి ఆనీటిని కాలువలద్వారా బీడుభూములకునూ, మెట్టభూములకును సరఫరాచేసి పంటలను ఎక్కువచెయ్యడమూ ప్రభుత్వ కార్యక్రమాలలో ఒకటి. ఇండియాలోని నదులనీటిలో ప్రతిసంవత్సరమూ నూటికి ఆ రేడు వంతులు మాత్రమే ఇలా ఉపయోగింపబడుతున్నదనీ, తక్కిన నీరంతా వృధాగా పోతున్నదనీ, పరిశోధనలవల్ల తేలింది.

# విద్యుచ్ఛక్తి

గత 10 సంవత్సరాలలోను ఇండియాలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చెయ్యడం బాగా ఎక్కువైంది. 1953లో ఇండియాలో 18,55,000కిలో వాట్ల విద్యుచ్ఛక్తినివుత్పత్తిచేసేయంత్రాలు పనిచేసినవి. గ్రామీణప్రాంతాలకు విద్యుచ్ఛక్తిని సప్లయిచెయ్యడంలో చాలా అభివృద్ధిజరిగింది. అయితే, యీ అభివృద్ధి ఎక్కువగా మదరాసు, మైసూరు, ఉత్తరప్రదేశ్, పంజాబ్ రాష్ట్రాలలోనే జరిగింది. విద్యుచ్ఛక్తి సప్లయి జరిగిన గ్రామాలు ఇండి

17 తేదిన హైదరాబాదు, ఇండియాకులొంగిపోయింది. ఇండియా సేనలు హైదరాబాదుకు 30 మైళ్ళ సమీపంలోకివచ్చేసరికి, లాయక్ ఆలిమంత్రి వర్గం రాజీనామా యిచ్చింది. నిజాం, ఆ రాజీనామాను అంగీకరించి, ఇండియా సైన్యాలను హైదరాబాదును ఆక్రమించి, శాంతిభద్రతలను నెలకొల్పవలసిందిగా కోరాడు. సెప్టెంబరు 11 తేది సాయంకాలం, ఇండియా సేనలు హైదరాబాదునగరంలో ప్రవేశించాయి. భద్రతామండలిలో ఫిర్యాదును ఉపసంహరించుకోడానికి, రజాకార్ల ముఠాను తొలగించడానికి, నిజాం ఫర్మానా చేశాడు.

హైదరాబాదులో ఇండియాసేనలు ప్రవేశించేటప్పటికి, సంస్థానం పరిస్థితిఅంతా అల్లకల్లోలంగావుంది. సంస్థానంలో శాంతినెలకొల్పడం, ప్రజాపరిపత్తును ఏర్పరచడం, సక్రమపరిపాలనను ఏర్పాటు చెయ్యడం, ఇండియాప్రభుత్వకర్తవ్యమైంది. పరిస్థితులు చక్కబడేదాకా, పరిపాలన సాగించడానికి మేజర్-జనరల్ జె. ఎన్. చౌధురి హైదరాబాదుకు మిలిటరి గవర్నరుగా నియమింపబడినారు. ఛీఫ్ సివిల్ అడ్మినిస్ట్రేటర్‌గా డి. ఎస్. భక్లె. అడిషనల్ అడ్మినిస్ట్రేటర్‌గా డి. ఆర్. ప్రధాన్, నియమింపబడినారు. సంస్థానంలోని 17 జిల్లాలలోను పరిపాలనను సక్రమమార్గంలోకి తీసుకురావడానికి, ఇండియా రాష్ట్రాలనుంచి 17 మంది కలెక్టర్లు, 17 మంది జిల్లా పోలీసు సూపరింటెండెంట్లు హైదరాబాదుకు పంపబడినారు. 1949 డిసెంబరు 1 నుంచి, సంస్థాన పరిపాలనకు జనరల్ చౌధురిస్థానే ఎం. కె. వెల్లోడి నియమింపబడినారు.

1949 డిసెంబరు 1 తేదిన ఎం. కె. వెల్లోడి ప్రధాన మంత్రిగా, యీ క్రింది మంత్రిమండలి ఏర్పాటు చేయబడింది. ప్రధాన మంత్రి: ఎం. కె. వెల్లోడి, హోంమంత్రి: డి. ఎస్. భక్లె, ఆరోగ్యమంత్రి: నవాబ్ జెయిన్ యార్‌జంగ్ బహదూర్; విద్యామంత్రి: రాజాధోండిరాజ్ బహదూర్, రెవిన్యూ మంత్రి: ఎం. శేషాద్రి, ఆర్థిక మంత్రి: సి. వి. ఎస్. రావు, కార్మికమంత్రి: సి. హెచ్. కృష్ణారావు. కాని ప్రజానాయకులనుకూడా ప్రభుత్వపాలనతో సంబంధం పెట్టుకోనేటట్టు చూడవలసిందని ఆందోళన ఎక్కువైనందున, సంస్థాన కాంగ్రెసుతో

ప్రభుత్వం రాయబారాలు జరిపింది. తత్ఫలితంగా సంస్థాన కాంగ్రెసు ప్రతినిధులు నలుగురు (బూర్గుల రామకృష్ణరావు, వినాయకరావు విద్యాలంకార్, వల్లూరు బసవరాజు, ఫూల్‌చంద్ గాంధీ) మంత్రులుగా ప్రభుత్వంలో చేరడానికి అంగీకరించారు. వీరితో క్రొత్తమంత్రిమండలి, 1950 నుంచి జూన్ 5 తేదిన ఏర్పాటు చేయబడింది. పూర్వపు మంత్రి మండలి నుంచి డి. ఎస్. భక్లే. ధోండిరాజ్ బహదూర్, సి. హెచ్. కృష్ణా రావుగారు రాజీనామా యిచ్చారు. కొత్తమండలి జూన్ 12 తేదిన ప్రమాణ స్వీకారం చేసింది. తరువాత ఎన్నికలు జరిగినవి.

ఎన్నికల అనంతరం, వయోజన ఓటింగు హక్కుతో ప్రజలుఎన్నుకున్న మొట్టమొదటి శాసనసభకు 1952 మార్చి 23 న రాజప్రముఖ్ ప్రారంభోత్సవం జరిపారు.

రాజప్రముఖ్ : హిస్ ఎగ్జాల్టెడ్ హైనెస్ రుస్తుమ్-ఇ-దౌరాన్ అరస్తు-ఇ-జమాన్, లెప్టినెంటు జనరల్ ముజఫర్ ఉల్ ముల్క్ వాల్ మామలిక్ నవాబ్ మీర్ ఉస్మాన్ అలీఖాన్ బహదూర్ ఫతేజంగ్ సిపాహి సాలార్ నిజాముద్దౌలా నిజాముల్ ముల్క్ అసఫ్‌జా.

యువరాజు : హిస్ హైనెస్ నవాబ్ మీర్ హిమాయత్ అలీ ఖాన్ అజం బహదూర్, బీరారు యువరాజు.

ప్రీవీపర్స్ : నిజాం సొంత ఖర్చులకుగాను ఏడాదికి 50 లక్షల రూపాయలు ప్రీవీపర్స్ ఇవ్వబడుతున్నది. ఇదిగాక, నిజాంసొంతఆస్తిగా పరిగణింపబడుతున్న సర్ఫ్‌కాస్ భూములను సంస్థాన ప్రభుత్వం స్వాధీన పరచుకున్నందున, యీభూములనుంచివచ్చేఆదాయానికి నష్టపరిహారంగా నిజాంకు ఏడాదికి 50 లక్షల రూపాయలు ఇవ్వబడేది. కాని, యీ నష్ట పరిహారాన్ని 1954-55 నుంచీ రు. 25 లక్షలకు తగ్గించుకోడానికి నైజాం అంగీకరించారని 1954 మార్చి 26 న ప్రకటింపబడినది.

శాసనసభ :

ఈ రాష్ట్రంలో లెజిస్లేటివ్ అసెంబ్లీమాత్రం వుంది. అసెంబ్లీ సభ్యుల సంఖ్య మొత్తం : 175

వీరిలో షెడ్యూల్డు కులాలకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నుకోబడిన వారు. 30

షెడ్యూల్డు కొండజాతులకు ప్రత్యేకించిన స్థానాలనుంచి ఎన్నుకోబడిన వారు 2

రాష్ట్ర శాసనసభ ఎన్నికలలో మొత్తం 175 స్థానాలలోను, నాలుగు స్థానాలకు కాంగ్రెసు అభ్యర్థులు పోటీలేకుండా ఎన్నుకోబడినారు. తక్కిన 171 స్థానాలకూ 554 మంది పోటీచేసారు. పార్టీల వారీగా ఆ అభ్యర్థుల వివరాలివి: కాంగ్రెసు, 168; సోషలిస్టులు, 98; పీపుల్సు డెమొక్రటిక్ ఫ్రంట్; 75; షెడ్యూల్డుజాతుల ఫెడరేషన్, 20; రైతుకూలీ పార్టీ, 17; ప్రజాపార్టీ, 6, రామరాజ్య పరిషత్, 6; స్వతంత్రులు, 155; తక్కిన పార్టీలు, 9.

రాష్ట్ర శాసనసభలో పార్టీల బలం.

కాంగ్రెసు, 92; సోషలిస్టు, 11; కమ్యూనిస్టులు, వారి సహచరులు, 42; షెడ్యూల్డు కాస్టు ఫెడరేషన్, 5; సోషలిస్టులు, 11; పెజంట్స్ అండ్ వర్కర్స్, 10 స్వతంత్రులు, 13.

స్పీకర్ : కాశీనాథరావు వైద్య (రు. 1,250)
డిప్యూటి స్పీకర్. పంపన్ గౌడ (రు. 750)

శాసనసభ్యుల జీతాలు: నెలకు రు. 200; కాక; సభా సమావేశానికి హాజరైన ప్రతిరోజుకీ రు. 12-8.0 భత్యం.

## మంత్రిమండలి :

1952 మార్చి 6 న 13 మంది మంత్రులతో మంత్రి మండలి స్థాపించబడినది. 1953 మార్చి 1 న యీ మంత్రిమండలి నుంచి ఫూల్ చంద్ గాంధి; వి. బి. రాజు; జగన్నాథరావు చందార్కిగార్లు తొలగించబడినారు. తరువాత 1954 జనవరి 25 తేదిన యీ మంత్రి మండలికూడా మారింది. ముగ్గురుమంత్రులు, జి. అన్నారావు, దేవసింగ్ చౌహాన్, శంకరరావుగార్లు మంత్రిమండలినుంచి తొలగించబడినారు. కొత్తగా ఎక్బొటెగారు నియమింపబడినారు. ప్రస్తుతపు మంత్రిమండ

టీలో 8 మంది మంత్రులు, 8 మంది డిప్యూటీ మంత్రులు వున్నారు. హైదరాబాద్ రాష్ట్రంలో డిప్యూటీమంత్రుల నియామకం మొట్ట మొదటిసారిగా 1954 ఫిబ్రవరి 4 న జరిగింది.

## ప్రస్తుతపు మంత్రిమండలి ఇది :

ముఖ్యమంత్రి : పరిపాలనా వ్యవహారాలు, సాంఘిక సేవా కార్యక్రమములు, ప్రచురణశాఖ : బూర్గుల రామకృష్ణారావు

ఆర్థికమంత్రి : వాణిజ్యం, పరిశ్రమలు : వినాయకరావ్ విద్యాలంకార్

హోంమంత్రి, న్యాయశాఖ : డి. జి. బిందు

పబ్లిక్ వర్క్సుమంత్రి : కార్మికులు : డాక్టర్ జి. ఎస్. మెల్కోటే

రెవిన్యూమంత్రి : ఎక్సైజు, అడవులు : కె. వి. రంగారెడ్డి

ఆరోగ్యమంత్రి : గ్రామ పునర్నిర్మాణం : నవాబ్ మెహదీ నవాజ్ జంగ్

స్థానిక పరిపాలన మంత్రి : విద్య : గోపాలరావు ఎక్బోటె

వ్యవసాయమంత్రి : డెవలప్‌మెంట్ : డాక్టర్ ఎం. చెన్నారెడ్డి

## డిప్యూటీ మంత్రులు

శంకరదేవ్ వేదాలంకార్, అరిగె రామస్వామి, శ్రీనివాసరావు ఏకాలికార్, పి. హనుమంతరావు, విరూపాక్షప్ప, ఎం. ఎస్. రాజలింగం, భగవంతరావ్ జి. గాఢే, శ్రీమతి సంగం లక్ష్మీబాయి.

మంత్రులజీతాలు : నెలకు రు, 1,250: జీతంకాక. ముఖ్యమంత్రికి నెలకు రు. 750, తక్కినమంత్రులకు రు. 500; స్పీకరుకు రు. 500 అలవెన్సులు ఇవ్వబడుతున్నవి. ఈ అలవెన్సులు, మంత్రులకు ఉచితంగా ఇవ్వబడే వసతిగృహాలను శుభ్రంగా ఉంచడానికీ, ఇంటిలో ఎలక్ట్రిసిటీ ఖర్చులకూ, వారికి ఉచితంగా ఇవ్వబడే కార్ల పెట్రోలు ఖర్చులకూ ఉద్దేశింపబడినవి. ప్రతిమంత్రికీ, స్పీకరుకూ వాడుకకు తలొకకారును ప్రభుత్వం ఇస్తారు. ముఖ్యమంత్రికి మాత్రం రెండు కార్లను ఇస్తారు.

డిప్యూటీ మంత్రులకు నెలకు రు. 750 జీతం, రు. 150 ఇంటి అద్దె అలవెన్సు, రు. 200 కారు అలవెన్సు ఇవ్వబడుతవి. గవర్నమెంటు కారులను వీరికి ఇవ్వరు.

### బడ్జెటు

1954-55 సంవత్సరానికి బడ్జెటును, 1954 మార్చి 1 న ఆర్థిక మంత్రి వినాయకరావు విద్యాలంకార్ ప్రవేశపెట్టారు. ఆ బడ్జెటు వివరాలివి.

| | | |
|---|---|---|
| అంచనా వేసిన ఆదాయం : | రు. | 27,96,40,000 |
| అంచనా వేసిన ఖర్చు : | రు. | 29,02,00,000 |
| లోటు అంచనా : | రు. | 1,05,60,000 |

# కమిషనర్ రాష్ట్రాలు

స్వపరిపాలన లేకుండా, ప్రెసిడెంటు పరిపాలనలోవున్న కొన్ని ప్రదేశాలను చీఫ్ కమిషనర్ల రాష్ట్రాలు అంటారు. వీటి పరిపాలనను ప్రెసిడెంటు అధికారానికి లోబడిన చీఫ్ కమిషనరు సాగిస్తాడు. ఇలాటి రాష్ట్రాలు ఇండియాలో 12 వున్నాయి. అవి: అజ్మీర్, అండమాన్ నికోబార్, కచ్, కూర్గు, ఢిల్లి, భోపాల్, మణిపూర్, విలాస్ పూర్, సిక్కిం, వింధ్యప్రదేశ్, హిమాచలప్రదేశ్.

## అజ్మీరు

ఇది రాజపుత్రస్థానంలో వుంది. దీనివైశాల్యం 2,417 చదరపు మైళ్ళు. జనాభా; 6,93,372; పురుషులు, 3,60,236; స్త్రీలు, 3,33,136; ప్రజలలో నూటికి 62 వంతులు వ్యవసాయంమీద ఆధారపడినవారు. ఇక్కడి ముఖ్యపంటలు, మొక్కజొన్న, రాగులు, బార్లీ, ప్రత్తి, తిలధాన్యములు, గోధుమ, ప్రభుత్వాదాయం ఏడాదికి రు. 116 లక్షలు. చీఫ్ కమిషనర్ : ఎం. కె. కృపలాని.

రాష్ట్రశాసనసభ్యులసంఖ్య 30. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు 6.

శాసనసభలో పార్టీల బలం : కాంగ్రెసు, 20; జనసంఘం 3; స్వతంత్రులు, 4; ఇతర పార్టీలు- 3.

స్పీకరు : భాగీరథిసింగ్ చౌధురి

మంత్రిమండలి : పదవీస్వీకారం : 1952 మార్చి 24

ముఖ్యమంత్రి : హరిభాయ్ ఉపాధ్యాయ

రెండవమంత్రి : బాలకృష్ణకౌల్

మూడవమంత్రి : బ్రిజ్ మోహన్ శర్మ

## అండమాన్, నికోబారు దీవులు

బంగాళాఖాతంలో, మదరాసుకు తూర్పుగా 740 మైళ్ళు, కలకత్తాకు దక్షిణంగా 780 మైళ్ళు దూరంలోవున్న అండమానుదీవులున్నూ ఈ దీవులకు దక్షిణంగా 85 మైళ్ళదూరాన, బంగాళా ఖాతంలోవున్న నికోబార్ దీవులున్నూ, ఇండియా ప్రభుత్వ పరిపాలనలో, ఒక చీఫ్ కమిషనర్ పాలనలో వున్నాయి.

అండమాను దీవులలో పెద్దవి ఆరున్నూ, చిన్న దీవులు సుమారు రెండువందలున్నూ వున్నాయి. వీటివైశాల్యం మొత్తం, 3,215 చ. మైళ్లు. మొత్తం జనాభా, 30,971; పురుషులు, 19,055; స్త్రీలు, 11,916; అండమాను దీవుల ప్రధాననగరం పోర్టుబ్లేర్.

పశ్చిమపంజాబు, తూర్పు బెంగాలురాష్ట్రాలనుంచి ఇండియాకు వచ్చిన కాందిశీకులలో కొంతమందిని యీ దీవులకుపంపి, వీటిని నివాస యోగ్యముగాచేసి, వీటిని ఉపయోగించాలని ఇండియా ప్రభుత్వంవారి ఉద్దేశం. 1949 డిసెంబరు 2 నాటికి తూర్పు బెంగాలునుంచి ఇండియాకు వచ్చివేసిన కాందిశీకులలో 189 కుటుంబములు యీ దీవులకు పంపబడినారు.

చీఫ్ కమిషనర్ : ఎ. కె. ఘోష్

# కచ్

1948 జూన్ 1 తేదీవరకు స్వతంత్ర సంస్థానంగావున్న కచ్ ఆ తేదీన, ఇండియాలో ఒక రాష్ట్రంగా కలిసిపోయింది. దీనిని, ఇండియా ప్రభుత్వంవారు ఒక కమిషనర్ రాష్ట్రంగా ఏర్పాటు చేశారు.

ఇండియాకు పశ్చిమోత్తరాన, పాకిస్థాన్ రాష్ట్రమైన సింధుకు దిగువన, ఈ సంస్థానంవుంది, దీని వైశాల్యం 16,724 చ. మైళ్ళు. జనాభా 5,67 606; పురుషులు, 2,72,977; స్త్రీలు, 2,94,629; ఆదాయం ఏడాదికి రు. 80 లక్షలు. ఈ సంస్థానాన్ని సంయుక్త సౌరాష్ట్రం రాజ్యంలో కలిపివేయడమా, లేక తమ పరిపాలనలోకి తెచ్చుకోవడమా అనే విషయాన్ని పరిశీలించి, ఇండియా ప్రభుత్వం వారు దీనిని తమ పరిపాలనలో కమిషనర్ రాష్ట్రంగా వుంచడానికి నిశ్చయించారు. ఆప్రకారమే కచ్ సంస్థానాధిపతి; మహారాజాధిరాజ మీర్జా మహారావు శ్రీ మధనసింహజీ బహదూర్‌తో 1948 మే 3-తేదిన ఒక ఒడంబడికకువచ్చారు. 1948 జూన్ 1 తేదినుంచి కచ్ కమిషనర్ రాష్ట్రమైంది. దీనికి రాజధాని భుజ్. ఈ రాష్ట్రంలో ఇనుము, లిగ్నైట్ మొదలైన ఖనిజములు ఎక్కువగా వున్నాయి.

చీఫ్‌కమిషనర్: పి. కె. దేశాయ్,

ఈ రాష్ట్రంనుంచి పార్లమెంటుకు సభ్యులను ఎన్నుకోడానికి; ఎన్నిక సభ్యులసభ ఒకటివుంది. దానిలో 30 మంది సభ్యులు ప్రజలచే ఎన్నుకోబడినవారు వుంటారు. గత ఎన్నికలలో యీ సభకు 23 మంది కాంగ్రెస్‌వారూ, ఇతరులు ఇద్దరూ ఎన్నుకోబడినారు.

# కూర్గ

దక్షిణ భారతదేశంలో; మైసూరు రాజ్యానికి పశ్చిమంగా వున్న చిన్న రాష్ట్రం ఇది. దీని వైశాల్యం. 1,586; చ. మైళ్ళు. జనాభా, 2,29,405, పురుషులు, 1,25,327; స్త్రీలు, 1,04,078, ప్రజల

ప్రధాన జీవనాధారం, వ్యవసాయం. ఇక్కడ ప్రధానమైన పంట కాఫీ. ఈ రాష్ట్రానికి ప్రధాన నగరం. మెర్కారా.

చీఫ్ కమిషనర్ : లెఫ్టినెంట్ కర్నల్ దయాసింగ్ బేడి.

రాష్ట్రశాసనసభ సభ్యుల సంఖ్య 24. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు 6; షెడ్యూల్డు కొండజాతుల ప్రతినిధులు 6.

శాసనసభలో పార్టీలబలం :

కాంగ్రెసు 15; స్వతంత్రులు 9

మంత్రిమండలి: పదవీ స్వీకారం : 1952 మార్చి 17

ముఖ్యమంత్రి : సి. ఎం. పునచ

రెండవమంత్రి . కె. మల్లప్ప

మంత్రుల జీతాలు : నెలకు రు. 650,

శాసనసభ్యుల జీతాలు . నెలకు రు. 150,

స్పీకరు : బి. ఎస్. కుశలప్ప

బడ్జెట్ : 1954-55 సంవత్సరానికి యీ రాష్ట్రపు బడ్జెట్ అంచనాలివి :

| | |
|---|---|
| ఆదాయం : | రు. 1,17,43,000 |
| వ్యయం : | రు. 1,46,54,000 |
| లోటు : | రు. 29,11,000 |

# ఢిల్లీ

ఇండియాకు రాజధాని ఢిల్లీ. 1912 కు పూర్వం, కలకత్తా మన దేశానికి రాజధానిగావుండేది. 1911 డిసెంబరు 12 వ తేదిన ఢిల్లీ దర్బారులో, జార్జి చక్రవర్తి, ఇకముందు భారతదేశానికి రాజధాని ఢిల్లీ నగరమేనని ప్రకటించాడు. అప్పటినుంచీ, రాజప్రతినిధి ఢిల్లీలోవుంటున్నాడు.

పాతఢిల్లి; కొత్తఢిల్లి, పరిసరాలు మొత్తం 578 చదరపు మైళ్ళ ప్రదేశం, ఒక ప్రత్యేక రాష్ట్రంగా, చీఫ్ కమిషనరు పరిపాలనక్రింద

ఏర్పాటుచేయబడింది. రాజప్రతినిధికి, శాసనసభలకూ కొత్త భవనాలను నిర్మించడానికి, అంటే కొత్తఢిల్లి నిర్మాణానికి 14 కోట్ల రూపాయలు ఖర్చు అయింది. 1951 లో ఢిల్లి జనాభా, 17,44,072; పురుషులు, 9,86,53, స్త్రీలు 7,57,534.

చీఫ్ కమిషనర్ : ఎ. డి. పండిట్

రాష్ట్ర శాసనసభ సభ్యుల సంఖ్య 48. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు, 6.

శాసనసభలో పార్టీలబలం : కాంగ్రెసు, 39, సోషలిస్టులు, 2: జనసంఘు, 4; స్వతంత్రులు, 2; ఇతరపార్టీలు, 1.

శాసనసభ్యుల జీతాలు : నెలకు రు. 200; అదనంగా శాసనసభకు హాజరైన ప్రతిరోజుకు రు. 10 బత్తా.

స్పీకరు : శాంత్ గురుముఖ్‌నీహాల్‌సింగ్ (రు. 1,000)
డిప్యూటిస్పీకరు : గోపీనాథ్ అమన్ (రు. 750)
మంత్రిమండలి : పదవీస్వీకారం : 1952 మార్చి 17.
ముఖ్యమంత్రి : చౌధురి బ్రహ్మప్రకాశ్
రెండవమంత్రి : డాక్టర్ సుశీల నయ్యర్

మంత్రుల జీతాలు : నెలకు రు. 1,000. ప్రధానమంత్రికి అధనంగా రూ. 250; ఇదికాక, ప్రతిమంత్రికీ నెలకు రు. 250 కారు అలవెన్సు, ఉచితవసతి,

డిప్యూటి మంత్రులు నియమింపబడితే, వారికి నెలకు రు. 500 జీతం, రు. 150 ఇంటిఅద్దె, రు. 150 కారుఅలవెన్సు ఇవ్వబడుతుంది.

బడ్జెట్ : 1954-55 సంవత్సరానికి ఢిల్లీ రాష్ట్రపు బడ్జెట్ అంచనాలివి.

| | |
|---|---|
| ఆదాయం | రు. 4,45,41,000 |
| వ్యయం | రు. 5,05,83,000 |
| లోటు | రు. 60,42,000 |

# త్రిపుర

ఇది స్వతంత్ర సంస్థానంగా వుండేది. దీనిని 1949 లో ఇండియా ప్రభుత్వం తమ పరిపాలనలోకి తీసుకున్నారు. ఇది పశ్చిమ బెంగాల్ రాష్ట్రానికి తూర్పున వున్నది. ఒక్క అస్సాం వైపునతప్ప తక్కినమూడు వైపులా ఈ రాష్ట్రానికి సరిహద్దు పాకిస్తాన్‌తో. దీని వైశాల్యం 4,032 చ. మైళ్లు. జనాభా 6,39,029; పురుషులు, 3,35,589. స్త్రీలు, 3,03,440. ప్రభుత్వాదాయం ఏడాదికి 27 లక్షల రూపాయలు. మహారాజు : హిస్ హైనెస్ మహారాజా మాణిక్య వీరవిక్రమ కిశోర్ దేవ వర్మన్ బహదూర్.

ఛీఫ్ కమిషనర్ : వి. నంజప్ప

పార్లమెంటుకిసభ్యులను ఎన్నుకోడానికి, ప్రజలచే ఎన్నుకోబడిన సభ్యుల సభ (ఎలెక్టరల్ కాలేజి) ఒకటి యీ రాష్ట్రంలో వుంది. దాని సభ్యుల సంఖ్య 30. గత ఎన్నికలలో యీ సభకు తొమ్మిదిమంది కాంగ్రెసువారూ, 12 మంది కమ్యూనిస్టులూ, 6 మంది స్వతంత్రులు, ముగ్గురు ఇతర పార్టీలవారూ ఎన్నుకోబడినారు.

త్రిపుర రాష్ట్ర పరిపాలనకు, ఛీఫ్ కమిషనర్‌కు సలహా ఇవ్వడానికి ముగ్గురు సభ్యులుగల కౌన్సిలు 1953 ఏప్రిల్ 14 తేదిన నియమింపబడింది. ఆ సభ్యుల పేర్లు ఇవి: శచీంద్ర లాల్ సింగ్, సుకుమార్ సేన్‌గుప్త, జితేంద్రమోహన్ సేన్‌గుప్త.

# భోపాల్

భోపాల్ సంస్థానము మధ్యభారత్‌కు తూర్పు దక్షిణములలోను, నర్మాదానదికి ఉత్తరమునను ఉంది. దీనిని 1949 జూన్ 1 తేదిన ఇండియా కేంద్రప్రభుత్వము స్వాధీనపరచుకొని, చీఫ్ కమిషనర్ రాష్ట్రంగా పరిపాలన జరుపుతున్నారు.

భోపాల్ వైశాల్యం : 6,878 చ. మైళ్లు, జనాభా : 8,36,474, పురుషులు; 4,37,635, స్త్రీలు, 3,98,839.

నవాబ్ : కర్నల్ నవాబ్ సికందర్ దౌలత్ ఇప్తికార్-ఉల్-ముల్క్ మహమ్మద్ హామీదుల్లా ఖాన్ బహదూర్. నవాబ్ కుమారులు లేరు. కుమార్తె, కర్నల్ సుల్తైయా జానవాబ్‌కు గోహర్-ఇ-తాజ్, యీ రాజ్యానికి వారసురాలు. కాని, ఆమె ఇండియాను వదలిపెట్టి, పాకిస్తాన్‌కు వెళ్ళిపోయింది.

చీఫ్ కమిషనర్ : భగవాన్ సహాయ్

రాష్ట్రశాసనసభ సభ్యులసంఖ్య, 30. వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు, 5 ; షెడ్యూల్డు కొండజాతుల ప్రతినిధులు, 2.

శాసనసభలో పార్టీలబలం : కాంగ్రెసు, 25 ; జనసంఘు, 1 ; స్వతంత్రులు, 3, ఇతరులు, 1.

స్పీకర్ : సుల్తాన్ మహమ్మద్‌ఖాన్
మంత్రిమండలి : పదవీస్వీకారం : 1952 మార్చి 20.
ముఖ్యమంత్రి : డాక్టర్ శంకరదయాళ్ శర్మ
రెండవమంత్రి : కాంతప్రసాద్
మూడవమంత్రి : మౌలానా తార్జి మష్రికి
మూడవమంత్రికి డిప్యూటిమంత్రి : ఉమ్రావ్‌సింగ్
మంత్రుల జీతాలు : నెలకు రు. 700.

# మణిపూర్

మణిపూరు సంస్థానాన్ని కేంద్రప్రభుత్వం 1949 అక్టోబరు 15 తేదిన స్వాధీనపరచుకొని, చీఫ్ కమిషనరు రాష్ట్రంగా ఏర్పాటుచేశారు, ఇది అస్సాం, బర్మాల సరిహద్దులలోవున్న సంస్థానం. వైశాల్యం, 8,623; చ. మైళ్లు. జనాభా, 5,77,635 ; పురుషులు, 2,83,685 ; స్త్రీలు. 2,93,950. ప్రభుత్వాదాయ, రు. 29 లక్షలు.

మహారాజు : హిస్ హైనెస్ మహారాజు బోధచంద్రసింగ్,
చీఫ్ కమిషనర్ : ఆర్. పి. భార్గవ

పార్లమెంటుకు సభ్యులను ఎన్నుకోడానికి 30 మంది సభ్యులుగల ఎలెక్టరల్ కాలేజి యీ రాష్ట్రంలో వుంది. గత ఎన్నికలలో యీసభకు

10 మంది కాంగ్రెసువారూ, ఒక సోషలిస్టు, ఇద్దరు కమ్యూనిస్టులూ, ఒక స్వతంత్రుడూ, 16 మంది ఇతరపార్టీలూ,ఎన్నుకోబడినారు.

రాష్ట్రపరిపాలనలో చీఫ్ కమిషనర్‌కు సలహా ఇవ్వడానికి, అయిదుగురు సభ్యులుగల సలహా సంఘం 1953 మే 6 న నియమింపబడింది.

# విలాస్‌పూర్

పంజాబ్‌రాష్ట్రంలోవున్న విలాస్‌పూరు సంస్థానాన్ని ఇండియా ప్రభుత్వంవారు స్వాధీనపరచుకొని 1948 సెప్టెంబరు 19 తేదిన చీఫ్ కమిషనరు రాష్ట్రంగా ఏర్పాటుచేశారు. ఈ సంస్థానపు వైశాల్యం 453 చ. మైళ్ళు. జనాభా, 1,26,099. పురుషులు, 64,738; స్త్రీలు 61,361. సంస్థానంలోని ప్రజలంతా 952 గ్రామాలలో నివసిస్తున్నారు. ఈ రాష్ట్రంలోని పట్టణం విలాస్‌పూరు ఒక్కటే. దాని జనాభాకూడా 4000 లోపే.

# వింధ్యప్రదేశ్

వింధ్యప్రదేశ్ అనే పేరుగల సంస్థానాలకూడలి 1948 ఏప్రిల్ 2 తేదిన ఏర్పాటయింది. ఇది, అజయఘుర్, బావొని, బారౌంధ, బిజావార్, ఛత్రపూర్. ఛరారి, దాటియా, మైహారు, నాగోడ్, ఓర్ఛ, పన్నా, రీవా, నంథారు, అలీపూర్, బంకపహారి, బేరి, భాయిసుందబీహాట్, బిజన, ధుర్వాయ్, గౌరిహారు, గరౌలి, జాసో, జిగ్ని, కొంతరాజౌల, ఖానియాధహాన- కోఠి, లుగాసి, నైగజాన్-రెబాయ్,సారా, పాల్దెవ్, సరిల, సొహావాల్, తరౌన్, తోరి-ఫతేపూర్ అనే 35 సంస్థానాల కూడలి. దీని వైశాల్యం 23,603; చ. మైళ్లు. జనాభా, 35,74,690. పురుషులు, 18,32,940; స్త్రీలు, 17,41,750. ఈసంస్థానాల కూడలిని 1950 జనవరి 1 తేదినుంచి కమిషనరురాష్ట్రంగా కేంద్ర ప్రభుత్వం ఏర్పాటుచేశారు. రాజధాని, రీవా.

రాష్ట్రశాసనసభ సభ్యులసంఖ్య 60. వీరిలో షెడ్యూల్డుకులాల ప్రతినిధులు 6, షెడ్యూల్డు కొండజాతుల ప్రతినిధులు 6.

లెఫ్టినెంట్ గవర్నరు : కె. సంతానం
పదవీ స్వీకరణ : 1952 మార్చి
జీతం : నెలకు రు. 3,000 అలవెన్సు రు. 500

రాష్ట్రశాసనసభలో పార్టీబలం : కాంగ్రెసు, 40; సోషలిస్టులు, 11; ప్రజాపార్టీ, 3; జనసంఘు 2; స్వతంత్రులు, 2; ఇతరులు 2.

స్పీకరు : శివానంద్
మంత్రిమండలి : పదవీస్వీకారం, 1952 మార్చి 17
ముఖ్యమంత్రి : ఆర్థికశాఖ రెవిన్యూ, శంభునాథ్ శుక్ల
న్యాయమంత్రి : ప్లానింగ్, గోపాల్‌శరణ్‌సింగ్
హోంమంత్రి : స్థానికపరిపాలన; లాలారాం బాజ్‌పాయ్
పరిశ్రమలమంత్రి : ధన్‌బహదూర్‌సింగ్
విద్యామంత్రి : మహేంద్రకుమార్ జెయిన్

మంత్రుల జీతాలు : నెలకు రు. 750; కారు అలవెన్సు రు. 200. ముఖ్యమంత్రికి నెలకు రు. 250, ఇతర మంత్రులకు ఒకొక్కరికి నెలకు రు. 125, అదనపు అలవెన్సు. అందరికీ ఉచితగృహవసతి.

స్పీకరుకు రు. 750 జీతం; ఉచిత గృహవసతి; కారు.

డిప్యూటీ స్పీకరుకు రు. 250 జీతం; కాక అసెంబ్లీ సమావేశానికి హాజరైన ప్రతిరోజుకి రు. 10 అలవెన్సు.

శాసనసభ్యుల జీతాలు : నెలకు రు. 150; సమావేశానికి హాజరైన ప్రతిరోజుకీ రు. 10.

## హిమాచల ప్రదేశ్

తూర్పుపంజాబ్ రాష్ట్రంలోవున్న బాఘర్, బాఘుడ్, బల్సాన్, బఘార్, భజ్జీ, బిజ, దార్కోటి, ధామి, జుబ్బల్, కెవన్‌థాల్, కుమార్‌సెయిన్, కునిహారి, కుథార్, మహలోగ్, ప్రాంగి, మంగళ్, సిర్మూర్, థరోచ్, చంబ, మండి, సుకేత్ అనే 31 సంస్థానాల అధిపతులు, తమ సంస్థానాలను కేంద్రప్రభుత్వ పరిపాలనకు అప్పగించి

వేశారు. దీనివైశాల్యం, 10,451 చ. మైళ్లు. ఈ రాష్ట్రంలో విస్తార భాగం అడవి, రాష్ట్ర ప్రభుత్వానికి ఆదాయంకూడా విస్తారభాగం అడవులనుంచే. జనాభా, 9,83,367; పురుషులు 5,14,765; స్త్రీలు, 4,69,602; ఈ ప్రాంతంఅంతా హిమాచల ప్రదేశ్ అనే పేరుతో ఛీఫ్ కమిషనరు రాష్ట్రంగా ఏర్పాటుచేయబడింది.

రాష్ట్రశాసనసభ సభ్యుల సంఖ్య, 36, వీరిలో షెడ్యూల్డు కులాల ప్రతినిధులు, 8.

లెఫ్టినెంట్ గవర్నరు : మేజరు జనరల్ హిమత్ సింహాజీ

పదవీ స్వీకరణ : 1952 మార్చి 1

జీతం : నెలకు రు. 3,000; అలవెన్సు రు. 500

రాష్ట్రశాసనసభకు ఎన్నికలు 1951 అక్టోబరు 25 తేది మొదలు 1951 నవంబరు మాసాంతంలో జరిగాయి. మొత్తం 36 స్థానాలలో రెండు స్థానాలకు ఎన్నిక, ప్రత్యర్థుల నామినేషనులు నిరాకరింపబడి నందున, పోటీలేకుండా కాంగ్రెసువారు ఎన్నుకోబడినారు. తక్కిన 34 స్థానాలకూ 133 మంది అభ్యర్థులు పోటీచేశారు. వారిలో 33 కాంగ్రెసు, 22; ప్రజాపార్టీ, 10; జనసంఘ్, 9; షెడ్యూల్డు కాస్ట్స్ ఫెడరేషన్, 5 సోషలిస్టులు, హిందూమహాసభ 3; రామరాజ్య పరిషత్, 1; స్వతంత్రులు 49.

శాసనసభలో పార్టీబలం:

కాంగ్రెసు; 25; ప్రజాపార్టీ, 3; షెడ్యూల్డు కాస్టుఫెడరేషన్, 1; స్వతంత్రులు, 8.

స్పీకరు : జయంత్ సింగ్

మంత్రిమండలి, పదవీస్వీకారం, 1952 మార్చి 8

ముఖ్యమంత్రి : వై. ఎస్. పరమార్

రెండవ మంత్రి : పండిట్ పద్మదేవ్

మూడవ మంత్రి : గౌరీ ప్రసాద్

# ఆంధ్రరాష్ట్రం

## రాష్ట్రోద్యమ చరిత్ర

మదరాసురాష్ట్రం భరతఖండంలో తక్కిన అన్ని రాష్ట్రాలలాగానే, ఎప్పటికప్పుడు బ్రిటిషువారి ఆధీనంలోనికి వచ్చిన ప్రాంతాలతో, వారి సౌకర్యం ప్రకారం ఏర్పాటు చేయబడింది. అందుచేతనే, మదరాసు రాష్ట్రంలో తెలుగు జిల్లాలు, తమిళ జిల్లాలు, కన్నడ, మళయాళ ప్రాంతాలు చేరి ఉన్నాయి. ప్రతిభాషాప్రాంతానికి ప్రత్యేక ప్రభుత్వంవుంటే గాని, ఆప్రాంతం సర్వతోముఖంగా అభివృద్ధి పొందడానికి వీలులేదనే విషయాన్ని నేడు ఇండియాలోని పరిపాలకవర్గాలవారూ, ప్రజా నాయకులుకూడా తెలుసుకున్నారు.

దాదాపు 71 వేల చదరపుమైళ్లు వైశాల్యమూ, దాదాపు 11 కోట్ల రూపాయల ప్రభుత్వాదాయమూ, విస్తారమైన ఖనిజసంపదా దాదాపు మూడుకోట్ల జనాభాగల తెలుగుజిల్లాలను ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పాటు చెయ్యవలసిందనే ఆందోళన ఆంధ్రదేశంలో దాదాపు 40 సంవత్సరాలనుంచీ జరుగుతున్నది. ఇండియాలోని రాష్ట్రాలను భాషా ప్రయుక్త రాష్ట్రాలుగా ఏర్పాటుచేసి ఆంధ్రజిల్లాలను ఒక ప్రత్యేక రాష్ట్రముగా ఏర్పాటు చేయవలసిందనే సూచన మొట్టమొదట 1910లో గుంటూరులో యువజన సారస్వత సంఘము (యంగ్మెన్స లిటరరీ అసోసియేషను) వారు చేశారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణోద్యమానికి యిదే పునాది. తరువాత 1913 లో ఆంధ్రమహాసభ స్థాపింపబడినది. తరువాత అనేక సంఘములు, ఉద్యమములు దీనికి అనుబంధములుగా బయలుదేరాయి. 1916 లో కలకత్తా సమావేశములో అఖిలభారత కాంగ్రెసు మహాసభలో భాషా

ప్రయుక్త రాష్ట్ర నిర్మాణ సిద్ధాంతము అంగీకరింపబడింది. కాంగ్రెసు రాష్ట్రాలలో ఆంధ్రరాష్ట్రం ప్రత్యేక స్థానాన్ని పొందింది.

ఇది యిలా ఉంటుండగా మాంటేగు - ఛెమ్సు ఫర్డు కమిటీవారు ఇండియాకు రాజ్యాంగ సంస్కరణలను ప్రతిపాదించడానికి పరిస్థితుల పరిశీలన నిమిత్తము ఇండియాకు వచ్చారు. అప్పుడు ఆంధ్రమహాసభ వారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ ఆ కమిటీకి ఒక నివేదికను సమర్పించారు. తరువాత 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టుపై కామన్సు సభలో చర్చలు జరుగుతూన్నప్పుడు ఆంధ్రమహాసభ వారు ఒక రాయబార వర్గాన్నికూడా ఇంగ్లండు పంపించారు. అదేసమయములో ఇండియాలోని కేంద్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ ఒక తీర్మానము చేసింది. అయినప్పటికీ 1919 గవర్నమెంటు ఆఫ్ ఇండియా ఆక్టులో ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగలేదు.

1922 లో కేంద్రశాసనసభ ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ మళ్ళీ తీర్మానముచేసింది. 1927-28 లో భారతదేశపు రాజ్యాంగ విధానాన్ని సంస్కరించడానికి ప్రయత్నాలు జరుగుతూన్నపుడు ఆంధ్ర రాష్ట్ర నిర్మాణముకోసము పెద్ద కృషి జరిగింది. సైమను కమిషన్ వారు ఇండియా వచ్చినపుడు వారికి ఒక నివేదిక సమర్పించబడింది. 1921 లో మదరాసు శాసనసభ కేంద్రశాసనసభ ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేశాయి. పండిత మోతీలాలు నెహ్రూ నివేదికకూడా ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదించింది. ఐతే ఆంధ్ర దేశములో కాంగ్రెసు ఉద్యమము బలంగా ఉండటంవల్ల; ప్రత్యేకఆంధ్ర రాష్ట్రము మరొక కాంగ్రెసు రాష్ట్రముగా పరిణమిస్తుందని ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సైమను కమిషనువారు అంగీకరించలేదు. అయితే ఒరిస్సా, సింధు అనే రెండు ప్రత్యేక రాష్ట్రాలను ఏర్పాటుచేయడానికి అంగీకరించారు. 1935 లో ఒరిస్సా రాష్ట్రం ఏర్పాటు చేయబడినప్పుడు గంజాం జిల్లాలోని ఆంధ్రులు అత్యధిక సంఖ్యలో ఉన్నప్రాంతాలు, బరంపురం పట్టణం, ఒరిస్సా రాష్ట్రములో కలిపి వేయబడినవి.

1937 లో కాంగ్రెసు మంత్రివర్గాలు ఏర్పడ్డప్పుడు ఆంధ్రరాష్ట్ర

నిర్మాణంవిషయములో ఆంధ్రులకు కొంత ఆశాభావం కలిగింది. 1938 లో మదరాసు అసెంబ్లీ, కౌన్సిలు ప్రత్యేక ఆంధ్రరాష్ట్రాన్ని కోరుతూ తీర్మానాలుచేశాయి. కాని అప్పుడూ రాష్ట్రనిర్మాణము జరుగలేదు. 1946 లో కౌన్సిల్ ఆఫ్ స్టేట్ లో ఇదేవిధంగా తీర్మానం జరిగింది! కాని అప్పుడు కేంద్ర ప్రభుత్వము తరఫున, ఈ విషయము కన్‌స్టిట్యుయెంటు అసెంబ్లీలో నిర్ణయింపబడు తుందనే హామీ ఇవ్వబడింది. 1947 లో మదరాసు శాసన సభలు భాషా ప్రయుక్త రాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ తీర్మానాలు చేశాయి. నూతన రాజ్యాంగ విధానము అమలు జరిపే టప్పుడు ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరుగుతుందని ఇండియా ప్రధాన మంత్రి పండిత జవహర్ లాల్ నెహ్రూ హామీకూడా ఇచ్చారు. అయి నప్పటికి నూతన రాజ్యాంగ విధానపు ముసాయిదాలో ఆంధ్రరాష్ట్రము పేర్కొనబడలేదు.

1947 నవంబరులో రాజ్యాంగసభలో జరిగిన చర్చల ఫలితంగా ఎస్. కె. ధార్ (అధ్యక్షుడు), డాక్టర్ పన్నాలాల్, జగత్ నారాయణ లాల్ గార్లు సభ్యులుగాగల ఒక కమిషనును రాజ్యాంగ సభ అధ్యక్షుడు నియమించారు. కొత్తరాష్ట్రాలను వేటినైనా ఏర్పాటు చెయ్యవచ్చునా, చేస్తే వాటి సరిహద్దులు ఎలా ఉండాలి, వాటి ఆర్థిక, పరిపాలనాస్థితులు ఎలా వుంటాయి అనే విషయాలను సూచింపవలసిందని యీకమిషనుకు తాఖీదు యివ్వబడింది.

ఈ కమిషను 1948 జూలై 19 తేదిన ప్రథమంలో సమావేశమై నవంబరు 21 న ఆఖరు సమావేశం జరిపింది. ఆంధ్రదేశంలో విశాఖ పట్టణం, మదరాసు, దక్షిణాన కాలికట్, మెంగుళూర్, కోయంబత్తూరు, బెంగుళూరు నగరాలలో సాక్షులను విచారించారు. మొత్తం ఆంధ్ర, తమిళ, కన్నడ, మహారాష్ట్ర, కొంకణ, సి. పి. బీరారు ప్రాంతాలలో 6,700 మంది సాక్షులను విచారించి, దాదాపు 1,000 మహజర్లు అందు కొని, యీ కమిషను తమ నిర్ణయాన్ని డిసెంబరు 10 న రాజ్యాంగ సభ అధ్యక్షునికి సమర్పించారు. ఆ నివేదికలో వారు చెప్పినదేమంటే ఇండి యాలో భాషాప్రాంతాలుగా రాష్ట్రాలను ఎన్నడూ ఏర్పరచరాదని.

1948 డిసెంబరు 18 తేదిన అఖిలభారత కాంగ్రెసు మహాసభ, భాషా ప్రయుక్తరాష్ట్ర నిర్మాణాన్ని గురించి ఏ. ఐ. సి. సి. కి నివేదికను తయారు చెయ్యవలసిందిగా కోరుతూ, డాక్టరు పట్టాభి సీతారామయ్య, పండిత జవహర్‌లాల్ నెహ్రూ, సర్దార్ పటేల్ గార్లను ఒక కమిటీగా నియమించింది.

నెహ్రూ-పటేలు-పట్టాభి కమిటి తమ నివేదికను కాంగ్రెసు వర్కింగుకమిటికి 1949 ఏప్రిల్ 6 న సమర్పించారు. వర్కింగుకమిటీ దానిని ఆమోదించింది. ఆ నివేదిక ప్రకారం, మదరాసు నగరం తమకు కావాలని ఆంధ్రులు కోరకుండా వున్నట్లయితే, ఆంధ్రరాష్ట్ర సరిహద్దుల విషయంలో పొరుగువారితో (అంటే, కర్నాటులతోను తమిళుల తోను) ఆంధ్రులు ఒక ఒడంబడికకు వచ్చినట్లయితే ఆంధ్రరాష్ట్రం వీలైనంత త్వరలో ఏర్పాటు చెయ్యబడుతుంది.

నెహ్రూ-పటేలు-పట్టాభి సూత్రమును అంగీకరిస్తూ, ఆంధ్ర రాష్ట్ర నిర్మాణాన్ని ఆమోదిస్తూ 1949 నవంబరు 7 తేదీన తమిళ నాడు కాంగ్రెసు కమిటీ తీర్మానం చేసింది. ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు కమిటీ 1949 నవంబరు 11 తేదీన విజయవాడలో సమావేశమై, పై సూత్రప్రకారం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం చెయ్యవలసిందిగా ప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేసింది. అయితే యీ కమిటీ మదరాసు నగరాన్ని కేంద్రప్రభుత్వాధీనంలో చీఫ్ కమిషనర్ రాష్ట్రంగా ఏర్పాటు చెయ్య వలసిందని కోరింది.

మదరాసురాష్ట్ర ప్రభుత్వంవారు, నవంబరు 12 తేదీన నెహ్రూ-పటేలు-పట్టాభి సూత్రమును అంగీకరిస్తూ, ఆ ప్రకారం ఆంధ్రరాష్ట్ర నిర్మాణం చెయ్యవలసిందని కేంద్రప్రభుత్వాన్ని కోరుతూ తీర్మానం చేశారు.

నవంబరు 16 తేదీన అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ వారు సమావేశమై పై సూత్రప్రకారం, విశాఖపట్టణం, తూర్పు గోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు

కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలను బళ్ళారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గ్ తాలూకాలను కలిపి ప్రత్యేకరాష్ట్రంగా వెంటనే ఏర్పాటు చెయ్యవలసిందని, యీ రాష్ట్రానికిసరిహద్దులను నిర్ణయించడానికి ఒక కమిషనరును ఏర్పాటు చెయ్యవలసిందనీ కోరుతూ తీర్మానం చేశారు.

కేంద్రప్రభుత్వంవారు, యీ తీర్మానాన్ని అంగీకరించి, 1950 జనవరి 26 తేదీలోపల ప్రత్యేక రాష్ట్రాన్ని ఏర్పాటు చెయ్యడానికి వీలు అవుతుందా అనీ; రాష్ట్ర విభజన ఏర్పాట్లను చెయ్యడానికి ఒక సలహా సంఘాన్ని (విభజన కౌన్సిలును) ఏర్పాటు చేయవలసిందనీ, సరిహద్దులను నిర్ణయించడానికి కమిటీని నియమించడంలో సూచనలను చెయ్యవలసిందనీ మదరాసు ప్రభుత్వాన్ని అడిగారు.

మదరాసు మంత్రిమండలి 1949 డిసెంబరు 6 తేదీన సమావేశమై కేంద్రప్రభుత్వం చేసిన సూచనలను పరిశీలించి యీ క్రింద నిర్ణయాలను తెలియపరచారు.

"ఆంధ్రరాష్ట్రాన్ని 1950 జనవరి 26 తేదిలోపల ఏర్పాటు చెయ్యడం సాధ్యంకాదు. 1950 ఏప్రిల్ 1 తేదిలోపల మాత్రం సాధ్యం అవుతుంది".

"ఆంధ్రరాష్ట్ర సరిహద్దులను నిర్ణయించడానికి ముగ్గురు సభ్యులు గల కమిటీని నియమించవచ్చును. వీరిలో ఒక సభ్యుడు హైకోర్టు జడ్జిగాని రిటైరయిన హైకోర్టు జడ్జిగాని అయివుండాలి, ముగ్గురు సభ్యులుకూడా, మదరాసు ఒరిస్సా రాష్ట్రాలకు చెందనివారై వుండాలి",

తరువాత, డిసెంబరు 7 తేదిని మదరాసు మంత్రిమండలి మళ్ళీ సమావేశమై రాష్ట్రవిభజన ఏర్పాట్లను నిర్ణయించడానికి యీ క్రింది సభ్యులతో ఒక కౌన్సిలును నియమించారు.

ప్రధాని పి. ఎస్. కుమారస్వామిరాజా (అధ్యక్షులు) పబ్లిక్ వర్క్స్ మంత్రి ఎం. భక్తవత్సలం; విద్యామంత్రి కె. మాధవమీనన్,

టి. టి. కృష్ణమాచారి, ఆర్థికమంత్రి ఓ. గోపాలరెడ్డి, మద్యనిషేధ మంత్రి నీలం సంజీవరెడ్డి, టంగుటూరి ప్రకాశం, కళా వెంకటరావు గార్లు.

ఈ కౌన్సిలుకు కార్యదర్శి ఎస్. వెంకటేశ్వరన్, ఐ. సి. ఎస్.

ఈ కమిటీ తమ నివేదికను 1950 జనవరి 3 తేదీన మంత్రి మండలికి, సమర్పించారు. కమిటీ నివేదికపట్ల, కమిటీసభ్యులంతా, ఒక్క టంగుటూరి ప్రకాశంగారు తప్ప, ఏకాభిప్రాయాన్ని వెలిబుచ్చారు. ప్రకాశంగారు ప్రత్యేకాభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

ఈ కమిటీలో అధిక సంఖ్యాకులు వెలిబుచ్చిన ఏకాభిప్రాయం ప్రకారం, ఆంధ్రరాష్ట్ర నిర్మాణం యీ క్రింద పద్ధతులలో జరగాలి.

విశాఖపట్టణం, తూర్పుగోదావరి, పడమటి గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు జిల్లాలను, బళ్లారి జిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గ్ తాలూకాలను కలిపి ప్రత్యేక ఆంధ్రరాష్ట్రంగా, 1950 జనవరి 26 తేదీలోపల, ఏర్పాటు చెయ్యాలి. బళ్ళారి జిల్లాలోని తక్కిన ఆయా తాలూకాలను మదరాసు రాష్ట్రంలోనే, ప్రత్యేక కర్ణాటక రాష్ట్రం ఏర్పడేవరకు, ఉంచాలి. ఆంధ్ర, మదరాసు రాష్ట్రాలమధ్య సరిహద్దుల విషయంలో ఏదైనా భేదాభిప్రాయాలు వుంటే, యీ రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు అన్యోన్య సమాలోచనలవల్ల పరిష్కరించుకోవచ్చును.

ఆంధ్రరాష్ట్రానికి, విభజనవల్ల వచ్చేజములు ఆ రాష్ట్రానికిచ్చే అప్పులకన్న పదికోట్లరూపాయలు ఎక్కువగా వుంటాయి.

మదరాసు నగరంలోని ప్రభుత్వకార్యాలయాల భవనాలను మదరాసు రాష్ట్రమే తీసుకుంటున్నందున, ఆంధ్రరాష్ట్రానికి ఒక కోటి రూపాయలు యివ్వబడుతవి.

ఏడుగురు జడ్జీలతో ఆంధ్రరాష్ట్రానికి ఒక ప్రత్యేక హైకోర్టు ఏర్పాటు చేయబడుతుంది. ఈ హైకోర్టు ఆంధ్రదేశంలో ఏ నగరంలో పెట్టేదీ ఆంధ్రనాయకులు నిర్ణయిస్తారు.

ఆంధ్రరాష్ట్రి రాజధాని ఎక్కడ పెట్టవలసిందీ, 1950 జనవరి 26 తేదీలోగా ఆంధ్రనాయకులు నిర్ణయిస్తారు. ఆంధ్రరాష్ట్రి శాసన సభ, గవర్నరు, మంత్రిమండలి 1950 జనవరి 26 నాటికి ఆ నగరానికి వెళ్లిపోవాలి.

ఆంధ్రరాష్ట్రి శాసనసభలో 95 మంది సభ్యులు వుంటారు.

ఈ షైరతులతో ఆంధ్రరాష్ట్రిన్ని ఏర్పాటు చెయ్యవచ్చునని మదరాసు మంత్రిమండలి 1950 జనవరి 4 తేదిని తీర్మానం చేసింది.

ప్రకాశంగారు ప్రత్యేకంగా వెలిబుచ్చిన అభిప్రాయాలు ఇవి:

1. ఆంధ్రరాష్ట్రినికి ప్రత్యేక రాజధాని నగరం ఏర్పడేదాకా ఆంధ్రప్రభుత్వ కార్యాలయాలు చెన్నపట్టణంలోనే వుండాలి.

2. అప్పులకు పైబడిన జమగా ఆంధ్రరాష్ట్రినికి ఇచ్చే పదికోట్ల రూపాయలు చాలవు. ఆంధ్రరాష్ట్రినికి ఇంకా ఎక్కువ వంతు రావలసి వుంటుంది.

3. మదరాసు నగరాన్ని తమిళరాష్ట్రినికి ఇవ్వడమా, ప్రత్యేక కమిషనర్ రాష్ట్రింగా వుంచడమా అనే విషయం స్పష్టంగా నిర్ణయించ పడేవరకూ, మదరాసు నగరంలోని భవనాల విలువను రెండురాష్ట్రిలకు పంచడం జరగకూడదు.

4. ఆంధ్ర రాష్ట్రిప్రభుత్వంలో ఉద్యోగం చెయ్యడానికి, ఆంధ్రేతరులనుకూడా నియమించాలన్న నిర్బంధం వుండకూడదు.

ఆంధ్రరాష్ట్రి కాంగ్రెసు కమిటి 1950 జనవరి 4 తేదిన మదరాసులో సమావేశమై, ఆంధ్రరాష్ట్రి రాజధాని శాశ్వతంగా రాయల సీమలో వుంచడానికి నిర్ణయించింది. రాజధాని నిర్మాణం జరిగేవరకూ ఆంధ్రరాష్ట్రి రాజధానిని మదరాసు నగరంలో వుంచుకొనేటట్లు చెయ్యవలసిందిగా కేంద్రప్రభుత్వాన్ని కోరింది.

చిట్టచివరకు, ఆంధ్రరాష్ట్రిన్ని 1950 జనవరి 26 తేదీలోగా ఏర్పాటు చెయ్యడానికి వీలులేదని కేంద్రప్రభుత్వం 1950 జనవరి 23 న మదరాసుప్రభుత్వానికి తెలియపరచారు. దానికి కారణాలు ఏమిచెప్పా

రంటే: ఆంధ్రరాష్ట్రఆదాయం, వ్యయంకంటె రెండుకోట్లరూపాయలు తక్కువ వుంటుందట; ఆంధ్రదేశపు హైకోర్టు ఎక్కడ వుండాలనే విషయం స్పష్టంగా తేల్చకపోవడమట; ఆంధ్రేతర ఉద్యోగులు మాకు వద్దు అని ఆంధ్రనాయకులు చెప్పే మాటలవల్ల, ఆంధ్రరాష్ట్రంలో పని చెయ్యవలసివచ్చే ఆంధ్రేతర ఉద్యోగులు మనస్ఫూర్తిగా ఉద్యోగాలు చెయ్యలేక పోవడం, దానివల్ల రాష్ట్రపరిపాలన బాగా జరక్క పోవడమూనట; బళ్ళారిజిల్లాను గురించి విభేదాభిప్రాయా లట.

మళ్ళీ 1951 ఆగస్టు, సెప్టెంబరు మాసాలలో ఆంధ్రరాష్ట్రో ద్యమం విజృంభణపొందింది. ఆంధ్రరాష్ట్ర సంపాదనకు, ప్రభుత్వ దృష్టిని పూర్తిగా యీ వుద్యమంవైపు త్రిప్పడానికి శ్రీస్వామి సీతారాంగారు (పూర్వాశ్రమంలో వీరిపేరు గొల్లపూడి సీతారామ శాస్త్రి) 1951 ఆగస్టు 15 న ఉపవాసదీక్ష ప్రారంభించారు. వీరి తోపాటు మరి ఆరుగురు 21 తేదిన నిరశనదీక్ష ప్రారంభించారు వారిపేర్లు: శ్రీ సంపత్కుమార్, ఆర్. కె. రామలింగారెడ్డి; జునుగుల మద్దులేటి; నేతి చలపతి, తుమ్మల బసవయ్య, శ్రీమతి తుమ్మల దుర్గాంబగార్లు.

ఈ దీక్షతో ఆంధ్రదేశం అంతా నిద్రనుంచి మేల్కొని తన గతిని గురించి ఆలోచించింది. దేశమంతా అలజడి జరిగింది. ఆచార్య వినోబాభావే, రాష్ట్రపతి రాజేంద్ర ప్రసాద్‌లోను. ప్రధానమంత్రి నెహ్రూతోను ఉత్తరప్రత్యుత్తరాలు జరిపారు. పార్లమెంటులో ప్రశ్నలు వేయబడినవి.

ఆంధ్ర, తమిళ, కర్నాటక ప్రదేశ కాంగ్రెసులూ, మదరాసు ప్రభుత్వమూ, జె. వి. పి. నివేదికను ఆమోదిస్తూ ఆంధ్రరాష్ట్ర నిర్మాణా నికి అంగీకరిస్తే భారత ప్రభుత్వం తదనుకూల చర్య జరుపుతుందని ప్రధానమంత్రి ప్రకటించారు. ఆంధ్రదేశ కాంగ్రెసు సెప్టెంబరు 14 తేదీన నెల్లూరులో సమావేశమై, జె. వి. పి. నివేదిక ప్రకారం ఆంధ్ర రాష్ట్ర నిర్మాణానికి వెంటనే చర్య తీసుకోవలసినదిగా భారత ప్రభు త్వాన్ని కోరుతూ తీర్మానం చేసింది.

రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్, ప్రధానమంత్రి నెహ్రూగార్లు ఆంధ్రరాష్ట్ర నిర్మాణానికి సుముఖులుగావున్నారనీ, తదనుకూల చర్య వీలైనంత శీఘ్రకాలంలో ప్రారంభింపబడుతుందనీ ఆచార్య వినోబా భావే తెలియపరచగా, సెప్టెంబరు 20 తేదిన స్వామి సీతారాం, తక్కిన దీక్షాపరులు తమ నిరశన దీక్షను విరమించారు.

కాని, తరువాత మళ్ళీ ప్రభుత్వం, యీ విషయంలో ఏమీ చర్య తీసుకోలేదు. ఇంతలో దేశమంతటా ఎన్నికలు జరగడం, కొత్త మంత్రివర్గాలు ఏర్పడడం జరిగింది. ఎంతకాలం అయినా, యీ విషయంలో ప్రభుత్వం ఏమీ చర్యతీసుకోనందున, స్వామిసీతారాం; 1952 జూన్ నెలలో భీమవరంలో సత్యాగ్రహం ప్రారంభించారు. తరువాత ఈ సత్యాగ్రహం విరమింపబడింది.

1952 అక్టోబరు 19 న, గాంధిజీ ఆప్త అనుయాయులలో ఒకరూ, నెల్లూరుజిల్లా వాస్తవ్యులూ అయిన శ్రీ పొట్టి శ్రీరాములు గారు ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని కోరుతూ, మదరాసులో, ఆ మరణ ప్రాయోపవేశం ప్రారంభించి, 58 రోజుల దీక్ష ఫలితంగా డిసెంబరు 15 తేది రాత్రి 11-23 నిమిషములకు పరమపదం చెందారు. మరునాడు మొదలు నాలుగురోజులు, ఆంధ్రదేశమంతటా బ్రహ్మాండమైన ఉద్రేకంతో ప్రజలు రైళ్ళను ఆపుట, కొల్లగొట్టుట మొదలైన చర్యలు జరిపారు. నెల్లూరు, తాడేపల్లిగూడెం, అనకాపల్లి, వాల్తేరులలో పోలీసు కాల్పులు జరగడం, కొంతమంది చనిపోవడంకూడా సంభవించింది.

1952 డిసెంబరు 19 తేదిన పార్లమెంటు ఉభయసభలలో ప్రధానమంత్రి ఒక ప్రకటనచేస్తూ, మదరాసు రాష్ట్రంలోని నిర్వివాద తెలుగుప్రాంతాలతో, చెన్నపట్టణం మినహాగా, వీలైనంత త్వరలో ఆంధ్రరాష్ట్రం ఏర్పాటుచేయబడుతుందనీ, ఈ ఏర్పాటుకు అవసరమైన చర్యలను సూచించడానికిగాను, రాజస్థాన్ హైకోర్టు ప్రధానన్యాయమూర్తి కె. ఎన్. వాంచూ నియమించబడినారనీ తెలియజేశారు.

రాష్ట్రనిర్మాణసందర్భంలో పరిష్కరించవలసిన ఆర్థికాదివిషయములను గురించి పరిశీలనజరపడానికి, జస్టిస్ వాంచూ 1953 జనవరి

7 తేదిన మదరాసు వచ్చారు. జనవరి 20 నుంచి 27 వరకు ఆంధ్ర జిల్లాలలో పర్యటనచేశారు. దాదాపు 2,000 మహాజర్లను స్వీకరించారు. ఇండియాప్రభుత్వానికి పంపవలసిన రిపోర్టును పూర్తిచేసుకొని, ఫిబ్రవరి 5 తేదిన మదరాసునుంచి బయలుదేరి, 7 తేదిన ఢిల్లీచేరి, ఆనాడే ప్రభుత్వానికి తమ నివేదికను సమర్పించారు.

1953 మార్చి 19 తేదిన, మదరాసు అసెంబ్లీలోని ఆంధ్ర కాంగ్రెసుసభ్యులు తమ నాయకుడుగా శ్రీ నీలం సంజీవరెడ్డిని ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణాన్ని గురించి; 1953 మార్చి 26 తేదిన పార్లమెంటులో ప్రధానమంత్రి యీక్రింది ప్రకటన చేశారు.

ఆంధ్రరాష్ట్రం 1953 అక్టోబరు 1 తేదినఏర్పాటుచేయబడుతుంది.

రాష్ట్రరాజధాని రాష్ట్రసరిహద్దులలోనే వుంటుంది. రాజధానిని ఎక్కడ పెట్టుకొనేదీ, ఆంధ్రశాసనసభ్యులే నిర్ణయించుకుంటారు. రాష్ట్రశాసనసభ, హైకోర్టును ఎక్కడపెట్టేదీ నిర్ణయించేవరకూ, మదరాసు హైకోర్టే; ఆంధ్రరాష్ట్రానికికూడా హైకోర్టుగా పనిచేస్తుంది.

ఆంధ్రరాష్ట్రానికి లెజిస్లేటివ్ కౌన్సిలువుండదు. ప్రస్తుతంమదరాసు అసెంబ్లీలోని ఆంధ్రజిల్లాసభ్యులతో ఆంధ్రరాష్ట్ర లెజిస్లేటివ్ అసెంబ్లీ ఏర్పడుతుంది.

ఆంధ్రరాష్ట్రం యీక్రింది ప్రాంతాలలో ఏర్పడుతుంది: శ్రీకాకుళం, విశాఖపట్టణం; తూర్పుగోదావరి, పడమటిగోదావరి, కృష్ణ, గుంటూరు; నెల్లూరు, అనంతపురం, కడప, కర్నూలు; చిత్తూరుజిల్లాలు; బళ్ళారిజిల్లాలోని ఆదోని, ఆలూరు, రాయదుర్గం తాలూకాలు.

బళ్ళారిజిల్లాలోని సిరుగుప్ప, హొసపేట, సొండూరు, హార్పనహళ్ళి; హడగళి, కుడ్లిగి తాలూకాలు మైసూరురాష్ట్రంలో కలిపివేయబడుతవి. బళ్ళారితాలూకావిషయం తరువాత నిర్ణయింప బడుతుంది.

ఆంధ్రరాష్ట్ర రాజధానిని ఎక్కడ పెట్టుకొనేది, జులై 1 తేది లోపల ఆంధ్రశాసనసభ్యులు నిర్ణయించి, కేంద్రప్రభుత్వానికి తెలియపరచాలి.

బళ్లారి తాలూకా భవిష్యత్తును గురించి ప్రభుత్వానికి సలహా ఇవ్వడానికి హైదరాబాదు ప్రధాన న్యాయమూర్తి శ్రీ లక్ష్మీశంకర్ మిశ్రాను కేంద్రప్రభుత్వం నియమించింది. ఆయన బళ్ళారిలో విచారణ జరిపి ఆ తాలూకాను మైసూరు రాష్ట్రంలో కలిపివెయ్యాలని సలహా ఇచ్చారు. ఆ సలహాను, 1953 మే 20 తేదిన కేంద్రప్రభుత్వం ఆమోదించింది.

## రాజధాని

ఆంధ్రరాష్ట్ర తాత్కాలిక రాజధానిని ఎక్కడ పెట్టాలనే విషయాన్ని నిర్ణయించడానికి, మదరాసు శాసనసభలోని ఆంధ్ర సభ్యుల సమావేశం 1953 జూన్ 1 నుంచి 5 వరకు జరిగింది. ఈ సభకు శ్రీ టంగుటూరి ప్రకాశం అధ్యక్షత వహించారు. రాజధానిని కర్నూలులో పెట్టాలనే తీర్మానం ఈ సమావేశంలో నెగ్గింది. గుంటూరు-విజయవాడలో పెట్టాలనే తీర్మానం, విజయవాడలో పెట్టాలనే తీర్మానం ఓడిపోయినవి. విజయవాడ తీర్మానమునకు అనుకూలంగా 53 ఓట్లు, ప్రతికూలంగా 79 ఓట్లు వచ్చినవి.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణచట్టపు ముసాయిదాపై మదరాసు రాష్ట్ర అసెంబ్లీ చర్చ 1953 జులై 14 న ప్రారంభమైంది. జులై 27 న పూర్తి అయింది. లెజిస్లేటివ్ కౌన్సిలులో చర్చ జులై 29 తేదిన పూర్తి అయింది.

ఈ బిల్లు పార్లమెంటు ప్రజా సభలో 1953 ఆగస్టు 10 తేదిన ప్రవేశ పెట్టబడింది, ఆగస్టు 26 తేదిన ప్యాసయింది.

రాష్ట్ర ప్రతినిధుల సభలో ఆగస్టు 31 తేదిన ప్రవేశ పెట్టబడింది. సెప్టెంబరు 12 న ప్యాసయింది.

బిల్లుకు రాష్ట్రపతి అంగీకారం, సెప్టెంబరు 14 న ఇవ్వబడింది.

ఆంధ్రరాష్ట్ర నిర్మాణపు ఏర్పాటులలో, ఆంధ్రరాష్ట్రం తరఫున మదరాసు రాష్ట్రంనుంచి ఉద్యోగుల పంపిణీ మొదలైన కార్యాలను నెరవేర్చడానికి స్పెషల్ ఆఫీసరుగా శ్రీ చందూలాల్ మాధవలాల్

త్రివేది నియమించబడినారు. వీరు 1953 ఆగస్టు 6 తేదిన మదరాసుకు వచ్చారు. వీరికి సలహాదార్లుగా పనిచెయ్యడానికి శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ గౌతు లచ్చన్నగార్లు నియమింపబడినారు. వీరి సలహాలతో, రాష్ట్ర విభజనలో ఆంధ్రరాష్ట్రప్రభుత్వంతు పంపకములను జరిపించుటలో 1953 సెప్టెంబరు 30 వరకు శ్రీ త్రివేది నియుక్తులై వున్నారు. అక్టోబరు 1 నుంచి, ఆంధ్రరాష్ట్ర గవర్నరుగా వీరే నియమింపబడినారు.

1953 అక్టోబరు 1 తేదిన ఆంధ్రరాష్ట్రం అవతరించింది. రాష్ట్ర స్థాపనను, తాత్కాలిక రాజధాని కర్నూలులో, భారత ప్రధానమంత్రి జవహర్ లాల్ నెహ్రూ జరిపారు.

ఆంధ్రరాష్ట్ర హైకోర్టును తాత్కాలికంగా గుంటూరులో స్థాపించాలనే ప్రతిపాదన, రాష్ట్ర శాసనసభలో 1954 మార్చి 1 తేదిన ఆమోదింపబడింది. ఆ తీర్మానానికి అనుకూలంగా 67 మంది, ప్రతికూలంగా 66 మంది ఓటు చేశారు.

## శ్రీబాఘ్ ఒడంబడిక

ఆంధ్రదేశంలోని, దత్తమండలము జిల్లాలు లేదా రాయలసీమ అని వ్యవహరింపబడే బళ్ళారి, అనంతపురము, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాలు ఆర్థికంగాను, పారిశ్రామికంగాను విద్యావిషయములోను చాలా వెనుకబడి ఉన్నవి. చాలకాలము రాష్ట్రపరిపాలన తమిళాంధ్ర నాయకుల చేతులలో ఉమ్మడిగా ఉండటంవల్ల రాయలసీమ పరిస్థితులను చక్కపరచడానికి తగినకృషి జరుగలేదు. అందువల్ల రాయలసీమవారు ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర నిర్మాణము జరిగినప్పుడు తమ జిల్లాల అభివృద్ధికి మిగతా జిల్లాల ఆంధ్రులు తగినకృషి చేస్తారనే హామీ కావాలని కోరారు. ఈ విషయంలో రాయలసీమ, సర్కారు జిల్లాల నాయకులు మదరాసులోని శ్రీ దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి భవనం శ్రీబాఘ్‌లో సమావేశమై 1937 నవంబరు 15 తేదిని ఒడంబడిక చేసుకున్నారు. దీనికే శ్రీ బాఘ్ ఒడం

బడిక అని పేరు. దీనిపై సంతకములు పెట్టినవారు: కోస్తా జిల్లాల తరఫున: డాక్టరు పట్టాభిసీతారామయ్య, కొండా వెంకటప్పయ్యపంతులు, మహబూబ్ అలిబేగ్; చల్లపల్లి రాజా, లేబూరి సుబ్బరామిరెడ్డి.

రాయలసీమ తరఫున: కడప కోటిరెడ్డి, టి. ఎన్. రామకృష్ణారెడ్డి, పప్పూరు రామాచార్యులు, కల్లూరు సుబ్బారావు, హాలాహర్వి సీతారామరెడ్డి. దీనిలోని ముఖ్యాంశములు ఇవి:

(1) రెండు విశ్వవిద్యాలయ కేంద్రాలు:— ఆంధ్రదేశంలో వైజ్ఞానిక కేంద్రాలను వ్యాపింప చేయడానికీ, వైజ్ఞానికంగాను, సామాజికంగానూ ఆంధ్రులలో పరస్పర సహకారం అభివృద్ధి చెందటానికీ, ఆంధ్ర విశ్వవిద్యాలయపు ఆధ్వర్యం క్రింద వాల్తేరులో ఒకటి, రాయలసీమలో ఒకటి, రెండు కేంద్రాలను ఏర్పరచాలని ఈ కమిటీ (సంప్రదింపుల సంఘం) అభిప్రాయపడుతున్నది. కళాశాలలను స్థాపించే విషయంలో బోధించే శాస్త్రాలకు ఏప్రాంతం అనుకూలంగా వుంటుందో ఆ ప్రాంతంలో స్థాపించాలని కమిటీ అభిప్రాయపడుతున్నది.

(2) నీటిపారుదల:-రాయలసీమ, నెల్లూరు జిల్లాల ఆర్థిక, వ్యవసాయిక సంపదలు కోస్తాజిల్లాల సంపదలతో సరితూగేటు చేసేందుకై కృష్ణా, తుంగభద్రా పెన్నానదులు ప్రాజెక్టుకు 10 సంవత్సరాలవరకూ యెక్కువ ప్రాధాన్యత ఇవ్వాలి. ఈ కాలపరిమితి అవసరమైతే పెంచాలి.

ఈ నదులనీటి పంపిణీలో రాయలసీమ నెల్లూరు జిల్లాల అవసరాలనే ముందు పరిగణించాలి. ఈ విధానం రాష్ట్రపరిపాలనలో ఇప్పటినుంచే అనుసరించాలి.

(3) శాసనసభ:- శాసనసభా స్థానాలు జిల్లాలవారిగా సమానంగా ఉండేట్లు చూడాలి.

(4) రాజధాని, హైకోర్టు: విశ్వకళాపరిషత్తు కార్యాలయం, రాజధాని, హైకోర్టును మూడింటినీ వివిధ ప్రాంతాలలో నెలకొల్పటానికి అంగీకరించబడ్డది. పరిపాలనా ప్రాధాన్యతను ఒకే ప్రాంతంలో కేంద్రీకరించకుండా ఉండటమే దీని ఉద్దేశం. ఈ

సూత్రాన్ని అనుసరించి విశ్వవిద్యాలయ కార్యాలయం ప్రస్తుతం ఉన్న చోటనే (వాల్తేరులో) ఉండటానికీ; హైకోర్టు, రాజధానులలో ఒకటి కోస్తా జిల్లాలలోనూ, ఒకటి రాయలసీమలోనూ ఉంచేందుకు అంగీకరించబడ్డది. అయితే ఏది ఎక్కడ ఉండాలనేది రాయలసీమవాసులే నిర్ణయిస్తారు.

(5) ఇరుపక్షాలు సమ్మతిస్తే ఈ అంశాల్లో మార్పులు చేసుకోవచ్చును.

## విశాలాంధ్ర

విశాఖపట్టణంజిల్లా, తూర్పుగోదావరిజిల్లా, పడమటి గోదావరి జిల్లా, కృష్ణాజిల్లా, గుంటూరుజిల్లా, నెల్లూరుజిల్లా, కర్నూలుజిల్లా, కడపజిల్లా, చిత్తూరుజిల్లా, అనంతపురంజిల్లా, నెల్లూరుజిల్లా సరిహద్దునుంచి మదరాసు నగరంవరకువున్న చెంగల్పట్ జిల్లాలోనిభాగం, బళ్ళారి జిల్లాలోని రాయదుర్గ్; ఆదోని, ఆలూరు తాలూకాలు, ఉత్తరార్కాడుజిల్లాలోని తెలుగుప్రాంతాలు, సేలంజిల్లాలోనిహోసూరు తాలూకా, మదరాసునగరం, బళ్ళారినగరం, ప్రస్తుతంఒరిస్సారాష్ట్రంలో కలిపివేయబడిన తెలుగుప్రాంతాలు, హైదరాబాదు సంస్థానంలో 41,502 చ. మైళ్ళ ఆంధ్రదేశమూ, మైసూరు సంస్థానంలో 6,000 చ. మైళ్ళ ఆంధ్రదేశమూ, సెంట్రల్ ప్రావిన్సెసులో బస్తర్ [సంస్థానాన్ని కలుపుకొని] 3,800 చ. మైళ్ళ ఆంధ్రదేశమూ.

# ఆంధ్ర రాష్ట్ర వివరాలు

1953 అక్టోబరు 1 తేదిన ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరిగింది. మదరాసు రాష్ట్రంలోని శ్రీకాకుళం, విశాఖపట్టణం తూర్పుగోదావరి, పడమట గోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురం జిల్లాలు, బళ్ళారి జిల్లాలోని ఆలూరు; ఆదోని, రాయదుర్గం తాలూకాలతోను ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఆలూరు, ఆదోని తాలూకాలు కర్నూలు జిల్లాలోను, రాయదుర్గం తాలూకా

అనంతపురం జిల్లాలోను కలిపివేయబడినందున, ఆంధ్రరాష్ట్రంలో జిలాలు మొత్తం, 11. దీని వైశాల్యం మొత్తం, 64,193 చ. మైళ్లు.

## జనాభా

1951 జనాభా ప్రకారం ఆంధ్రరాష్ట్రంలోని జనాభా మొత్తం 2,05,07,801.

### జిల్లాల జనాభా

| | | | |
|---|---|---|---|
| అనంతపురం : | 13,61,556 | తూర్పు గోదావరి : | 24,14,808 |
| కడప : | 11,61,731 | నెల్లూరు : | 17,95,632 |
| కర్నూలు : | 12,70,843 | పడమటి గోదావరి : | 16,97,727 |
| కృష్ణా : | 17,79,484 | బళ్లారి 3 తాలూకాలు: | 4,69,813 |
| గుంటూరు : | 25,49,996 | విశాఖ పట్టణం : | 20,72,698 |
| చిత్తూరు : | 18,10,377 | శ్రీకాకుళం : | 21,23,136 |

మొత్తం ఆంధ్ర రాష్ట్ర జనాభా : 2,05,07,801. జిల్లాలలో ఎక్కువ జనాభాగలది గుంటూరు ; తక్కువ జనాభా గలది కడప.

### రాష్ట్రంలో ముఖ్య నగరముల జనాభా

| | | | |
|---|---|---|---|
| విజయవాడ : | 1,61.198 | మచిలీ పట్టణం : | 73,021 |
| గుంటూరు : | 1,28,255 | విజయనగరం : | 67,156 |
| విశాఖపట్టణం : | 1,08,042 | కర్నూలు | 60,110 |
| నెల్లూరు : | 1,06,603 | తెనాలి : | 57,980 |
| రాజమండ్రి : | 1,05,276 | ఆదోని : | 53,508 |
| కాకినాడ : | 1,00,054 | కడప : | 37,446 |
| ఏలూరు : | 87,060 | | |

రాష్ట్రంలోని ప్రజలలో 1,79,24,111 మంది గ్రామాలలోనూ, 33,57,402 మంది పట్టణాలలోనూ నివసిస్తున్నారు. జిల్లలవారీగా గ్రామాలలోనూ పట్టణాలలోనూ ఎంతమంది నివసిస్తున్నదీ, ప్రక్క పేజీలోని పట్టీవలన తెలుస్తుంది.

| జిల్లా | గ్రామాలలో | పట్టణాలలో |
|---|---|---|
| అనంతపురం : | 11,39,998 | 2,21,558 |
| బళ్లారి తాలూకాలు : | 4,16,255 | 53,508 |
| చిత్తూరు : | 16,41,043 | 1,69,334 |
| కడప : | 10,27,502 | 1,34,229 |
| తూర్పుగోదావరి : | 19,54,662 | 4,60,146 |
| పడమటి గోదావరి : | 13,66,458 | 3,31,269 |
| గుంటూరు : | 20 48,075 | 5,01.921 |
| కృష్ణ : | 14,09,392 | 3,70,092 |
| కర్నూలు : | 10,70,625 | 2,00,218 |
| నెల్లూరు : | 15,91,993 | 2,03,639 |
| శ్రీకాకుళం : | 19,32,851 | 1,90,785 |
| విశాఖపట్టణం : | 17 67,840 | 3,04,858 |

1952 లో ఆంధ్ర రాష్ట్రంలో మొత్తం 17,090 గ్రామాలు, 170 పట్టణాలు వున్నాయి. ఈ జనపదాలలో, ప్రజలు నివసించడానికి ఉన్న యిళ్లు మొత్తం, ఈ ఇళ్లలో నివసిస్తున్న మొత్తం కుటుంబాలు, జిల్లాలవారీగా వివరాలు ఇవి :

| జిల్లా : | గ్రామాలు : | పట్టణాలు : | ఇళ్లు : | కుటుంబాలు : |
|---|---|---|---|---|
| అనంతపురం : | 844 : | 14 : | 2,39,633 : | 2,66,872 |
| కడప : | 858 : | 9 : | 2,10,986 : | 2,37,060 |
| కర్నూలు : | 839 : | 14 : | 2,40,602 : | 2,63,475 |
| కృష్ణ ; | 962 : | 12 : | 3,23,870 : | 3,83,099 |
| గుంటూరు : | 927 : | 25 : | 4 91,670 : | 5,57,680 |
| చిత్తూరు : | 1,907 : | 14 : | 3,15,393 : | 3,56,447 |
| తూర్పుగోదావరి : | 1,816 : | 20 : | 4,36,576 . | 5,39,695 |
| నెల్లూరు : | 1,561 : | 12 : | 3,38,013 : | 3,67,099 |
| పడమటిగోదావరి : | 789 : | 20 : | 3,15,982 : | 3,82,106 |
| బళ్లారితాలూకాలు : | 301 : | 3 : | | |

| | | | | |
|---|---|---|---|---|
| విశాఖపట్టణం : | 3,208 : | 11 : | 4,07,513 : | 4,48,918 |
| శ్రీకాకుళం : | 3,052 : | 16 : | 4,36,228 : | 4,49,861 |
| మొత్తం : | 17,090 : | 170 : | 39,79,569 : | 45,01,726 |

ఆంధ్రదేశంలో ఎక్కువ గ్రామాలుగల జిల్లా విశాఖపట్టణం; ఎక్కువ పట్టణాలు, ఎక్కువ ఇళ్ళు, ఎక్కువ కుటుంబాలుగలది గుంటూరు. తక్కువ గ్రామాలుగలజిల్లా పడమటిగోదావరి; తక్కువ పట్టణాలు, తక్కువ ఇళ్ళు, తక్కువ కుటుంబాలుగలది కడప.

## వ్యవసాయదారులు

రాష్ట్ర జనాభాలో, 1,44,99,427 మంది ప్రజలు వ్యవసాయ వృత్తి జీవనాధారంగా వున్నారు.

వారిలో 83,96,099 మంది, స్త్రీలతోసహా, సొంతసేద్యం చేసుకుంటున్నారు; 4,94,438 మంది, స్త్రీలతో సహా తమ భూమిని కౌలుకు ఇస్తున్నారు; 41,11,598 మంది, స్త్రీలతోసహా, ఇతరుల భూమిని కౌలుకు తీసుకొని జీవనం జరుపుతున్నారు. 14,97,292 మంది, స్త్రీలతోసహా, చిన్న రైతులు, ఇతరుల భూమినికూడా కౌలుకు తీసుకొని బ్రతుకుతున్నారు.

## పశు సంపద

1951 డిసెంబరులో తీసుకున్న లెక్కలప్రకారం, మనరాష్ట్రంలోని పశుసంపద ఇది:

| | |
|---|---|
| ఆవులు : మొత్తం | 23,51,000 |
| పాలిస్తూవున్నవి | 8,10,000 |
| ఎద్దులు : మొత్తం | 29,97,000 |
| ఆంబోతులు | 23,000 |
| పొలం పనులకు ఉపయోగిస్తున్నవి | 26,41,000 |
| గేదెలు : మొత్తం | 22,77,000 |
| పాలిచ్చేవి | 10,63,000 |

| | |
|---|---|
| దున్నలు : మొత్తం | 9,52,000 |
| ఆంబోతులు | 31,000 |
| పొలం పనులకు ఉపయోగిస్తున్నవి | 7,58,000 |
| గొర్రెలు | 68,58,000 |
| మేకలు | 28,54,000 |
| గుర్రములు | 44,000 |
| పందులు | 5,79,000 |
| కోళ్ళు | 77,94,000 |
| బాతులు | 2,68,000 |

# వ్యవసాయపుభూమి: పంటలు

## 1953

| వివరం : | ఎకరాలు |
|---|---|
| రాష్ట్రంలో మొత్తంభూమి : | ... 4,30,32,026 |
| దానిలో అడవి : | ... 82,92,816 |
| సాగుకువీలులేని బంజరు : | ... 57,07,641 |
| సాగుకువీలయె బంజరు : | ... 35,60,156 |
| దున్ని, పంట వేయని భూములు : | ... 25,59,046 |
| సాగులోవున్న భూమి : | ... 1,69,45,260 |
| నీటిసరఫరా ఎప్పుడూ వుండేభూమి : | ... 27,00,000 |

రాష్ట్రంలో రైతువారి అధీనంలోవున్న భూమి, 2,56,12,963 ఎకరాలు.

రాష్ట్రంలోని భూమిలో 1952 లో 1,55,10,000 ఎకరాల భూమిలో వ్యవసాయం జరిగింది. దీనిలో 18,94,000 ఎకరాల భూమిలో రెండు పంటలు వెయ్యబడినవి. కాబట్టి, రాష్ట్రం మొత్తంలో ఎన్ని ఎకరాలలో పంటలు పండినవి అంటే, 1,74,04,000 ఎకరాలు అని చెప్పవలసి వుంటుంది.

## పంటభూమి

1951-52 లో రాష్ట్రంలో ఏ ఏ పంటలు ఎన్ని ఎకరాలలో సేద్యమైనదీ వివరాలు ఇవి: బియ్యం, 42,41,000; యవధాన్యములు, 66,56,000; పప్పుదినుసులు, 1,04,000; వేరుశనగ, 22,22,000; ప్రత్తి; 6,77,000; చెరకు, 1,37,000; నువ్వులు, 3,32,000; పొగాకు, 2,45,000; ఆముదము, 1,66,000.

## పంటలు

1951-52 లో రాష్ట్రంలో పండిన ముఖ్య పంటలవివరాలివి. పంట అంకెలు టన్నులలో ఇవ్వబడినవి: వరి, 18.07,000; జొన్నలు, 5,34 000; సజ్జలు, 2,07,000; రాగులు, 2.21,000; కొర్రలు, 2,69,0.0; మొక్కజొన్న, 11,000; గోధుమ, 1,000; పప్పుదినుసులు; 16,000; చెరకు, 3,80,000; వేరుశనగ, 7,77,000; నువ్వులు, 13,000; పొగాకు, 76,000; ప్రత్తి (బేళ్లు), 86,000.

## బంజరు భూమి

ఆంధ్రరాష్ట్రంలో మొత్తం వ్యవసాయానికి ప్రజలకు ఇవ్వడానికి 13,43,853 ఎకరాల బంజరు భూమి వున్నది. దీనిలో 4,06,862 ఎకరాల భూమి శివాయి జమాదార్ల ఆక్రమణలో వున్నది.

బంజరు భూమి, ఏ జిల్లాలో ఎంతవున్నదీ, వివరాలు ఇవి: అనంతపురం, 2 45,325; కడప, 44,995; కర్నూలు, 2,77,256; కృష్ణ, 37,665; గుంటూరు, 48,639; చిత్తూరు, 88,973; తూర్పు గోదావరి, 2,58,338; నెల్లూరు, 2,64,873; పడమటి గోదావరి, 30,360; విశాఖపట్టణం, 24,221; శ్రీకాకుళం, 23 209, ఎకరాలు.

## ఆంధ్ర దేశపు స్వయంసమృద్ధి

ఆంధ్రరాష్ట్రంలో 1950-51 లో 18,61,230 టన్నుల బియ్యం, 5,91,400 టన్నుల జొన్నలు, 1,89,650 టన్నుల సజ్జలు, 2,34,870 టన్నుల రాగులు, 1,69,370 టన్నుల కొర్రలు, మొత్తం 30,46,520 టన్నుల ఆహారధాన్యాలు పండినవి.

జనాభాలో మూడవవంతు పన్నెండేళ్ళలోపువారు వుంటారు. అంటే 68,35,934 మంది పన్నెండేళ్ళలోపువారూ, 1,36,71,867 మంది పన్నెండేళ్ల పైబడినవారూ వుంటారనుకోవచ్చును. పన్నెండేళ్ల లోపు వారికి రోజుకు ఆరు ఔన్సులూ, పన్నెండేళ్లపైబడిన వారికి రోజుకు 12 ఔన్సులూ ఆహారధాన్యాలు ఇస్తే, సంవత్సరానికి మొత్తం 20 లక్షల-టన్నుల ఆహారధాన్యాలు చాలును. పండిన పంటలో ఇంకా పది లక్షల టన్నుల ఆహారధాన్యాలను ఎగుమతి చెయ్యవచ్చును. కాని; తెలుగుజిల్లాలు అరవజిల్లాలతో ఒకే రాష్ట్రంలో వుండటంవల్ల, తెలుగుజిల్లాలనుంచి ఆహారధాన్యాలు తక్కిన తమిళ జిల్లాలకు ఎగుమతి కావడంవల్ల తెలుగు జిల్లాలలోకూడా ధాన్యం కొరత ఏర్పడింది. సర్కారు జిల్లాలలో పండిన పంటల ఫలితాన్ని రాయలసీమ ప్రజలకు ఉపయోగించడానికి బదులు, దక్షిణాది ప్రజల ఉపయోగార్థం ఎగుమతి చెయ్యడమూ, రాయలసీమ కరవువల్ల ప్రజలు అత్యంతంగా బాధపడుతూవున్నా, సర్కారులలోని పంటను వారు అనుభవించకపోవడమూ జరిగింది.

1953 డిసెంబరు 15 వరకు, ఆంధ్రరాష్ట్రంలోని కృష్ణ, నెల్లూరు పశ్చిమ గోదావరి జిల్లాలనుంచి మదరాసు రాష్ట్రంలోని తరుగు జిల్లాలకు యథేచ్ఛగా బియ్యాన్ని రవాణా చెయ్యడానికి వీలుండేది. తరువాత, యీ ఏర్పాటు రద్దుచేయబడింది.

ఇకముందు, ఏడాదికి లక్ష టన్నుల బియ్యాన్ని ఆంధ్రప్రభుత్వమే రాష్ట్రంలో సేకరించి, మదరాసు ప్రభుత్వానికి 1953 లో వున్నధరకు అమ్ముతుంది.

అంతేకాక, మరొక లక్ష టన్నుల బియ్యాన్ని మదరాసు రాష్ట్రంలోని వర్తకులకు ఆంధ్రప్రభుత్వం అమ్ముతుంది. ఈ బియ్యంధర, మదరాసు ప్రభుత్వానికి ఇచ్చేధరకన్న కొంచెం హెచ్చుగావుంటుంది; అయితే, గత సంవత్సరంలో వర్తకులు కొన్నిదానికంటె కొంచెంతక్కువగా వుంటుంది.

# వ్యాపారపు పంటలు

ప్రత్తి :

1951-52 లో ఆంధ్ర రాష్ట్రంలో 5,41,000 ఎకరాల భూమిలో ప్రత్తిపంట వెయ్యబడింది. 68,750 బేళ్ల ప్రత్తి, రు. 2,15,58,000 విలువగలది పండింది. ప్రత్తి ఎక్కువగా పండేజిల్లాలలో ప్రథమస్థానం కర్నూలు, రెండవస్థానం అనంతపురం. కర్నూలుజిల్లాలో 1,40,245 ఎకరాలలో 17,890 బేళ్లప్రత్తి, అనంతపురం జిల్లాలో 1,03,104 ఎకరాలలో 10,000 బేళ్లప్రత్తి పండింది. ఈ రెండిటి తరువాత కడప జిల్లా.

వేరుశనగ :

రాష్ట్రం అంతటిలోనూ 1951-52 లో మొత్తం 22,05,000 ఎకరాలలో వేరుశనగ పంట వెయ్యబడింది. మొత్తం 8,16,300 టన్నుల వేరుశనగ కాయలు రు. 51,42,69,000 విలువగలవి పండినవి.

చెరకు :

1952-53 లో ఆంధ్ర రాష్ట్రంలో 1,34,060 ఎకరాలలో చెరకు పంట వేయబడింది. దీనిలో 3,78,100 టన్నుల బెల్లం లభించింది. దాని విలువ రు. 40,72,38,000.

ధనియాలు :

ఆంధ్రదేశంలో మొత్తం 50,100 ఎకరాలలో ధనియాల పంట వేయబడింది. దీనిలో ఎక్కువ భాగం, 31,735 ఎకరాలు, గుంటూరు జిల్లాలోనే.

మిరపకాయలు :

1950-51 లో ఆంధ్ర రాష్ట్రంలో మొత్తం 2,69,265 ఎకరాల భూమిలో మిరప పంట వేయ బడింది. దీనిలో 1,06,550 టన్నుల

మిరపకాయలు పండినవి. వీనివిలువ రు. 22,87,87,880. రాష్ట్రంలో మిరప పంట వేసేజిల్లాలలో ప్రథమస్థానం గుంటూరుది. ఈ జిల్లాలో 1950-51 లో 95,093 ఎకరాలలో మిరప పంట వెయ్యబడింది. 28,660 టన్నుల మిరపకాయలు, రు 6,15,26,000 విలువగలవి పండినవి. గుంటూరు జిల్లా తరువాత చెప్పవలసినది కర్నూలు జిల్లా. ఈజిల్లాలో 56,651 ఎకరాలలో రు. 4,15,39,806 విలువగల 19,350 టన్నుల మిరపకాయలు పండినవి

పొగాకు :

ఆంధ్ర రాష్ట్రంలోని ముఖ్యమైన వ్యాపారపు పంటలలో పొగాకు ఒకటి. 1950-51 లో 3,35,240 ఎకరాలలో యీ పంట వెయ్యబడింది. 1,10,337 టన్నులు పొగాకు పండింది. దీని విలువ రు. 20,71,33,500.

ఇండియాలోని రాష్ట్రాలన్నిటిలోకి ఎక్కువగా పొగాకు పంట పండే రాష్ట్రం మనదే. ఇండియాలో పండే పంటలలో నూటికి 95 వంతుల పొగాకు గుంటూరు, కృష్ణా, తూర్పు గోదావరి జిల్లాలలోనే పంట అవుతుంది. రాష్ట్రంలోని జిల్లాలన్నిటిలోకీ గుంటూరు జిల్లాలోనే యీపంట ఎక్కువ. 1950-51 లో గుంటూరు జిల్లాలో 1,94,895 ఎకరాలలో 65,460 టన్నుల పొగాకు పండించ బడింది. దీనివిలువ రు. 12,28,90,000.

నీరుల్లిపాయలు :

ఆంధ్ర రాష్ట్రంలో 1950-51 లో 28,762 ఎకరాలలో 1,06,990 టన్నుల నీరుల్లిపాయలు, రు. 1,63,16,500 విలువగలవి పండించ బడినవి. ఏడాదికి దాదాపు రు. 30 లక్షల ఉల్లిపాయలు మన రాష్ట్రంనుంచి ఎగుమతి అవుతవి. రాష్ట్రంలో ఉల్లిపాయలు ఎక్కువగా పైరయే జిల్లా కడప. ఈ జిల్లాలో 1950-51 లో 5,310 ఎకరాలలో 26,670 టన్నుల ఉల్లిపాయలు రు. 36 లక్షల విలువ చేసేవి, పండించ బడినవి.

# ఖనిజ సంపద

ఆంధ్ర రాష్ట్రంలో విస్తారమైన ఖనిజ సంపదవుంది. రాష్ట్రంలోని 63 వేల చదరపు మైళ్ళ లోనూ దాదాపు 20 వేల చదరపుమైళ్ళ భూమిలో మాత్రమే ఏఏ ఖనిజ సంపత్తి వున్నదో పరిశోధన జరిగింది. 43 వేల చదరపు మైళ్ళ భూమిలో ఇంకా పరిశోధన జరగవలసి వుంది. ఇప్పటికి తెలిసినంతవరకు ఆంధ్ర రాష్ట్రంలో దొరికే ముఖ్యమైన ఖనిజములు ఏమిటంటే: మెంగనీస్, సున్నపురాయి, అస్బెస్టాస్, వజ్రములు, అభ్రకము.

1951 లో రు. 87,42,990 విలువగల 63,355 టన్నుల మెంగనీస్ విశాపట్టణం జిల్లాలోనూ, రు. 32,05,617 విలువగల 19,492 హండ్రెడు వెయిట్లు అభ్రకం నెల్లూరు జిల్లాలోనూ, రు. 2,56,870 విలువగల బొరైట్స్ కడప జిల్లాలోనూ త్రవ్వబడినవి.

# నీటి తీరువ సదుపాయాలు

ఆంధ్రరాష్ట్రంలో వ్యవసాయయోగ్యమైనభూమి 2,06,05,416 ఎకరాలు. అయితే దీనిలో 1,69,35,260 ఎకరాల భూమిలోనే, 1952-53 లో వ్యవసాయం జరిగింది. దీనిలో, మాగాణి, 50 లక్షల ఎకరాలు.

మాగాణి భూమిలో చెరువుల మీద ఆధారపడి వ్యవసాయంజరిగేది 12,02,763 ఎకరాలు. బావుల మీద ఆధారపడి వ్యవసాయం జరిగేది 4,92,454 ఎకరాలు. తక్కిన భూమికి నదులవల్లా, కాలువలవల్లా నీటి తీరువ లభిస్తున్నది.

ఆంధ్రరాష్ట్రంలో పంటభూములకు అత్యధికంగా నీటి తీరువ జరిగే ప్రాంతాలు కృష్ణా, గోదావరి డెల్టాలలోనే. 1952-53 లో నదుల కాలువలవల్లనూ; ఆప్రాంతాలలో బావుల వల్లనూ, ఏఏ ప్రాంతాలలో ఎంతెంత భూమికి నీటి తీరువకట్టినదీ, ముఖ్యమైన ప్రాంతాలను గురించిన వివరాలివి: నీటి తిరువపొందిన ప్రాంతపు వైశాల్యంఎకరాలలో

ఇవ్వబడింది. ఇక్కడయిచ్చిన వివరాలు ఆయాప్రాంతాలలో పండిన రెండుపంటలూ ఎంతభూమిలో పండినదీ సూచిస్తాయి,

| కాలువలు : | పండిన భూమి |
|---|---|
| గోదావరి డెల్టా : | 13,11,968 |
| కృష్ణా డెల్టా : | 11,97,419 |
| పెన్నానది : | 1,84,269 |
| తాడేపల్లి కాలువ : | 25,988 |
| కృష్ణ తూర్పు కాలువ : | 85,663 |
| కర్నూల్-కడప కాలువ : | 89,772 |
| చికాకోల్ కాలువ : | 70,849 |
| నాగావళి నది : | 29,023 |

ఆంధ్ర రాష్ట్రింలో, ప్రజలకూ; పంటలకూకూడా ప్రధాన జీవనదులు, గోదావరి, కృష్ణ; పెన్న; ఈ నదులవల్ల ఎంత భూమికి నీటి సరఫరా అయేదీ వాటి పుట్టుక, ప్రవాహం, వివరాలు క్రింద ఇవ్వ బడినవి :

## గోదావరి :

అరేబియన్ సముద్రానికి 50 మైళ్ళ దూరాన, పశ్చిమ కనుమలలో పుట్టి తూర్పుకు ప్రవహించి, బంగాళా ఖాతంలో పడుతున్నది. ఈ మహా నది పొడవు 900 మైళ్లు. మంజీర, ప్రాణహిత, ఇంద్రావతి, శబరి, అనేవి యీ నదికి ఉపనదులు. ఈ మహానదిలోనికి సుమారు 1,21,500 చదరపు మైళ్ళ ప్రాంతంలోనుంచీ, వాగులోనుంచీ నీరు కలుస్తుంది. ఈ మహా నది కాలువవల్ల, 8,20,000 ఎకరాలపైగా భూమికి మొదటిపంటవ్యవసా యానికి నీరు లభిస్తున్నది. రెండవపంటకు మొత్తం మూడు లక్షల ఎకరాలకు నీరులభిస్తుంది. ఈ నది నీటి తీరువపొందే ప్రాంతంలో పండే పంట విలువ ఏడాదికి 1,177 లక్షల రూపాయలువుంటుంది. ఈనది నీటిని వ్యవసాయానికి అందజెయ్యడానికి కాలువలూ, ఆనకట్టలూ, కట్ట డానికి మొత్తం రు. 220,00,000 అయింది. ఈ పెట్టుబడిమీద, ఏడా

దికి 18.22 వంతులచొప్పున, పన్నులరూపంగా తిరిగివస్తున్నది. ఈనదికి ఆనకట్ట, రాజమండ్రికి దిగువ ధవళేశ్వరంవద్ద కట్టారు. అయితే గోదావరిలో ప్రతిసంవత్సరం ప్రవహించే నీటిలో నూటికి 6.5 వంతులు మాత్రమే ప్రస్తుతం ఉపయోగింపబడుతున్నది.

కృష్ణ :

ఆంధ్రదేశాన్ని సస్యశ్యామలం చేస్తున్న మహానదులలో రెండవది కృష్ణ. ఈ నదికూడా పశ్చిమ కనుమలలో మహాబలేశ్వరం వద్ద పుట్టి 775 మైళ్లు ప్రవహించి బంగాళాఖాతంలో పడుతున్నది. భీమనది, తుంగభద్ర, మూసినదులు దీనికి ఉపనదులు. సుమారు 97,000 చదరపు మైళ్ళ ప్రాంతంనుంచి వాన నీరు వాగులు దీనిలో కలుస్తాయి. గోదావరికి ఆనకట్టి కట్టిన సర్ ఆర్థర్ కాటన్ కృష్ణకుకూడా విజయవాడ వద్ద ఆనకట్ట కట్టించారు. ఈనది కాలువలవల్ల సుమారు 9,30,000 ఎకరాలభూమికి నీటిసరఫరా అవుతున్నది. ఈ భూమిలోపండే పంటల విలువ ఏడాదికి దాదాపు 12 కోట్ల రూపాయలు. ఈ నదికి కాలువలు, ఆనకట్టకట్టడానికి రు. 2,20,00,100 ఖర్చయింది. ఈ పెట్టుబడిమీద ప్రస్తుతం ఏడాదికి నూటికి 16.20 వంతుల చొప్పున, పన్నులరూపంగా ఆదాయంవస్తుంది. కృష్ణలో ప్రతిసంవత్సరం ప్రవహించే నీటిలో, నూటికి ఏడు వంతులు మాత్రమే ప్రస్తుతం ఉపయోగింపబడుతున్నది.

పెన్న :

దీనికి పినాకిని అని పేరు. దీని మొత్తం పొడవు 370 మైళ్లు. ఇది మైసూరు రాష్ట్రంలో పుట్టి, అనంతపురం జిల్లా గుండా నెల్లూరు జిల్లాలో ప్రవేశించి, నెల్లూరు జిల్లానుంచి బంగాళాఖాతంలో పడుతున్నది. దీనికి సంగంవద్ద ఒక ఆనకట్ట, నెల్లూరువద్ద మరొక ఆనకట్ట వున్నాయి. ఈనదివల్ల 1,67,500 ఎకరాల భూమికి నీటితీరువ లభిస్తున్నది. దీనికి కాలువలు కట్టడానికి రు. 71,00,000 ఖర్చయింది. దీనిమీద ఏడాదికి నూటికి 5.88 వంతుల చొప్పున పన్నులరూపంగా ఆదాయం వస్తున్నది.

విశాఖపట్టణం జిల్లాలో శాహుంద, పద్మపురం గడ్డనదులు సుమారు 6,000 ఎకరాలకూ, వంశధార, లాంగుల్యనదులు సుమారు 67,000 ఎకరాలకూ నాగావళినది సుమారు 28,000 ఎకరాలకూ వరాహానది 18,000 ఎకరాలకూ, శారదానది 9,000 ఎకరాలకూ నీటివసతిని కల్గిస్తున్నవి.

# తుంగభద్ర ప్రాజెక్టు

బళ్లారిజిల్లాలో హాస్పేట సమీపంలో మల్లాపురంవద్ద తుంగభద్రకు ఆనకట్టకట్టి, నీటిని నిలువచేయడానికి తటాక నిర్మాణం జరిగింది. ఈ రిజర్వాయిరునుంచి కాలువలలో సుమారు ఏడు లక్షల ఎకరాలకు, ఆంధ్ర, మైసూరు రాష్ట్రాలలో రాష్ట్రంలో 2½ లక్షలు, హైదరాబాదులో 4½ లక్షలు ఎకరాలు, నీటి వసతి కల్పించవచ్చును. కాలువకు రెండు ప్రక్కల, రెండుచోట్ల విద్యుచ్ఛక్తినికూడా ఉత్పత్తి చేయడానికి ఏర్పాట్లు జరుగుతున్నవి. ఈ ప్రాజెక్టుకు 50 కోట్ల రూపాయలు ఖర్చు అవుతుంది.

ఆంధ్ర రాష్ట్రంలో యీ ప్రాజెక్టు కాలువపొడవు 226 మైళ్లు వుంటుంది. దీనినుంచి నీరు తీసుకొనిపోయే చిన్న కాలువలన్నింటి పొడవూ కలిసి మొత్తం 1,700 మైళ్లు.

ఈ ప్రాజెక్టు నిర్మాణం 1945 ఫిబ్రవరిలో ప్రారంభమైంది. 1953 జులై 1 న యీ ప్రాజెక్టు కాలువలనుంచి నీటిని వదలడం జరిగింది.

తుంగభద్ర రిజర్వాయరు విస్తీర్ణం 133 చ. మైళ్లు. దీనిలో 1,13,12,60 లక్షల ఘనపు అడుగుల నీటిని నిలవచేయవచ్చును. సుమారు 10,880 చ. మైళ్ల ప్రాంతంనుంచి ప్రవాహంగా వచ్చే నీరు, తుంగభద్రా నదిలోపడి, దానినుంచి, యీ రిజర్వాయరులోనికి తీసుకు రాబడుతుంది.

ఈ ప్రాజెక్టు నిర్మాణాన్ని మదరాసు, హైదరాబాదు ప్రభుత్వాలు ఉమ్మడిగా ప్రారంభించారు. 1953 అక్టోబరు న ఆంధ్ర

రాష్ట్రం ఏర్పడడంతో, ప్రాజెక్టు నిర్మింపబడిన హాస్పేట మైసూరు రాష్ట్రంలో కలిపి వేయబడింది. కాని, యీ ప్రాజెక్టు నీటి వసరు ముఖ్యంగా రాయలసీమ జిల్లాల అభివృద్ధి కొరకు ఉద్దేశింపబడి నందు ననూ, ప్రాజెక్టు నిర్మాణానికి మదరాసు ప్రభుత్వం ఖర్చుపెట్టిన డబ్బు అంతా ఆంధ్ర రాష్ట్రపువంతు డబ్బు అయినందుననూ, యీ ప్రాజెక్టు ప్రయోజనాలను ఆంధ్ర రాష్ట్రం అనుభవించడంలో ఏవిధమైన ఆటంకాలను మైసూరు ప్రభుత్వం కల్పించకుండా వుండడానికీ, ప్రాజెక్టు పరిపాలన సక్రమంగా జరిగేటట్టు చూడడానికీ, కేంద్ర ప్రభుత్వపు ఆధ్వర్యాన 1953 అక్టోబరు 1 న తుంగభద్ర ప్రాజెక్టు బోర్డునియమింపబడింది. ఈ ప్రాజెక్టు నీటిని వదలడం విషయం లోనూ విద్యుచ్ఛక్తి ఉత్పత్తి, పంపకము మొదలైనఏర్పాట్లను సాగిం చడం విషయంలోనూ సమస్త అధికారమూ, బాధ్యతకూడా, యీ బోర్డుదే.

## తుంగభద్ర ప్రాజెక్టు బోర్డు

తుంగభద్ర ప్రాజెక్టు బోర్డుకు అధ్యక్షులుగా శ్రీ కున్వర్ సేన్ నియమింపబడినారు. సభ్యులుగా యీ క్రింది వారు నియమింప బడినారు.

1. శ్రీ ఎల్. వెంకటకృష్ణయ్యర్, ఆంధ్ర రాష్ట్ర ఇరిగేషన్ ఛీఫ్ ఇంజనీరు; 2. శ్రీ కె. ఎస్. గంగాధర, మైసూరు రాష్ట్ర ఛీఫ్ ఇంజనీరు; 3. హైదరాబాదు రాష్ట్ర ఇరిగేషన్ ఛీఫ్ ఇంజనీరు. 4. శ్రీ బులుసు రామ సోమయాజులు, ఆంధ్రరాష్ట్ర విద్యుచ్ఛక్తి ఛీఫ్ ఇంజనీరు; 5. శ్రీ జి. చాండీ, మైసూరు రాష్ట్ర విద్యుచ్ఛక్తి ఛీఫ్ ఇంజనీరు; 6. జనాబ్ అబ్దుల్ ఖాదర్, హైదరాబాదు రాష్ట్ర విద్యుచ్ఛక్తి ఛీఫ్ ఇంజనీరు.

## కృష్ణారోడ్డు వంతెన.

కృష్ణా నదిపై రోడ్డు వంతెన, రేగ్యులేటర్ నిర్మాణానికి శంఖు స్థాపనను 1954 ఫిబ్రవరి 13 న ఆంధ్రముఖ్యమంత్రి టంగుటూరి ప్రకా

శంగారుచేశారు. ఈ రెగ్యులేటర్ నిర్మాణం 1956 జూన్ నాటికిపూర్తి అవుతుంది. దీనికి రు. 2,95,00,000 వ్యయం అవుతుంది. ఈ రెగ్యులేటర్ వల్ల ప్రస్తుతం కృష్ణానది ఆయకట్టులోవున్న 11 లక్షల ఎకరాల భూమికి నీటిసాగు ఏ అంతరాయంలేకుండా వుండటమే కాక, మరొక లక్ష ఎకరాలకు అదనంగా నీటిసాగు లభిస్తుంది. ఈ రెగ్యులేటర్ పొడవు 4,014 అడుగులు వుంటుంది. అంతేకాక, బ్రిడ్జినిర్మాణంవల్ల, కృష్ణానది మీదుగా రోడ్డు ప్రయాణం, సంవత్సరం పొడుగునా ఏ అంతరాయం లేకుండా చెయ్యడానికి వీలు ఏర్పడుతుంది.

## విద్యుచ్ఛక్తి

ఆంధ్రరాష్ట్రంలో ప్రస్తుతం మూడు థర్మల్ స్టేషనులూ, 13 డీసెల్ స్టేషనులూ 16 వందల మైళ్ళ హైటన్షన్ ట్రాన్సు మిషన్ లైన్సూ 1050 మైళ్ళ లోటెన్షన్ ట్రాన్సుమిషన్ లైనులూ ఉన్నవి, 35 వేల కిలోవాట్ల విద్యుచ్ఛక్తి, తయారవుతున్నది. వ్యవసాయావసరాలకు 5,400 కిలోవాట్ల విద్యుచ్ఛక్తి సప్లయి అవుతున్నది. విద్యుచ్ఛక్తి వాడకందారులు 50,100: వ్యవసాయ దారులకు విద్యుచ్ఛక్తి సప్లయి చేసే 1500 సర్వీసులు ఏర్పాటు చేయబడినవి. మొత్తం 251 గ్రామాలకు 59 బస్తీలకు విద్యుచ్ఛక్తి సప్లయి చేయబడుతున్నది. మొత్తం ఉత్పత్తి చేయవలసిన విద్యుచ్ఛక్తి 9 కోట్ల నలభై లక్షల యూనిట్లు. 1953 ఏప్రిల్ వరకూ అయిన పెట్టుబడి అయిదు కోట్ల రూపాయలు. 1952-53 లో వచ్చిన ఆదాయం 83 లక్షల రూపాయలు. ఖర్చులు పోగా నికరాదాయం రు. 15 లక్షలు.

విద్యుచ్ఛక్తి అభివృద్ధి విషయంలో ఆంధ్రరాష్ట్రం ప్రారంభ దశలో ఉన్నది. విభజన నాటికి ఈ శాఖ పెట్టుబడి అయిదు కోట్ల రూపాయలు మాత్రమే. 1954-55 లో ఈ శాఖ బడ్జెట్ 5.24 కోట్లు రూపాయలు.

1952-53 లో మొత్తం తొమ్మిది కోట్ల నలభై లక్షల విద్యుచ్ఛక్తి

తయారయింది. ఇందులో నూటికి 18 వంతులు మైసూరు రాష్ట్రంనుంచి కొన్నారు.

ఆంధ్ర రాష్ట్రంలో ప్రభుత్వయాజమాన్యంలో ప్రస్తుతంఏడుథర్మల్ స్కీములు వున్నాయి.

రాష్ట్రంలోని థర్మల్ స్కీములు ఏమిటంటే: విశాఖపట్టణం, విజయవాడ, కాకినాడ, కర్నూలు, కడప, నెల్లూరు, అనంతపురం. ఈస్కీములలో ఉత్పత్తిచేయబడ్డ విద్యుచ్ఛక్తి వివరాలు క్రింద ఇవ్వబడినవి.

క్రింది అంకెలు K W. H, పది లక్షల యూనిటు

| స్కీము. | 1948-49 | 1949-50 | 1952-53 |
|---|---|---|---|
| విశాఖ పట్టణం . | 10.68 | 12.08 | 19.216 |
| విజయవాడ : | 17.30 | 18.80 | 47.717 |
| కాకినాడ : | 1.89 | 2.53 | 0.612 |
| కర్నూలు : | 0.56 | 0.65 | 1.256 |
| కడప : | 0.13 | 0.47 | 0.895 |
| అనంతపురం | | 0.18 | 0.6·7 |
| నెల్లూరు : (1950 అక్టోబరు 2 న ప్రారంభంపబడింది) | | | 4.736 |

# రాష్ట్రప్రభుత్వ ఆదాయ వ్యయాలు

ఆంధ్రరాష్ట్రానికి 1954-55 బడ్జెటును 1954 మార్చి 5 తేదిన శాసన సభలో, ఆర్థిక మంత్రి తెన్నేటి విశ్వనాథంగారు ప్రవేశపెట్టారు. ఆబడ్జెటును బట్టి 1954-55 లో రాష్ట్ర ప్రభుత్వానికి రు. 21.02,81,000 ఆదాయం వస్తుందనీ, రు. 24,01,99,000 ఖర్చు అవుతుందనీ, రు. 2,99,18,000 లోటు ఏర్పడుతుందనీ అంచనా వేయబడింది.

# విద్య

ఆంధ్రరాష్ట్రావతరణ నాటికి, ఆంధ్రరాష్ట్రంలో వున్న విద్యా సంస్థల వివరాలు ప్రక్క పేజీలలో ఇవ్వబడినవి.

ఆంధ్ర విశ్వకళా పరిషత్తుకు అనుబంధములుగా వున్న కాలేజీలు : 25

మదరాసు యూనివర్సిటీకి అనుబంధములుగా వున్న కాలేజీలు : 6

రాష్ట్రంలో మొత్తం 652 హైస్కూళ్లు వున్నాయి. వానిలో చదువుతున్న విద్యార్థుల సంఖ్య: 2,18,380 బాలురు, 34,921 బాలికలు.

ఈ స్కూళ్లలో గవర్నమెంటు నడిపేవి, 32; జిల్లా బోర్డులు, మునిసిపాలిటీలు నడిపేవి, 512; ప్రభుత్వ సహాయంతో నడిచేవి, 118.

ఆంధ్ర రాష్ట్రంలోవున్న ఎలిమెంటరీ స్కూళ్ల సంఖ్య. 17,441. వీటిలో 730 హాయ్యర్ ఎలిమెంటరీస్కూళ్లు. ఈ ఎలిమెంటరీస్కూళ్లలో చదువుతున్న విద్యార్థుల సంఖ్య, 9,64,925 బాలురు, 5,97,808 బాలికలు.

ఆంధ్రరాష్ట్రంలో మొత్తం 320 బేసిక్ స్కూళ్లు వున్నాయి. వీనిలో 17, సీనియర్ బేసిక్ స్కూళ్లు. ఈ స్కూళ్లలో చదువుతున్న విద్యార్థుల సంఖ్య, 19,875 బాలురు, 11,950 బాలికలు.

ఉపాధ్యాయులకు ట్రెయినింగు ఇచ్చే స్కూళ్లు; పురుషులకు 30, స్త్రీలకు 26 వున్నాయి. వీటిలో చదువు తున్న వారిసంఖ్య, 5,216 పురుషులు ; 2,991 స్త్రీలు.

ఇవిగాక, బేసిక్ ట్రెయినింగు స్కూళ్లు పురుషులకు 16, స్త్రీలకు ఒకటి వున్నాయి. వీటిలో ట్రెయినింగు పొందుతున్నవారి సంఖ్య, పురుషులు, 2,119 ; స్త్రీలు, 192.

రాష్ట్రంలో మొత్తం 437 లేబరు స్కూళ్లు ప్రత్యేకం హారిజనుల కోసం స్థాపించినవి వున్నాయి. వీనిలో ఒకటి హైస్కూలు, మరొకటి మిడిల్ స్కూలు. తక్కినవి ప్రైమరీ స్కూళ్లు.

## ట్రెయినింగు స్కూళ్లు.

ఆంధ్రరాష్ట్రంలో మొత్తం 55 ట్రెయినింగు స్కూళ్లు వున్నాయి. వీనిలో 29 పురుషులకు, 26 స్త్రీలకు. రాష్ట్రంలో మొత్తం 17 బేసిక్

ట్రెయినింగు స్కూళ్లు వున్నాయి. వీనిలో 16 పురుషులకు, ఒకటి స్త్రీలకు.

ఆంధ్రయూనివర్శిటీ అధ్వర్యాన నడుపబడుతున్న కాలేజీల వివరాలివి :

ఆర్ట్సు కాలేజిలు, 25; (1) మిసెస్ ఏ. వి. యన్. కాలేజి, విశాఖపట్టణం; (2) మహారాజా కాలేజి, విజయనగరం; (3) ఆంధ్ర యూనివర్శిటీ కాలేజ్ ఆఫ్ ఆర్ట్సు, వాల్తేరు; (4) ఆంధ్ర యూనివర్శిటి కాలేజ్ ఆఫ్ సైన్సెస్, వాల్తేరు (5) ఆంధ్రయూనివర్శిటి ఎర్స్కిన్ కాలేజిఆఫ్ నాచురల్ సైన్సు, వాల్తేరు; (6) పి. ఆర్. కాలేజి, కాకినాడ; (7) గవర్నమెంట్ ఆర్ట్సుకాలేజి, రాజమండ్రి, (8) భీమవరం కాలేజి, భీమవరం; (9) సి. ఆర్. రెడ్డి కాలేజి, ఏలూరు; (10) హిందూ కాలేజి, మచిలీపట్టణం; (11) ఎస్. ఆర్. ఆర్. కాలేజి, విజయవాడ; (12) ఆంధ్రక్రిస్టియన్ కాలేజి, గుంటూరు; (13) హిందూ కాలేజి, గుంటూరు; (14) వి. ఆర్. కాలేజి, నెల్లూరు; (15) నరసాపూర్ కాలేజి, నరసాపూర్. (16) ఆంధ్రజాతీయ కళాశాల, మచిలీపట్టణం; (17) ఎస్. ఎన్. కాలేజి, నరసారావుపేట; (18) గుడివాడ కాలేజి, గుడివాడ. (19) ఆర్ట్సుకాలేజి (స్త్రీలకుమాత్రం) గవర్నమెంట్ కాలేజి ఫర్ వుమెన్; గుంటూరు. (20) గవర్నమెంట్ ఆర్ట్సుకాలేజి, శ్రీకాకుళం; (21) ఎస్. కె. బి. ఆర్. కాలేజి, అమలాపురం; (22) తెనాలికాలేజి, తెనాలి, (23) వి. ఆర్. ఎస్. కాలేజి, చీరాల, (24) పి. బి. కాలేజి, నిడుబ్రోలు; (25) కావలికాలేజి, కావలి.

వృత్తి విద్యల కాలేజిలు. 10 . (1) గవర్నమెంట్ ట్రెయినింగ్ కాలేజి, రాజమండ్రి; (2) ఇంజనీరింగ్ కాలేజీ, కాకినాడ; (3) ...డికల్ కాలేజి, విశాఖపట్టణం; (4) మెడికల్ కాలేజి, గుంటూరు; ... వ్యవసాయ కాలేజి, బాపట్ల, (6) ఆంధ్ర యూనివర్సిటీ లా ...జి, వాల్తేరు; (7) ఆంధ్రయూనివర్సిటీకాలేజ్ ఆఫ్ టెక్నా... సంస్థల వాల్తేర్. (8) వృత్తి విద్యల కాలేజి (స్త్రీలకుమాత్రం); సెంట్

జోసెఫ్స్ ట్రెయినింగ్ కాలేజి, గుంటూరు; (9) ఎం. ఆర్. కాలేజి, విజయనగరం; (10) ఆంధ్ర క్రిస్టియన్ కాలేజి, గుంటూరు.

ప్రాచ్యవిద్యల కాలేజిలు, 9: (1) శారదానికేతనం, గుంటూరు. (2) ఎస్. వి. జె. వి. సంస్కృత కాలేజి, కొవ్వూర్, (3) నరసింహ సంస్కృత కాలేజి, చిట్టిగూడూరు, మచిలీపట్నం, (4) సంస్కృత కాలేజి, నెల్లూరు, (5) ఆంధ్రమహిళా సంస్కృత కాలేజి, విజయనగరం. (6) కోటలక్ష్మయ్య నాయుడు సంస్కృత కాలేజి, తెనాలి. (7) మహారాజా సంస్కృత కాలేజి, విజయనగరం. (8) శ్రీభావనారాయణస్వామి సంస్కృత కాలేజి, పొన్నూరు; (9) మహారాజా సంగీత కాలేజి, విజయనగరం.

ప్రస్తుతం అనంతపురం, బళ్ళారి, కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాలు, ఆంధ్ర యూనివర్శిటీలో చేరకుండా, మద్రాసు యూనివర్శిటిలోనే వున్నాయి.

ఈ రాయలసీమ జిల్లాలలో వున్న కాలేజి లివి:

ఆర్ట్సు కాలేజిలు, 5: (1) తియొసాఫికల్ కాలేజి, మదనపల్లి; (2) గవర్నమెంట్ ఆర్ట్సు కాలేజి, అనంతపురం; (3) వెంకటేశ్వర కాలేజి. తిరుపతి; (4) ఉస్మానియా కాలేజి, కర్నూలు; (5) గవర్నమెంట్ ఆర్ట్సుకాలేజి, కడప.

వృత్తివిద్య కాలేజి. ఇంజనీరింగ్ కాలేజి, అనంతపురం.

## మెడికల్ కాలేజీలు

మనరాష్ట్రంలో ప్రస్తుతం రెండు మెడికల్ కాలేజిలు వున్నాయి. అవి: ఆంధ్ర మెడికల్ కాలేజి (విశాఖపట్టణం), గుంటూరు మెడికల్ కాలేజి.

## ఇంజనీరింగ్ కాలేజిలు

రాష్ట్రంలో ప్రభుత్వ యాజమాన్యంలోవున్న ఇంజనీరింగ్ కాలేజిలు 2: అవి, అనంతపూర్, కాకినాడలో వున్నాయి.

## వ్యవసాయశాఖ కాలేజి

మన రాష్ట్రంలో ప్రస్తుతం ఒక వ్యవసాయ కళాశాల బాపట్లలో వుంది. ఈ కాలేజిలో ఏడాదికి 80 మంది విద్యార్థులు చేర్చుకొనబడుతారు.

## ఎస్. ఎస్. ఎల్. సి.

ఆంధ్ర యూనివర్శిటీ జిలాలలో, 1944 నుంచి 1953 వరకు స్కూలు పైనలు పరీక్షలకు ఎంతమంది విద్యార్థులు హాజరైనదీ, యెంతమంది ప్యాసయినదీ, యీ క్రింది అంకెలనుబట్టి తెలుసుకోవచ్చును.

| సంవత్సరం | పరీక్షకు కూర్చున్నవారు | ప్యాసయినవారు |
|---|---|---|
| 1944 | 8,777 | 3,500 |
| 1945 | 8,703 | 3,836 |
| 1946 | 8,771 | 3,908 |
| 1947 | 11,103 | 5,034 |
| 1948 | 14,133 | 7,331 |
| 1949 మార్చి | 12,644 | 5,612 |
| అక్టోబర్ | 2,034 | 557 |
| 1950 మార్చి | 17,719 | 5,871 |
| 1951 మార్చి | 18,580 | 8,017 |
| 1952 అక్టోబర్ | 3,445 | 1,109 |
| 1953 మార్చి | 25,829 | 7,739 |

## ఆస్థాన కవులు

మదరాసు ప్రభుత్వం ప్రాంతీయభాషలను అభివృద్ధిపరచడానికి, వాటి గౌరవ హోదాలను విస్తృతపరచడానికి నిశ్చయించి ఆంధ్ర, తమిళ, మళయాళ, కన్నడ, సంస్కృత భాషలో ఆస్థానకవులను నియమించడానికి 1948 లో తీర్మానించుకున్నారు. అయిదు సంవత్సరాలు. ఈఆస్థానకవులకు ఏడాదికి వెయ్యిరూపాయలు గౌరవవేతనం ఇవ్వబడు

తుంది. ఆంధ్ర రాష్ట్రానికి ఆస్థానకవి: మహా మహోపాధ్యాయ కళా ప్రపూర్ణ శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రి.

తెలుగులో ఆస్థానకవిగా మొదట కళాప్రపూర్ణ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి నియమించబడినారు. వీరు 1950 ఫిబ్రవరి 15 న చనిపోగా, 1950 ఆగస్టు 6 న శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రిగారు ఎన్నుకోబడినారు.

## విజ్ఞానవ్యాప్తికి ప్రభుత్వ తోడ్పాటు

ప్రాంతీయభాషలలో వివిధ సమస్యలను గూర్చిన వాఙ్మయాన్ని అభివృద్ధిచేయడానికి మరొక విధానాన్ని ప్రభుత్వం తయారు చేసింది. వివిధ విషయాలమీద వ్రాయబడ్డ, ప్రకటించబడ్డ గ్రంథాలకు, యేయేట రు. 500 బహుమానాలిస్తారు. ప్రస్తుతం, దిగువ విషయాలనుగూర్చిన గ్రంథములకు బహుమతు లివ్వడానికి ప్రభుత్వం నిర్ణయించింది.

(1) పాటలు, పద్యాలు (2) గద్యరచన (కళ). జీవితచరిత్ర, యాత్ర (3) చిన్నకథ (4) నవల, నాటకము (5) పరిశోధన (భాష, చరిత్ర, పురాణవాఙ్మయం) (6) భౌతిక, రసాయనశాస్త్రాలు (7) ప్రకృతిశాస్త్రం, వ్యవసాయం (8) చరిత్ర, ఆర్థిక, రాజకీయ, సాంఘిక శాస్త్రాలు (9) గణిత, భూగోళశాస్త్రాలు. జ్యోతిశ్శాస్త్రం, ఇంజనీరింగు (10) బాలవాఙ్మయం (11) విద్యాపద్ధతులు, వేదాంత మానసిక తత్వశాస్త్రాలు (12) ఔషధ, పారిశుద్ధ్య శాస్త్రాలు.

ఈ విషయాలన్నిటిలోనూ వెలువడిన పుస్తకాలు అంతగా లేనందున ఏడాదికి ఆరు బహుమతులు మాత్రమే యిచ్చుటకు ఉద్దేశింపబడినది.

1949 లో యీక్రిందివాటికి బహుమతులు ఇవ్వబడినవి.

| | |
|---|---|
| పాటలు పద్యాలు : | శివభారతం |
| గద్యరచన, కళ : | (1) నవరస గంగాధరం |
| బహుమతి | కర్త : జమ్మలమడక మాధవరామశర్మ |

| | |
|---|---|
| ఇద్దరికి, పంచబడినది | (2) త్రిపురాంతకోదాహరణ |
| | కర్త: నిడదవోలు వెంకటరావు |
| బాలవాఙ్మయం: | (1) పిల్లల బొమ్మల భారతము |
| బహుమతి ఇద్దరికి | కర్త: మాగంటి బాపినీడు |
| పంచబడినది | (2) బాలానందం |
| | కర్త: డాక్టర్ గిడుగు వెంకటసీతాపతి |
| వ్యవసాయం: | వ్యవసాయశాస్త్రం |
| | కర్త: గోటేటి జోగిరాజు |
| చరిత్ర: | ఆంధ్రదేశ చరిత్ర సంగ్రహము |
| | కర్త: మల్లంపల్లి సోమశేఖరశర్మ |
| పారిశుధ్య శాస్త్రము: | గ్రామారోగ్య రక్షణము |
| | కర్త: డాక్టర్ గుళ్లపల్లి నారాయణమూర్తి |

1950 లో క్రింది వాటికి బహుమతులు ఇవ్వబడినవి.

| | |
|---|---|
| జీవిత చరిత్ర: | సరోజిని |
| | కర్త: జి. వి. సుబ్బారావు |
| నవల: | నారాయణభట్టు |
| | కర్త. నోరి నరసింహశాస్త్రి |
| మనశ్శాస్త్రము: | మనశ్శాస్త్రము |
| | కర్త జి. నారాయణమూర్తి |
| చిన్నకథ: | కాంతం |
| | కర్త: మునిమాణిక్యం నరసింహారావు |
| పరిశోధన: | తెలుగుభాష పుట్టుక, చరిత్ర |
| | కర్త: కోరాడ రామకృష్ణయ్య |
| భౌతిక శాస్త్రము | రమ్యహర్మ్యము |
| | కర్త: ఎన్. ఎం. వేణుగోపాలరావు నాయుడు |

1951 లో యీ క్రిందివాటికి బహుమతులు ఇవ్వబడినవి.

| | |
|---|---|
| నాటకము: | గౌతమబుద్ధ |
| | కర్త: కొండముది గోపాలరాయశర్మ |

జీవితచరిత్ర : (1) శ్రీ కృష్ణదేవరాయలు
కర్త : కె. రాఘవాచారి
(2) అక్కన్న-మాదన్న
కర్త : వేదం వెంకటరాయశాస్త్రి

విద్యుచ్ఛక్తి : విద్యుచ్ఛక్తి ఉపయోగాలు
కర్త : హరి ఆదిశేషువు

సహకారశాస్త్రం : సహకార ఆర్థికవిజ్ఞానము
కర్త : బి. పద్మరాజు

వైద్యశాస్త్రం : వనౌషధ విజ్ఞానం
కర్త : ఐ. వెంకటేశ్వరశర్మ

1952 లో ఈ క్రిందివాటికి బహుమతులు ఇవ్వబడినవి.

సంగీతము : కర్ణాటక సంగీత పరిణామం
కర్త : ఎం. వి. నరసింహాచార్యులు

సినిమా : చిత్రజగతి
కర్త . ఈ. వి. ఆచార్య

భాష, పరిశోధన : తెలుగు కవయిత్రులు
కర్త : శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మ

భౌతిక,రసాయనశాస్త్రాలు : వినియుక్త రసాయనశాస్త్రము
కర్త : హరి ఆదిశేషువు

1953 లో యీ క్రిందివాటికి బహుమతులు ఇవ్వబడినవి.

గీతములు : శతపత్రసుందరి
కర్త : బాలాంత్రపు రజనీకాంతరావు

తెలుగువాఙ్మయంలోని
హాస్యరచన : తెలుగు హాస్యము
కర్త : ఎం. సంగమేశం

పల్లెపాటల విమర్శ : జానపదగేయ విమర్శ
కర్త : హరిఆదిశేషువు

గృహనిర్వహణశాస్త్రం : గృహనిర్వహణశాస్త్రం

(ఇద్దరికిపంచబడినది) కర్తలు: కె. లీలావతి
జి. బాలాత్రిపురసుందరి

ఖగోళశాస్త్రం : ఖగోళశాస్త్రం
కర్త: కె. శేషగిరిరావు

# ఆంధ్ర విశ్వ కళాపరిషత్

స్థాపితము : 1926 ఏప్రిల్ 26

ఛాన్సెలర్ : శ్రీ సి. ఎం త్రివేది
ప్రొ-ఛాన్సెలర్ : బెజవాడ గోపాలరెడ్డి
వైస్-ఛాన్సెలర్ : డాక్టర్ వి. ఎస్. కృష్ణ
(జీతం : నెలకు రు. 2000)
రిజిస్ట్రార్ : శ్రీ కూర్మా వేణుగోపాలస్వామి
(జీతం రు. 750-50-2-1000)
లా సలహాదారు : శ్రీ లక్కరాజు సుబ్బారావు
తెలుగు వక్త : శ్రీ ఎం. ఆర్. అప్పారావుబహదూర్
ఇంగ్లీషువక్త : ప్రొఫెసర్ కె. ఆర్. శ్రీనివాసయ్యంగార్

## డిగ్రీలు : బోధనావిషయాలు

ఆంధ్ర విశ్వ కళాపరిషత్ అధ్వర్యాన, ఆంధ్రదేశంలోని కాలేజీలలోను, వాల్తేరులోవున్న యూనివర్శిటీకాలేజీలలోను భోధింబడి, పరీక్షలు జరిగే డిగ్రీల వివరాలు యీక్రింద ఇవ్వబడినవి.

### ఆర్ట్స :

1. బాచిలర్ ఆఫ్ ఆర్ట్స (బి. ఏ.) 2. బాచిలర్ ఆఫ్ ఆర్ట్స ఆనర్స (బి. ఏ. ఆనర్స). 3. మాస్టర్ ఆఫ్ ఆర్ట్స (ఎం. ఏ.) 4. మాస్టర్ ఆఫ్ ఆర్ట్స ఆనర్సు (ఎం. ఏ. ఆనర్స) 5. డాక్టర్ ఆఫ్ ఫిలాసఫీ (పి. హెచ్. డి.) 6 డాక్టర్ ఆఫ్ లెటర్స (డి. లిట్.)

సైన్స్ :

1. బాచిలర్ ఆఫ్ సైన్సు (బి. ఎస్. సి) 2. బాచిలర్ ఆఫ్ సైన్సు ఆనర్స్ (బి. ఎస్. సి. ఆనర్స్), 3. మాస్టర్ ఆఫ్ సైన్సు (ఎం. ఎస్. సి.) 4. మాస్టర్ ఆఫ్ సైన్సు ఆనర్స్ (ఎం. ఎస్. సి. ఆనర్స్) 5. డాక్టర్ ఆఫ్ సైన్సు (డి. ఎస్. సి.)

కామెర్సు :

1. బాచిలర్ ఆఫ్ కామెర్స్ (బి. కాం.) 2. బాచిలర్ ఆఫ్ కామెర్సు ఆనర్స్ (బి. కాం. ఆనర్స్) 3. మాస్టర్ ఆఫ్ కామెర్స్ (ఎం. కాం.) 4. మాస్టర్ ఆఫ్ కామెర్సు ఆనర్స్ (ఎం. కాం. ఆనర్స్).

వ్యవసాయశాస్త్రం :

1. బాచిలర్ ఆఫ్ సైన్సు అగ్రికల్చరల్ (బి. ఎస్. ,సి. ఎజి.) 2. మాస్టర్ ఆఫ్ సైన్సు అగ్రికల్చరల్ (ఎం. ఎస్. సి. ఎజి.)

విద్యాబోధకశాస్త్రం :

1. బాచిలర్ ఆఫ్ ఎడ్యుకేషన్ (బి. ఇడి), 2. మాస్టరు ఆఫ్ ఎడ్యుకేషన్ (ఎం. ఇడి)

వైద్యశాస్త్రం :

బాచిలర్ ఆఫ్ మెడిసన్ అండ్ సర్జరీ (ఎం. బి. బి. ఎస్.) 2. డాక్టర్ ఆఫ్ సైన్సు (డి. ఎస్. సి.) 3. డాక్టర్ ఆఫ్ మెడిసన్ (ఎ. డి.) 4. మాస్టర్ ఆఫ్ సర్జరీ (ఎం. ఎస్.) 5. మెడిసిన్ సర్జరీలలో పోస్టు గ్రాడ్యుయేటు డిప్లమా.

న్యాయశాస్త్రం :

బాచిలర్ ఆఫ్ లాస్ (బి.ఎల్.) 2. మాస్టరు ఆఫ్ లాస్ (ఎం.ఎల్.) 3. డాక్టరు ఆఫ్ లాస్ (డి.ఎల్.)

ఆయుర్వేదశాస్త్రం

1. బాచిలర్ ఆఫ్ ఆయుర్వేద (బి.ఎ.వి.)

ఇంజనీరింగ్ శాస్త్రం

బాచిలర్ ఆఫ్ ఇంజనీరింగ్ (బి.ఇ.)

ప్రాచ్యభాషలు

1. విద్యాప్రవీణ; 2. భాషాప్రవీణ; 3. ఆలీమ్-ఇ-ఫజల్; 4. మున్షి-ఇ-ఫజల్; 5. ప్రాచ్య భాషా వేతృత్వపట్టం (పి. ఒ. ఎల్.) 6. ప్రాచ్య భాషా కోవిద పట్టం (ఎం. ఒ. ఎల్.)

పరీక్షలు జరిపి, ఉత్తీర్ణులైనవారికి యిచ్చే పైపట్టములు కాక, 'కళా ప్రపూర్ణ' అనే గౌరవపట్టము, డి, లిట్; డి. ఎస్. సి; ఎల్. ఎల్. డి. అనే గౌరవపట్టములు కూడా, అర్హులని తోచిన వారికి ఇవ్వబడుతవి.

కాలేజిలు :

ఆంధ్రాయూనివర్శిటి అధ్వర్యాన నడుపబడుతున్న కాలేజిలు 32. వీటిలో యూనివర్శిటీ కాలేజిలు, 4; వృత్తి విద్యకాలేజిలు, 6; ఫస్టుగ్రేడు కాలేజి, 10; సెకండ్ గ్రేడు (ఇంటరు తరగతులు మాత్రం) కాలేజీలు, 6; ప్రాచ్యవిద్యల కాలేజిలు 9:

## శ్రీ వేంకటేశ్వర విశ్వ కళాపరిషత్

1954 జూలైనుంచి, తిరుపతిలో శ్రీ వేంకటేశ్వర విశ్వకళా పరిషత్ అను పేరుతో, రాయల సీమకు ఒకవిశ్వకళాపరిషత్తును స్థాపించడానికి ఆంధ్రప్రభుత్వం 1954 జనవరి 15 తేదిన నిశ్చయించింది.

# గ్రామాభివృద్ధి

గాంధిమహాత్ముని ఆశయాన్ననుసరించి గ్రామాలనుస్వయంపోషకములుగానూ, ప్రజానివాసానికి ఆకర్షవంతములుగానూ చేయడానికి ఫిర్కా అభివృద్ధి కార్యక్రమాన్ని మద్రాసు ప్రభుత్వం 1946 అక్టో

బరులో ప్రారంభించారు. ఈ కార్యక్రమం అమలులోకి తేవడంలో ప్రభుత్వపు ఆశయాలు ఏమిటంటే : ప్రతిగ్రామము దానికి అవసరమైన ఆహార ధాన్యాలనూ, ప్రత్తినీ పండించడం; ప్రతి గ్రామానికీ, దానిలోని పశువులు మెయ్యడానికి తగిన వసతిగల బంజరు వుండాలి; ప్రతి గ్రామంలోనూ స్కూలు, నాటకశాల, ఉపన్యాస మందిరము, మంచినీటి వసతి వుండాలి. ప్రతి గ్రామము, మిగతా గ్రామాలతో సంబంధం కలిగివుండేటట్లుగా, మంచిరోడ్లవసతి వుండాలి. ప్రతి గ్రామంలోను పిల్లలు ఆడుకోవడానికీ, పెద్దలు పొద్దుపుచ్చడానికీ, కేళీ విహార స్థానాలు వుండాలి. గ్రామాలనుంచి ప్రజలు పట్టణాలలో నివాసానికి వెళ్ళిపోతుండా, జీవిత సౌకర్యాలు గ్రామాలలో వుండాలి.

ఈ కార్యక్రమాన్ని రాష్ట్రమంతటా ఒకేసారి ప్రవేశపెట్టడం వల్ల కార్యభారం ఎక్కువవుతుందని, రాష్ట్రంలోని 34 ఫిర్కాలను మాత్రమే, సుమారు 1,000 గ్రామాలు గలవానిని, మొదట ఎన్నుకొని, ఆ ఫిర్కాలోని గ్రామాలలో యీ కార్యక్రమాన్ని ప్రభుత్వం అమలులోకి తెచ్చింది. తరువాత, 1950 ఏప్రిల్ 1 తేదిన మరొక 50 ఫిర్కాలలో 1,394 గ్రామాలుగల వానిలో, యీ కార్యక్రమం ప్రారంభించబడింది. ఈ కొత్త ఫిర్కాలు, అంతకు పూర్వం వున్న వాటితో కలుపబడినవి.

ఈ కార్యక్రమాన్ని సాగించడానికి కేంద్ర ప్రభుత్వంకూడా ధన సహాయం చేస్తున్నది. 1947-48 లో యీ కార్యక్రమానికి అయిన ఖర్చునంతనూ కేంద్రప్రభుత్వమే భరించింది: 1948-49 లోనూ 1949-50 లోనూ అయిన ఖర్చులలో సగాన్ని భరించింది.

1951 అంతానికి ఆంధ్ర జిల్లాలలో యీ కార్యక్రమం సాగుతూన్న ఫిర్కాలు ఇవి.

అనంతపురంజిల్లా. 3. హిందూపూర్, పరిగి, మడకశిర.

కడపజిల్లా. 3. ప్రొద్దుటూర్, చేపాడు, అర్కాటవేముల.

కర్నూలుజిల్లా. 2. కర్నూలు, యర్రగొండపాలెం.

కృష్ణాజిల్లా: 3. తిరువూర్, విస్సన్నపేట, నూజివీడు,
గుంటూరుజిల్లా. 4. ఒంగోలు, గురవారెడ్డిపాలెం, అమ్మనబ్రోలు, దొడ్డవరం
చిత్తూరుజిల్లా. 3. నగరి, నారాయణవరం, ఆరుంగొలెం.
తూర్పుగోదావరిజిల్లా. 3. రాజమండ్రి, బూరుగుపూడి, రఘుదేవపురం,
నెల్లూరుజిల్లా. 3. కణుపూర్, సర్వేపల్లి: పొదలకూర్.
పడమటిగోదావరిజిల్లా. 2. దెందులూర్, పోలవరం.
బళ్ళారిజిల్లా. 3. ఆలూరు, చిప్పగిరి, హోలుగుంది.
విశాఖపట్టణంజిల్లా. 3. పెందుర్తి, కోటకట్ల, మాడుగుల,
శ్రీకాకుళంజిల్లా. 3. గార, శ్రీకాకుళం. ఆముదాలవలస.

# జాతీయ వికాస కార్యక్రమం

గ్రామాభ్యుదయానికి దేశమంతటా కమ్యూనిటీ ప్రాజెక్టులు, జాతీయవికాస కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. గ్రామాలలోని ప్రజల సహకారంతో, గ్రామజీవితంలో ఆర్థికంగా, సాంఘికంగా క్రమానుగతమైన మార్పు తీసుకురావడమే యీ కార్యక్రమాల ఉద్దేశం. వ్యవసాయాభివృద్ధి రవాణా సౌకర్యాలు, విద్య, ఆరోగ్యం, గృహనిర్మాణం, గ్రామీణ పరిశ్రమలు, సహకారోద్యమం, వీటిని పెంపొందించడానికే యీ కార్యక్రమాలు ప్రారంభించబడినవి. వ్యవసాయాభివృద్ధి కార్యక్రమంలో బంజరు భూముల సాగు, మైనర్ ఇరిగేషన్ స్కీములు, కొత్తపద్ధతులలో సేద్యం; మేలు రకపు విత్తనాల ఉపయోగం, రసాయనపు ఎరువులు పచ్చిఎరువుల వాడకము; పశుసంపదను ఎక్కువ చేయడం మొదలైన కృషి చేర్చబడింది.

ఒకొక్క కమ్యూనిటీ ప్రాజెక్టు మూడు బ్లాకులక్రింద విభజించబడుతుంది. ఒకొక్క బ్లాకులో 100 గ్రామాలు వుంటాయి. అయిదేసి గ్రామాలు ఒక గ్రూపుగా ఏర్పాటు చేయబడి, 20 గ్రూపులు ఒకబ్లాకుగా వుంటాయి. ఒకొక్క గ్రూపు ఒక కార్యకర్త అధీనంలో

వుంటుంది. ఒకొక్క బ్లాకు, ఒక బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసరు అధీనంలో వుంటుంది. ఒక ప్రాజెక్టు ఒక ఎగ్జిక్యూటివ్ ఆఫీసరు పర్యవేక్షణలో వుంటుంది.

ఆంధ్రరాష్ట్రంలో రెండు కమ్యూనిటీ ప్రాజెక్టులు 1952 అక్టోబరు 2 తేదిన ప్రారంభించ బడినవి. వీటిలో ఒకటి తూర్పుగోదావరి జిల్లాలోని కాకినాడ పెద్దాపురం తాలూకాలకు కలిపి, సామర్లకోట ప్రధాన కేంద్రంగా ఏర్పాటు చేయబడినది.

రెండవది కర్నూలు జిల్లాలోని కర్నూలు-కడప కాలువ ప్రాంతానికి, నంద్యాల ప్రధాన కేంద్రంగా ఏర్పాటు చేయబడింది.

జయ సంవత్సరాదినాడు; అంటే, 1954 ఏప్రిల్ 4 తేదిన శ్రీకాకుళం జిల్లాలోని ఇచ్ఛాపురం తాలూకాకు ఒక డెవలప్‌మెంట్ బ్లాకు, చిత్తూరు జిల్లాలోని వాయల్పాడు తాలూకాకు ఒక డెవలప్‌మెంటు బ్లాకు ఏర్పాటు చేయబడినవి.

## జాతీయవికాస కేంద్రాలు

కమ్యూనిటీ ప్రాజెక్టులలో జరిగే పనికంటె కొంచెం తక్కువ ఉధృతిలో, చిన్న చిన్న ప్రాంతాలలో ప్రజా సహకారంతో, గ్రామీణాభ్యుదయాన్ని పెంపొందించడానికి జాతీయవికాస కేంద్రాలు ఏర్పాటు చేయబడినవి. ఈ కేంద్రాలలో కొంతకాలం పనిజరిగిన తరువాత, వీటిని ప్రాజెక్టుల క్రింద మార్చడానికి సులువుగా వుంటుంది.

ఇలా పని జరిగే ఒకొక్క బ్లాకులో దాదాపు నూరు గ్రామాలు (రెండు ఫిర్కాలు) వుంటాయి. ఇచ్చట అమలుజరుపబడే అభివృద్ధి కార్యక్రమాలకు అయ్యేఖర్చులో సగాన్ని ధనరూపంలోగాని, కాయకష్టరూపంలోగాని ఆ ప్రాంతంలోని ప్రజలు భరించాలి.

జాతీయ వికాస కార్యక్రమంక్రింద, ఆంధ్రరాష్ట్రంలో 22 బ్లాకులలో 1954 ఏప్రిల్ 4 తేదిన పని ప్రారంభమైంది. ఆబ్లాకులు ఇవి.

| జిల్లా | తాలూకా | బ్లాకు |
|---|---|---|
| శ్రీకాకుళం | | 1. గార, శ్రీకాకుళం ఫిర్కాలు |
| | శ్రీకాకుళం | 2. ఆమదాల వలస, నగరి కటకం |
| విశాఖపట్టం | గోలుకొండ | 1, కోటఉరట్ల, జల్లూరు |
| | విశాఖపట్టం | 2. పెందుర్తి, మధురవాడ రివిన్యూ ఫిర్కా |
| | యలమంచిలి | 3. నక్కతల్లి |
| తూర్పుగోదావరి | రాజమండ్రి | 1. రాజనగరం |
| | | 2. రఘుదేవపురం, బురుగుపూడి, గోకవరం |
| పశ్చిమ గోదావరి | ఏలూరు | 1. దెందులూరు, భీమడోలు |
| | చింతలపూడి | 2. కామవరపు కోట, ధర్మరాజగూడెం, చింతలపూడి |
| కృష్ణ | తిరువూర్ | 1. తిరువూరు, విస్సన్న పేట |
| | నూజవీడు | 2. నూజవీడు, మునునూరు |
| గుంటూరు | ఒంగోలు | 1. సంతనూతలపాడు, దొడ్డవరం |
| | | 2. ఒంగోలు, అమ్మనబ్రోలు, దుద్దుకూరు |
| నెల్లూరు | నెల్లూరు | 1. కనుపూరు, సర్వేపల్లి |
| | రాపూరు | 2. పొడకలూరు, చిత్తలూరు |
| చిత్తూరు | పుత్తూరు | 1. నగరి, నారాయణవనం |
| | తిరుత్తణి | 2. అరుగొలను, పల్లిపుత్తూరు |
| కర్నూలు | మార్కాపురం | 1. యర్రగొండపాలెం, త్రిపురాంతకం, దోర్నల్, దూపాడు |
| | ఆలూరు | 2. ఆలూరు, చిప్పగిరి, హోళగుంది, పెద్దహోతూరు. |
| అనంతపురం | హిందూపూర్ | 1. హిందూపూర్, పరిగి |
| | | 2. మడకశిర వగైరా |
| కడప | జమ్మలమడుగు | 1. తలమంచిపట్టం, వగైరా ప్రాంతాలు |

# హరిజనోద్ధారణ

మదరాసు రాష్ట్రంలోని జనాభాలో నూటికి 16.2 వంతులు అంటే దాదాపు 80 లక్షలమంది హరిజనులు. సాంఘికంగా ఆర్థికంగా విద్యా విషయంలో, అత్యంత అధోస్థితిలోవున్న ప్రజలువీరే. అందుచేతనే గాంధిమహాత్ముడు వీరికి దేవుని బిడ్డలు అనే అర్థంలో హరిజనులు అని నామకరణం చేశాడు. ఇటీవల, యీకులాలవారికి ప్రత్యేక సౌకర్యాలు ఇవ్వడంతో వీరిలో చాలామంది యువకులు ప్రజ్ఞచూపి ముందుకు వస్తున్నారు. అయినా, ఇంకా కొంతకాలం వీరికి ప్రత్యేక సౌకర్యాలు ఇస్తేనేకాని; యీకులాలవారు బాగా ముందుకు రాలేరని గ్రహించి శాసన సభలలోను, గవర్నమెంటు ఉద్యోగాలలోను ఇంకొపదేళ్లు వీరికికొన్ని స్థానాలను ప్రత్యేకించడానికి ప్రభుత్వం నిశ్చయించారు. హరిజనోద్ధరణకు దేశంలోని అన్ని రాష్ట్రాలలోను ప్రత్యేక శ్రద్ధచూపబడుతున్నది.

# గ్రామీణ బ్రాడ్‌కాస్టింగ్

రేడియో ప్రోగ్రాములను గ్రామస్థులకు వినిపించడానికి గ్రామాలలో రేడియో సెట్లను ఏర్పాటు చేయించడానికి, వాటిని తనిఖీ చేయడానికీ, చెడిపోయినవాటిని బాగుచేయించడానికి యీ శాఖ ఏర్పాటు చేయబడినది.

1953 అక్టోబరు 1 నాటికి రాష్ట్రంలో మొత్తం 1,324 సెట్లుపని చేస్తున్నాయి.

మునిసిపాలిటీల అధీనంలోవున్న సెట్ల వివరాలివి : శ్రీకాకుళం 2; సాలూరు 2; అనకాపల్లి, 1; విశాఖపట్టణం, 2; కాకినాడ; 5; రాజమండ్రి, 4; అమలాపురం, 1; ఏలూరు, 2; భీమవరం, 4; పాలకొల్లు, 2; విజయవాడ, 9; గుడివాడ, 2; మచిలీపట్టణం, 2; చీరాల, 2; గుంటూరు, 3; బాపట్ల 1, నరసరావుపేట, 2; తెనాలి, 6; నెల్లూరు, 6; గూడూరు, 1; కడప, 2; ప్రొద్దటూరు, 2; కర్నూలు, 1;

నంద్యాల, 4; ఆదోని, 1; అనంతపురం; 3; గుంటకల్, 1: హిందూపురం; 3; తాడిపత్రి; 2; చిత్తూరు, 3; తిరుపతి, 2.

## రోడ్లు

రాష్ట్రంలోని రోడ్లు మూడు తరగతులుగా విభాగించబడినవి. 1. జాతీయరహదార్లు. వీటిపైఅధికారం కేంద్రప్రభుత్వానిది. 2. రాష్ట్రీయ రహదార్లు. వీటిపై అధికారం రాష్ట్రప్రభుత్వానిది. జిల్లాలలోని రోడ్లు చాలావరకు ఈ తరగతిలోకే వస్తాయి. 3. జిల్లాబోర్డు రోడ్లు: జిల్లాలలోని చిన్నరోడ్లు, గ్రామాలరోడ్లు.

జాతీయరహదార్లను బాగుచేసి, మంచిసితిలో వుంచినందుకు, ఏటా రాష్ట్రప్రభుత్వానికి కేంద్రప్రభుత్వం కొంత డబ్బును ఇస్తుంది.

1954 మార్చి 31 నాటికి రాష్ట్రంలోని మొత్తం రోడ్లు, 14,039 మైళ్ళు. ఈ రోడ్లలో, 151 మైళ్ళు సిమెంటు కాంక్రీటు వేసిన రోడ్లు.

గ్రామాలరోడ్లు, 5,224 మైళ్ళు.

రాష్ట్రంలో మొత్తం 1,846 బస్సులు ప్రయాణీకుల సౌకర్యార్థం ఏర్పాటయినవి వున్నాయి. ఈ బస్సులు మొత్తం 647 రూట్లలో తిరుగుతున్నాయి.

## రేవులు

ఆంధ్ర రాష్ట్రంలో 7 రేవులు వున్నాయి, వీటిలో ఒకటి విశాఖపట్టణం. పెద్ద రేవు ఇదే. కేంద్రప్రభుత్వం వారి నిర్వహణలోవుంది. తక్కిన ఆరు రేవులూ, చిన్న రేవులక్రింద పరిగణింప బడుతున్నాయి. అవేమిటంటే: విశాఖపట్టణంజిల్లాలో: బారువ, కళింగపట్నం, భీమునిపట్నం. తూర్పుగోదావరిజిల్లాలో. కాకినాడ. కృష్ణాజిల్లాలో: మచిలీపట్నం. గుంటూరుజిల్లాలో: వాడరేవు.

ఇవన్నీకూడా తీరవ్యాపారానికి అనుకూలంగా వున్నవే.

విశాఖపట్టణం :

విశాఖపట్టణం హార్బరు నిర్మాణానికి స్కీము ఈస్టిండియా కంపెనీ రోజులలోనే వేయబడినా, 1925 దాకా దానిని కార్యరూపం లోకి తెచ్చే ప్రయత్నం జరగలేదు. 1933 లో హార్బరు ఓడలు నిలవ డానికి తెరువబడింది. ఈ రేవు పరిపాలన కేంద్రప్రభుత్వంవారిచే నియ మింపబడిన ఎడ్మినిస్ట్రేటివ్ ఆఫీసరు సాగిస్తాడు.

కా కి నా డ :

రాష్ట్రంలోని చిన్న రేవులలో ప్రథమస్థానం కాకినాడరేవుది. పెద్ద పెద్ద ఓడలు రేవుకు ఆరు, ఏడు మైళ్ళ దూరములో సముద్రంలోనే నిలబడతాయి. ఒడ్డునుంచి చిన్నలాంచిలు ఓడలవద్దకువచ్చి సరకును ఎత్తడం; ఒడ్డుకు తీసుకురావడం మొదలైన పని చేస్తాయి. ఇక్కడ నుంచి విస్తారంగా ఎగుమతి అయే సరకులు, వేరుశనగ, ఆముదపు గింజలు, ఇవన్నీ యూరపుకే వెడతాయి. అమెరికానుంచి కిరసనా యిలూ, ఇంగ్లండునుంచి లోహాలూ ఇక్కడ దిగుమతి అవుతాయి. ఈ రేవును పెద్దరేవుగా అభివృద్ధి చెయ్యాలని ఇటీవల జరిగిన సూచనపై, కేంద్రప్రభుత్వమువారు నియమించిన కమిటీవారు విచారణ జరిపారు. కాని, దీనికి 80 మైళ్ళలో ఉత్తరాన విశాఖపట్టణమూ, 270 మైళ్ళలో దక్షిణాన మదరాసు వున్నందున, ఈ రేవును అభివృద్ధి పరచడం మంచిది కాదని, ఆ కమిటీవారు శిఫార్సుచేశారు. దానిని ప్రభుత్వం వారు ఆమోదించారు.

ఆంధ్రరాష్ట్రానికి మొత్తం 500 మైళ్ల తీరంవుంది. తీరప్రాంతం అంతటా కోస్తావ్యాపారం బాగా జరగాలంటే నాలుగైదు రేవులను అభివృద్ధిపరచడం అవసరం.

## ప రి శ్ర మ లు

నూలు మిల్లులు :

ఆంధ్రరాష్ట్రంలో బట్టలను నేసే మిల్లులులేవు. నూలు తయారు చేసే మిల్లులు 6 వున్నాయి. అవి వున్న స్థలం : ఆదోని, 2; గుంటూరు,

1; పందలపాక, 1; రాజమండ్రి, 1; గుంటకల్, 1; గుంటకల్‌లోని మిల్లు, చేనేతపనివారికి నూలు సప్లయిచేయడానికి సహకార పద్ధతిమీద ఆంధ్రరాష్ట్ర చేనేతసహకార సంఘ యాజమాన్యాన నడుపబడుతున్నది. ఈమిల్లులన్నిటిలోనూ మొత్తం 49,548 కదుళ్ళున్నవి. ఈమిల్లులన్నిటిలోనూ ఏడాదికి మొత్తం 43,35,000 పౌనుల నూలు తయారవుతుందని అంచనా. ఈనూలు అంతాకూడా చేనేతవారికే సప్లయి అవుతుందని అనుకోవచ్చును. ఈ మిల్లులన్నీకూడా 20 నెంబరు లోపు ముతకనూలు తయారు చేస్తున్నవి. ఒకపౌను నూలుకు మూడుగజాలు బట్టవస్తుందని లెక్క వేస్తే, ఈ మిల్లులలో తయారయే నూలుతో ఏడాదికి సుమారు 1,30,05,000 గజాల బట్ట తయారవుతుందని అనుకోవచ్చును.

రాష్ట్రంలోని ప్రజలందరికీ ఏడాదికి అధమం 40 కోట్ల గజాల బట్ట కావాలి. రాష్ట్రంలో బట్టలమిల్లు లేనందువల్ల, చేనేతబట్టకొరత ఎగుమతి అవుతున్నందువల్ల, అధమం 20 కోట్ల గజాల బట్టను మనం ఇతరప్రాంతాలనుంచి దిగుమతిచేసుకుంటున్నాము. అంటే, ఏడాదికి రు. 20 కోట్ల రూపాయలు బట్టకోసం మన రాష్ట్రంనుంచి బయటికి పోతున్నవి.

# చేనేత పరిశ్రమ

ఆంధ్రరాష్ట్రావతరణతో పాటు ప్రత్యేకంగా ఆంధ్రరాష్ట్ర చేనేత పారిశ్రామికుల సహకారసంఘము 14-9-53 న విజయవాడలో నెలకొల్పబడింది. దీనిలో మొత్తము 627 ప్రాథమిక చేనేత సహకార సంఘాలు పనిచేస్తున్నాయి. 5 వీవింగు ఫ్యాక్టరీలు, 3 డైయింగ్ ఫ్యాక్టరీలు, ఒక కలెక్టివు వీవింగుసెంటరు ఆంధ్రరాష్ట్రచేనేత సహకారసంసంఘం నిర్వహిస్తున్నది. మూలధనం రు. 2,71,836. మొత్తం 1,08,353 మగ్గాలు సహకారసంఘాలలో పనిచేస్తున్నాయి. ఆంధ్రదేశం ముఖ్యకేంద్రాలలో 57 విక్రయశాలలున్నాయి. హైదరాబాదు రాష్ట్రంలో మూడు విక్రయశాలలున్నాయి. సాలుకు రు. 1,50,000 విలువగల సహకార చేనేత వస్త్రం తయారవుతున్నది.

* * * *

దేశంలో వ్యవసాయం తర్వాత పెద్ద పరిశ్రమ చేనేత పరిశ్రమ. ఆంధ్రరాష్ట్రంలో చేనేత పరిశ్రమ ఒక విశిష్ట స్థానాన్ని ఆక్రమించింది. ప్రజలలో ప్రతి పన్నెండుగురిలో ఒక చేనేత పారిశ్రామికుడున్నాడు. మూడులక్షల మగ్గాలు ఈరాష్ట్రంలో పనిచేస్తున్నాయి. పదిహేనులక్షల మంది నిరుపేదలైన స్త్రీ పురుషులు ఈపరిశ్రమపై ఆధారపడిజీవిస్తున్నారు.

ఇతర పరిశ్రమలవలె ఏవ్యక్తికావ్యక్తిగా కాక, కుటుంబమంతా సమిష్టిగా నిర్వహించవలసిన పరిశ్రమ చేనేత పరిశ్రమ. ఒక మగ్గంపై వచ్చే ఆదాయం ఆ కుటుంబములోని సభ్యులందరి కృషిఫలితం. ఐనా ఒకవ్యక్తికి న్యాయంగా రావలసిన మజూరీసైతము ఒక మగ్గానికి గిట్టుబాటు కాకపోవటంచేత చేనేత పారిశ్రామికుల జీవితము దుర్భరమైపోయింది.

దేశంలో అన్ని రంగాలలోనూ నిరుద్యోగము విపరీతంగా పెరిగిపోతున్న ఈ తరుణంలో, ఈ రాష్ట్ర ప్రజలలో పదమూడవవంతుకు పనిచూప గల్గుతున్న ఇంత పెద్ద పరిశ్రమను పతనం కాకుండా సంరక్షించుకొన వలసిన బాధ్యత ప్రజలందరిపైవున్నది. ప్రజలందరి సానుభూతి సహకారములమీదనే ఈ పరిశ్రమ యొక్కయు, పారిశ్రామికుల యొక్కయు భవిష్యత్తు ఆధారపడి వున్నది.

**మగ్గములు :**

ఆంధ్రరాష్ట్రంలో మొత్తం, 3,05,920 చేనేత మగ్గములు ఉన్నాయి. వానిలో 1,08,353 మగ్గములుగల చేనేత పనివారు సహకార సంఘాలలో చేరారు. ఈ సహకార సంఘాల సంఖ్య మొత్తం, 627. ఈ మగ్గములన్నీ పనిచేసి, చేనేత పనివారికి ప్రతిరోజూ పని వుండాలంటే, ఏడాదికి 7,34,40,000 పౌనుల నూలు సప్లయికావాలి. కాని, ఆంధ్ర రాష్ట్రంలోని నూలు మిల్లులలో ఏడాదికి 43,30,000 పౌనుల నూలు మాత్రమే తయారవుతున్నది. ఇది అసలు కావలసిన దానిలో నూటికి 6 పాళ్ళు మాత్రమే. అందువల్ల ఇతర రాష్ట్రాలనుంచి ఎక్కువగా నూలు తెప్పించుకోవలసిన అవసరం ఏర్పడింది. మొత్తం

మీద, చేనేత పనివారు ఏడాదికి 20 కోట్ల గజాల బట్టను తయారు చేస్తున్నారు. అంటే దాదాపు 6,50,00,000 పౌనుల నూలును ఇతర రాష్ట్రాలనుంచి దిగుమతి చేసుకుంటున్నాము.

పంచదార ఫాక్టరీలు :

ఆంధ్ర రాష్ట్రంలో 1954 లో 8 పంచదార ఫాక్టరీలు ఉన్నాయి. ఇవి ఉన్న స్థలం : అనకాపల్లి, ఏటికొప్పాక, దార్లపూడి, సామర్లకోట, బొబ్బిలి, సీతానగరం, తణుకు, ఉయ్యూరు. ఈ ఫాక్టరీలన్నీ, రోజుకు 5,275 టన్నుల చెరకును పిండి, రసమును తియ్యగలవు. ఈ ఎనిమిది ఫాక్టరీలలోను 1952-53 లో మొత్తం 41,310 టన్నుల పంచదార తయారు చెయ్యబడింది.

మదరాసు రాష్ట్రంలో చెరకు పంట వేసిన పొలాలలో సగటున ఒక ఎకరానికి 25 టన్నుల చెరకు పండుతుందని అంచనా. ఉత్తర ఇండియాలో ఎకరానికి 15 టన్నులు మాత్రమే పండుతుంది.

సిమెంటు :

ఆంధ్ర రాష్ట్రంలో రెండు సిమెంటు ఫాక్టరీలు ఉన్నాయి. అవి : ఎ. సి. సి., తాడేపల్లి, ఆంధ్ర సిమెంటు కంపెనీ (విజయవాడ); వీనిలో రోజుకి మొత్తం 300 టన్నుల సిమెంటు తయారు చెయ్యవచ్చును.

గాజు పరిశ్రమ :

1949-50 లో మదరాసు రాష్ట్రంలో, అంతకు పూర్వం వున్న ఏడు కాక, కొత్తగా మరొక గాజు ఫాక్టరీ స్థాపించబడినవి. కృష్ణా జిల్లాలో, చిలకలపూడిలో స్థాపించబడిన ఫాక్టరీ కంటి జోళ్ళకు కావలసిన అద్దములు తయారు చేస్తున్నది. ఇలాటి ఫాక్టరీ, దక్షిణ ఇండియాలో మరొకటి లేదు.

పింగాణీ పరిశ్రమ :

1948 అక్టోబరు 12 న గూడూరులో ప్రభుత్వం పింగాణీ ఫాక్టరీని స్థాపించింది. దీని నిర్మాణానికి రు. 11,60,000 అయింది. ప్రస్తుతం ఇక్కడ, భోజనం చెయ్యడానికి పనికివచ్చే పింగాణీ పాత్రలు తయారు చెయ్యబడుతున్నవి.

కాగితము :

ఆంధ్ర రాష్ట్రంలో ఒకే ఒక కాగితాల మిల్లు వుంది. అది రాజమండ్రిలోని ఆంధ్ర పేపర్ మిల్స్. దీనిని ప్రైవేటు వ్యక్తులనుంచి రాష్ట్రప్రభుత్వంవారు రు. 25 లక్షలకు కొని, తామే నడుపుతున్నారు. ఈ మిల్లు 1950-51 లో 2,014 టన్నుల కాగితమును ఉత్పత్తి చేసింది. ఈ మిల్లు 1950-51 లో రు. 1,20,606 ; 1951-52 లో 1,78,610 రూపాయలు నికరాదాయాన్ని సంపాదించింది.

వనస్పతి నూనె :

వనస్పతి నూనె తయారుచేసే ఫాక్టరీలు ఆంధ్రరాష్ట్రంలో నాలుగువున్నాయి. ఈ మూడిటిలోను కలిపి రోజుకు 70 టన్నుల నూనె తయారుచేయబడుతున్నది. అవి వున్నస్థానాలు : తాడేపల్లి, చిత్తూరు, కర్నూలు, బొబ్బిలి.

అభ్రకము :

1949-50 లో మదరాసు రాష్ట్రంలో 3,443 టన్నుల అభ్రకము ఉత్పత్తిచేయబడింది. దీనిలో 3,379 టన్నులు నెల్లూరు జిల్లాలోను, 64 టన్నులు నీలగిరి జిల్లాలోను త్రవ్వబడింది. రు. 25,88,496 విలువగల అభ్రకపు గడ్డలు, రు. 1 21,25,432 విలువగల అభ్రకపు తుంపులు, యీరాష్ట్రంనుంచి ఎగుమతి చేయబడినవి.

సినిమా :

1939 లో రెండవ ప్రపంచయుద్ధం రాకపూర్వం సినిమాపరిశ్రమ చాలా గందరగోళంగా వుండేది. సమర్థులతోపాటు, అసమర్థులుకూడా ఈ పరిశ్రమలో ప్రవేశించి పరిశ్రమనడకను పాడు చెయ్యడమే కాక, తాముకూడా విశేషించి నష్టపడ్డారు. యుద్ధంవచ్చిన తరువాత, రాఫిలిం ధర పెరగడమూ, కంట్రోలు ఏర్పడడమూ వీటన్నిటివల్లా తోచిన వారంతా ఈ పరిశ్రమలో దిగడానికి వీలులేకపోయింది. పైగా. సరిగా పరిశ్రమ నిర్వహించలేని వారు బయటికి జారారు. యుద్ధకాలంలో

తట్టుకుని నిలబడ్డకంపెనీలు చాలాకొద్ది. యుద్ధం అయిపోయిన తరువాత కంట్రోలు పోగానే, మళ్ళీ ఫిలిం కంపెనీలు చాలా నెలకొన్నాయి: తెలుగువారి యాజమాన్యాన ప్రస్తుతం నాలుగు స్టూడియోలు మదరాసులో వున్నాయి. వానిలో వాహినీపిక్చర్సువారి స్టూడియో ఆరు సంవత్సరముల పూర్వం ఆధునిక యంత్రములతో స్థాపింపబడినది.

ఇప్పటివరకూ, దెబ్బతినకుండా నిలిచి ఫిలింనిర్మాణాన్ని సాగిస్తున్న తెలుగుఫిలిం కంపెనీలలో ముఖ్యమైనవాటి వివరాలు ఇవి :

రాజరాజేశ్వరి ఫిలింకంపెనీ : స్థాపన, 1939. నిర్వాహకులు: కడారి నాగభూషణంగారు, పసుపులేటి కన్నాంబగారు. మంచి కట్టుదిట్టమైన ఏర్పాట్లతో సాగుతున్న తెలుగుసినిమా కంపెనీలలో ఇది ఒకటి. తీసినచిత్రాలు: తల్లిప్రేమ, సుమతి, పాదుక, హరిశ్చంద్ర, నవజీవనం, (తమిళం) సౌదామిని.

రోహిణి పిక్చర్స్ : స్థాపన 1937. యజమానులు. హెచ్. ఎం. రెడ్డిగారు. తీసిన ఫిలుములు, గృహలక్ష్మి, తెనాలిరామకృష్ణ, ఘరానాదొంగ, జస్టిస్ (హిందీ) నిర్దోషి.

వాహినీపిక్చర్స్ లిమిటెడ్ : మొదట్లో రోహిణీపిక్చర్స్ కంపెనీని హెచ్. ఎం. రెడ్డిగారితో కలసి స్థాపించిన బి. ఎన్. రెడ్డిగారు, 1949 లో రోహిణీ పిక్చర్సునుంచి విడిపోయి. ఈ కంపెనీ స్థాపించారు. కంపెనీలో ప్రధానవ్యక్తి బి. ఎన్. రెడ్డిగారు. కె. వి. రెడ్డి, వి. నాగయ్య, బ్రిజ్ మోహనదాస్, సముద్రాల రాఘవాచారిగార్ల సహకారంతో, ఈ కంపెనీ ఉత్తమచిత్రాలను తయారుచేసింది. తీసినచిత్రాలు: వందేమాతరం, సుమంగళి, దేవత, పోతన, స్వర్గసీమ, వేమన, గుణసుందరి కథ, మల్లీశ్వరి, పెద్దమనుష్యులు.

శోభనాచల పిక్చర్స్ : 1937 లో స్థాపించబడిన జయా పిక్చర్స్ అనే సంస్థ 1944 లో శోభనాచల పిక్చర్స్ అని మార్చబడింది. నిర్వాహకులు మీర్జాపురం జమీందారు. వీరికి సొంత స్టుడియోవుంది. (శోభనాచల స్టూడియోస్) ఇక్కడ తెలుగుచిత్రాలేకాక, ఇతర కంపెనీల తమిళ చిత్రాలుకూడా తయారవుతున్నవి.

విజయప్రొడక్షన్స్ : 1949 లో శ్రీ బి. నాగిరెడ్డి, శ్రీ చక్రపాణి గార్ల సహకారంతో స్థాపించబడినది. వీరు తమ నిర్వహణలో షాహుకార్, పాతాళభైరవి, పెళ్ళిచేసిచూడు, చంద్రహారం అనే చిత్రాల్ని తయారుచేశారు.

# మద్య నిషేధం

ఆంధ్ర రాష్ట్రం ఏర్పడేనాటికి, రాష్ట్రంలోని అన్ని జిల్లాలలోను మద్యనిషేధశాసనం అమలులోవుంది. కాని, యీశాసనంసరిగా అమలు జరగడం లేదనీ, దొంగకాపు సారాయి వ్యాపారం, ఉద్యోగులలో లంచగొండితనం బాగా ప్రబలినాయనీ ఆరోపణలు ప్రబలంగావచ్చినందున, పరిస్థితులను పరిశీలించి సలహా ఇవ్వడానికి ఒకకమిటీని ప్రభుత్వం నియమించింది. ఆకమిటీకి అధ్యక్షుడు శ్రీ కొంతి రామమూర్తి. ఆకమిటీ తన నివేదికలో, మద్యనిషేధ శాసనం సరిగా అమలు జరగడంలేదని చెపుతూ, కల్లుగీత, కల్లు అమ్మకం మొదలైన ఏర్పాట్లను సూచించింది.

తరువాత, 1954 మార్చి 22 న ఆంధ్ర మంత్రి మండలి సమావేశమై నీరా (తీపికల్లు) గీతను రాష్ట్రమంతటాకూడా అనుమతించడానికి నిశ్చయించింది.

# న్యాయ పరిపాలన

న్యాయశాఖను పరిపాలనా శాఖనుంచి వేరుచేసి, న్యాయాధికారులపై కలెక్టర్ల అధికారం లేకుండా చెయ్యాలనే సూత్రం మదరాసు రాష్ట్రంలో 1949 అక్టోబరు 2 న అమలు జరుపబడింది. ఆసూత్రాన్ని అనుసరించి 1950 జనవరి 26 . తేదిన అనంతపురం, బళ్ళారి, చిత్తూరు జిల్లాలలోను; 1950 ఆగష్టు 15 తేదిన కడప, కర్నూలు, విశాఖపట్టణం జిల్లాలలోనూ, పరిపాలనా శాఖనుంచి న్యాయశాఖ వేరుచెయ్యబడింది. ఆంధ్రరాష్ట్రం ఏర్పడేనాటికి, యీ పద్ధతి అనంతపురం, చిత్తూరు, కడప, కర్నూలు, విశాఖపట్టణం జిల్లాలలో అమలులో వుంది. 1954

ఏప్రిల్ 1 నుంచి యీ పద్ధతి పశ్చిమగోదావరి జిల్లాలో కూడా అమలు జరుపబడింది. ఇక మిగిలినవి శ్రీకాకుళం, తూర్పుగోదావరి, కృష్ణ, గుంటూరు, నెల్లూరు జిల్లాలు.

ఆంధ్రరాష్ట్రం ఏర్పడేనాటికి రాష్ట్రంలోని జైళ్లలో శిక్షలు అనుభవించుతున్నవారు 4,763 మంది, నేరముల విచారణకుగాను ముద్దాయిలుగా నిర్బంధంలో వుంచబడినవారు 2,590 మంది వున్నారు. ఆంధ్రరాష్ట్ర సిద్ధి ఆనంద చిహ్నంగా ఖైదీలను విడుదల చెయ్యడానికి ప్రభుత్వం ఉత్తరువు లిచ్చినందున, శిక్షలు అనుభవించుతున్న 5,763 మంది విడుదల చెయ్యబడినారు.

## పోలీసు

1954 మార్చి నాటికి ఆంధ్రరాష్ట్రంలోగల పోలీసు సిబ్బంది వివరాలు:

కాన్‌స్టబిల్సు, 10,713; సబ్ ఇన్‌స్పెక్టర్లు, 753; ఇన్‌స్పెక్టర్లు; 133; డిప్యూటీ సూపరింటెండెంట్స్, 39; డిస్ట్రిక్ట్ సూపరింటెండెంట్స్, 13; డిప్యూటి ఇన్‌స్పెక్టర్స్ జనరల్, 3; ఇన్‌స్పెక్టర్ జనరల్, ఒకరు.

### నేరములు చేయువారి సెటిల్మెంట్లు

కుటుంబ పోషణకు నేరములు చెయ్యడమే వృత్తిగాగలవారని అనుమానమున్న కొన్ని కుటుంబాలను ఒక్కొక్క ముఠాగా ఏర్పరచి, వారికి వృత్తిపనులు చూపించి, విద్యాసౌకర్యములను కలిగించి, వారి ప్రవర్తనను బాగుచేసే వుద్దేశంతో ఏర్పరచిన సెటిల్‌మెంట్లు ఆంధ్రరాష్ట్రంలో రెండు వున్నాయి. అవి:

| | | |
|---|---|---|
| సీతానగరం | : | తూర్పుగోదావరి జిల్లా |
| స్టూవర్టుపురం | : | గుంటూరుజిల్లా |

## దేవాలయాలు

ఆంధ్రరాష్ట్రంలో మొత్తం 5,975 దేవాలయాలు వున్నాయి. వానిలో, ఏటా పదివేల రూపాయలలోపు ఆదాయంవచ్చేవి 5,870; పదివేలకు పైన పది హేను వేలలోపు ఆదాయం వచ్చేవి, 93, యాభై వేల రూపాయలకు పైఃబడిన ఆదాయం వచ్చేవి, 12.

## భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్

స్కౌటు ఉద్యమం ప్రారంభమైన రోజులలో, ఇండియాలో యీ వుద్యమంలో యూరపియను బాలురు, ఆంగ్లో-ఇండియన్ బాలుర మాత్రమే చేర్చుకొనబడేవారు. 1919 లో డాక్టరు అనిబిసెంట్ భారతీయ యువకులకొరకు ప్రత్యేకం ఒక స్కౌటు సంస్థను స్థాపించింది. దీనికి పోటీగా, అప్పుడు మదరాసు గవర్నరుగావున్న పెంట్లండ్ ప్రభువు మరొక స్కౌటుసంస్థను స్థాపించారు. 1921 లో యీ రెండు సంస్థలు కలసిపోయాయి.

1918 లో పండిత మదనమోహనమాలవీయ, పండిత హృదయనాథ్ కుంజ్రూ, పండిత శ్రీరాం వాజపేయగార్లు సేవాసమితి బాయ్ స్కౌట్సు అసోసియేషన్ను స్థాపించారు. 1937 లో, యీ సంస్థ హిందూస్థాన్ స్కౌట్ అసోసియేషన్ గా మారింది. 1950 డిసెంబరు 23 న ఇది ఇండియన్ స్కౌట్సు అసోసియేషన్తో కలిసిపోయింది. ఇప్పుడు దేశం అంతటికీ, భారత్ స్కౌట్స్ అండ్ గైడ్స్ అనే పేరుతో ఒకే సంస్థవుంది.

ఈ ఉద్యమం ఆశయం ఏమిటంటే బాలురకు సంఘసేవ, పౌరస్వత్వము, క్రమశిక్షణ, విధినిర్వహణ, సత్ప్రవర్తన మొదలైన సుగుణాలను నేర్పడం. ఇది దేశమంతటావున్న వుద్యమం. మన రాష్ట్రంలోని అనేక నగరాలలో దీనికి బ్రాంచీలు వున్నాయి, సాధారణంగా హైస్కూళ్ళన్నిటిలోనూ బాలురు యీ సంస్థలో సభ్యులుగా వున్నారు. అనేక పట్టణాలలో, సభలు సమావేశాలు; ఉత్సవాలు జరుగుతున్నపుడు,

సమ్మర్దం లేకుండా సర్దటంలోను, వారికి అనేక విధాల సహాయ పడటం లోను స్కౌట్ బాలురు ఎంతో సహాయపడుతున్నారు.

# జిల్లాలు

మనరాష్ట్రంలో మొత్తం 11 జిల్లాలు వున్నాయి. జిల్లాలన్నిటి లోకీ వైశాల్యంలో పెద్దది నెల్లూరు; చిన్నది, పడమటి గోదావరి.

## అనంతపురం

వైశాల్యం; 6,734 చ. మైళ్ళు. జనాభా, 13,61,556. పురుషులు.7,01,242 స్త్రీలు 6,60,314.

జిల్లాలో భూమి 42,92,129 ఎకరాలు. దీనిలో అడవి, 4,52,794 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 3,62,477 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 4,02,030 ఎకరాలు. 1950-51 లో పంటవేసిన భూమి, 22,25,597 ఎకరాలు. నీటి తీరువ పొందినభూమి, 2,14,650 ఎకరాలు. రెండుసార్లు పంట వేసిన భూమి 69,142 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను, ప్రభుత్వాదాయం. రు. 21,95,529.

తాలూకాలు పది: అనంతపురం, మడకశిర, కదిరి, గుత్తి, హిందూపురం; పెనుకొండ, కళ్యాణదుర్గం, ధర్మవరం, తాడిపత్రి; రాయదుర్గం.

జిల్లా కేంద్రనగరం : అనంతపురం.

## కడప

వైశాల్యం : 5,933 చ. మైళ్ళు. జనాభా; 11,61,731; పురుషులు, 5,95,060; స్త్రీలు, 5,66,671.

జిల్లాలో భూమి 37,94,524 ఎకరాలు. దీనిలో అడవి, 11,56,865 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 1,69,628 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 6,43,240 ఎకరాలు.

1950-51 లో పంట వేసిన భూమి, 10,56,282 ఎకరాలు. దీనిలో నీటి తీరువపొందినభూమి, 2,43,061 ఎకరాలు. రెండు సార్లు పంటవేసిన భూమి, 73,367 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం. రు. 20,88,623

తాలుకాలు ఎనిమిది: కడప, ప్రొద్దుటూరు, రాజంపేట. జమ్మలమడుగు, పులివెందల; బద్వేల్, రాయచోటి, సిద్ధవటం.

జిల్లా కేంద్రనగరం. కడప.

## కర్నూలు

వైశాల్యం: 7,793 చ. మైళ్ళు; జనాభా, 12,70,843, పురుషులు 6,43,594; స్త్రీలు, 6,27,249.

జిల్లాలో భూమి 50,15,222 ఎకరాలు. దీనిలో అడవి 16,60,142 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది 2,95,877 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 6,00,475 ఎకరాలు. 1950-51 లో పంటవేసిన భూమి 21,26,643 ఎకరాలు. దీనిలో నీటి తీరువపొందిన భూమి; 1,06,401 ఎకరాలు. రెండుసార్లు పంటవేసిన భూమి, 52,395 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను ప్రభుత్వాదాయం రు. 30,59,398.

తాలూకాలు 12; కర్నూలు, ద్రోణాచలం, నంద్యాల, పత్తికొండ, నందికొట్కూరు, సిరువెళ్ళ, కంబం; మార్కాపురం, కోయిలకుంట్ల, బంగనపల్లి, ఆదోని, ఆలూరు.

జిల్లా కేంద్రనగరం: కర్నూలు.

## కృష్ణ

వైశాల్యం, 3,469 చ. మైళ్ళు; జనాభా, 17,79,484; పురుషులు 9,03,872; స్త్రీలు, 8,75,612.

జిల్లాలోభూమి 22,39,187 ఎకరాలు; దీనిలో అడవి 1,25,550 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది, 3,07,150 ఎకరాలు. వ్యవ

సాయం చెయ్యకుండా వున్న బీడు 2,50,947 ఎకరాలు. 1950-51 లో పంటవేసిన భూమి 12,48,591 ఎకరాలు. దీనిలో నీటితీరువ పొందిన భూమి, 7,25,300 ఎకరాలు. రెండుసార్లు పంటవేసిన భూమి, 1,56,124 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువ పన్ను ప్రభుత్వాదాయం, రు. 58,32,865.

తాల్ూకాలు తొమ్మిది: బందరు, విజయవాడ, నూజివీడు, నందిగామ, కైకలూర్, గుడివాడ, దివి, గన్నవరం, తిరువూరు.

జిల్లా కేంద్రనగరం; మచిలీపట్టణం.

## గుంటూరు

వైశాల్యం : 5,795 చ. మైళ్ళు; జనాభా, 25,49,996; పురుషులు, 12,91,745; స్త్రీలు; 12,58,251.

జిల్లాలో భూమి, 36,93,743 ఎకరాలు. దీనిలో అడవి, 4,68,862 ఎకరాలుపోగా, వ్యవసాయానికి రానిది, 3,75,095 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 92,652. ఎకరాలు, 1950-51 లో పంటవేసిన భూమి, 21,21,910 ఎకరాలు, దీనిలో నీటి తీరువపొందిన భూమి 4,59,184 ఎకరాలు. రెండవపంటవేసిన భూమి, 2,73,350 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటి తీరువపన్ను, ప్రభుత్వాదాయం, రు. 84,75,968.

తాలూకాలు తొమ్మిది: గుంటూరు, ఒంగోలు, బాపట్ల, తెనాలి, రేపల్లి, నరసరావుపేట, పల్నాడు, వినుకొండ, సత్తెనపల్లి.

జిల్లా కేంద్రనగరం : గుంటూరు.

## చిత్తూరు

వైశాల్యం; 5,951 చ. మైళ్ళు; జనాభా 18,10,377; పురుషులు; 9, 24, 592; స్త్రీలు, 8,85,795.

జిల్లాలో భూమి, 37,69,290 ఎకరాలు. దీనిలో అడవి, 5,28,746 ఎకరాలుపోగా, వ్యవసాయానికి, రానిది 9,34,700 ఎక

రాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 4,34,689 ఎకరాలు. 1950-51 లో పంటవేసినభూమి 8,24,356 ఎకరాలు. దీనిలో నీటితీరువ పొందినభూమి, 2,25,651 ఎకరాలు. రెండవ పంటవేసిన భూమి, 52,442 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్ను వల్ల ప్రభుత్వాదాయం రు. 14,22,118.

తాలూకాలు తొమ్మిది: చిత్తూరు, మదనపల్లి, వాయల్పాడు, కాళహస్తి, చిత్తూరు, పుంగనూరు, తిరుత్తణి, పలమనేరు, చంద్రగిరి.

జిల్లా కేంద్రనగరం : చిత్తూరు.

## తూర్పుగోదావరి జిల్లా

వైశాల్యం, 6,322 చ. మైళ్ళు. జనభా, 24,14,808. వీరిలో పురుషులు, 12,06,483; స్త్రీలు 12,08,325.

జిల్లాలో 3,575 చ. మైళ్ళ ప్రదేశం ఏజన్సీ. దీనిలో జనాభా 2,71,569 మందిలోనూ 1,36,213 మంది పురుషులు; 1,35,356 మంది స్త్రీలు.

జిల్లాలో భూమి 36,36,578 ఎకరాలు. దీనిలో అడవి 8,64,855 ఎకరాలుపోగా, 7,54,544 ఎకరాలు వ్యవసాయానికి రానిది. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 4,04,463 ఎకరాలు. 1950-51 లో పంటవేసినభూమి 10,49,014 ఎకరాలు. దీనిలో నీటి తీరువపొందిన భూమి. 5,69,852 ఎకరాలు. రెండవపంటవేసినభూమి, 2 83;085 ఎకరాలు. జిల్లామొత్తంమీద, భూమిపన్ను, నీటితీరువపన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 83,20,643.

తాలూకాలు పన్నెండు: రామచంద్రపురం, రాజమండ్రి, కాకినాడ, తుని, రాజోలు, పెద్దాపురం, అమలాపురం, భద్రాచలం, నూగూరు, యల్లవరం, చోడవరం, పిఠాపురం.

జిల్లా కేంద్రనగరం: కాకినాడ; జిల్లాకోర్టు మాత్రం, రాజమండ్రిలో వుంది.

## నెల్లూరు

వైశాల్యం, 7,942 చ. మైళ్లు; జనాభా, 17,95,632 ; పురుషులు 9,02,794; స్త్రీలు, 8,92,838.

జిల్లాలోభూమి50,94,191 ఎకరాలు. దీనిలో అడవి, 4,73,222 ఎకరాలు పోగా, వ్యవసాయానికి రానిది 17,50,640 ఎకరాలు. వ్యవసాయం చెయ్యకుండా వున్న బీడు, 11,267 ఎకరాలు. 1950-51లోపంట వేసిన భూమి, 12,85,702 ఎకరాలు. దీనిలో నీటి తీరువ పొందిన భూమి, 504,673 ఎకరాలు. రెండవపంట వేసినభూమి. 1,13,828 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను నీటితీరువ పన్నులవల్ల ప్రభుత్వాదాయం రు. 33,39,428.

తాలూకాలు తొమ్మిది; నెల్లూరు, కోవూరు, కావలి, గూడూరు ఉదయగిరి, కనిగిరి, రాపూరు ఆత్మకూరు, కందుకూరు.

జిల్లా కేంద్రనగరం: నెల్లూరు.

## పడమటి గోదావరి

వైశాల్యం 2,434 చ. మైళ్ళు; జనాభా. 16,97,757; పురుషులు; 8,48.990; స్త్రీలు : 8,48,737 :

జిల్లాలో భూమి, 19,29 460 ఎకరాలు. దీనిలో అడవి, 1,16,485 ఎకరాలుపోగా వ్యవసాయానికి రానిది, 1,80.501 ఎకరాలు. వ్యవసాయం చెయ్యని బీడు 2,01,974 ఎకరాలు. 1950-51 లో పంటవేసినభూమి, 8,91 917 ఎకరాలు. దీనిలో నీటితీరువ పొందిన బూమి, 8,01,806 ఎకరాలు. రెండవపంట వేసినబూమి, 2,34,886 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువ పన్నువల్ల ప్రభుత్వాదాయం, రు. 71,34,071.

తాలూకాలు ఎనిమిది : ఏలూరు, తాడేపల్లిగూడెం, భీమవరం పోలవరం. నర్సాపురం, కొవ్వూరు, చింతలపూడి, తణుకు.

జిల్లా కేంద్రనగరం : ఏలూరు.

## వి శా ఖ ప ట్ట ణ ం

వైశాల్యం : 9,107 చ. మైళ్ళు. జనాభా, 20,72,698. వీరిలో పురుషులు 10,23,192; స్త్రీలు, 10,49,506.

జిల్లాలోభూమి, 33,14,434 ఎకరాలు. దీనిలో అడవి 15,29,978 ఎకరాలుపోగా, వ్యవసాయానికిరానిది. 3,73,222 యెకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు 92,896 ఎకరాలు. 1950-51 లో పంట వేసినభూమి 8,27,903 ఎకరాలు. దీనిలో నీటి తీరువపొందినభూమి, 3,09,855 ఎకరాలు. రెండవపంట వేసినభూమి, 2,72,734 ఎకరాలు. జిల్లా మొత్తంమీద భూమిపన్ను, నీటితీరువపన్ను వల్ల ప్రభుత్వాదాయం. రు. 10,01,982.

తాలూకాలు తొమ్మిది: గోలుకొండ, సర్వసిద్ధి, వీరవల్లి, అనకాపల్లి, విశాఖపట్టణం. శృంగవరపుకోట, విజయనగరం, భీమునిపట్టణం, గూడెం.

జిల్లా కేంద్రనగరం : విశాఖపట్టణం.

## శ్రీ కా కు ళ ం

జనాభా 21,23,136. వీరిలో పురుషులు 10,34,910: స్త్రీలు, 10 88,226.

ఇది 1950 జులైలో ప్రత్యేకంగా జిల్లాగా ఏర్పాటు చేయబడింది. అంతకుపూర్వం విశాఖపట్టణం జిల్లాలో ఒక భాగంగా వుండేది.

జిల్లాలో భూమి 24,88, 931 యెకరాలు, దీనిలో అడవి 5,55,243 యెకరాలు. వ్యవసాయం చెయ్యకుండావున్న బీడు2,50,322 యెకరాలు. 1950-51 లో పంట వేసిన భూమి 8,28,311 యెకరాలు దీనిలో నీటితీరువపొందిన భూమి 4,19, 184 యెకరాలు రెండవపంట వేసినభూమి 2,28,104 యెకరాలు. జిల్లామొత్తంమీద భూమిపన్ను, నీటితీరువ పన్నువల్ల ప్రభుత్వానికి వచ్చిన ఆదాయం, రు. 21.33,164.

తాలూకాలు; పది: ఇచ్ఛాపురం, సోంపేట, టెక్కలి, నరసన్నపేట, పాతపట్నం, శ్రీకాకుళం, పాలకొండ, పార్వతీపురం, బొబ్బిలి, పాలూరు.

జిల్లా కేంద్రనగరం · శ్రీకాకుళం.

## స్థానిక సంస్థలు

1953 లో ఆంధ్రరాష్ట్రంలో 11 జిల్లాబోర్డులూ, 36 మునిసిపల్ కౌన్సిళ్లు వున్నాయి.

ఆంధ్రరాష్ట్రంలో జిల్లాబోర్డులను రద్దుచెయ్యడానికి ప్రభుత్వం 1954 ఫిబ్రవరి 4 తేదిన నిశ్చయించింది. ప్రస్తుతం జిల్లాబోర్డులు సాగిస్తున్న పనులను ముగించడానికి వాటికి ఒక సంవత్సరం వ్యవధి ఇస్తూ, ఆసంవత్సరంపాటు అవి స్పెషల్ ఆఫీసర్ల (జిల్లాకలెక్టర్లు) అధీనంలోనే వుండేటట్టు ప్రభుత్వం నిశ్చయించింది.

### మునిసిపాలిటీలు

రాష్ట్రంలోని మునిసిపాలిటీల సంఖ్య 36. వివరాలు యీ క్రింద ఇవ్వబడినవి.

| పేరు | చైర్మను |
|---|---|
| అనకాపల్లి | దాడి వీరునాయుడు |
| అనంతపురం | మేడా సుబ్బయ్యశెట్టి |
| అమలాపురం | కె. కృష్ణమూర్తి |
| ఆదోని | హెచ్: సీతారామ రెడ్డి |
| ఏలూరు | డి. వెంకటరావు |
| ఒంగోలు | తాతా లక్ష్మీనరసింహం |
| కడప | ఎం. రహింతుల్లా |
| కర్నూలు | ఎస్. నరసింహా రెడ్డి |
| కాకినాడ | చిత్తజల్లు వెంకటకృష్ణరావు |
| గుంటకల్ | మహమ్మద్ దావూద్ సాహెబ్ |

| | |
|---|---|
| గుంటూరు | |
| గుడివాడ | కోగంటి వెంకటరత్నం |
| గూడూరు | పసుపులేటి సిద్దయ్యనాయుడు |
| చిత్తూరు | శ్రీమతి ఆర్. రత్నాబాయి |
| చీరాల | వడ్డాది నాగేశ్వరరావు |
| తాడిపత్రి | పాటిలు రంగారెడ్డి |
| తిరుపతి | పి. ఎస్. గురవారెడ్డి |
| తెనాలి | ఎన్. వెంకటరావు |
| నంద్యాల | హెచ్. సేతుమాధవరావు |
| నరసరావు పేట | నాగసరపు కృష్ణమూర్తి |
| నెల్లూరు | ఆనెం చెంచుసుబ్బారెడ్డి |
| పాలకొల్లు | పోలిశెట్టి వెంకటసుబ్బారావు |
| పెద్దాపురం | చల్లా వెంకటరావు చౌదరి |
| ప్రొద్దుటూరు | జూటూరి వెంకటసుబ్బయ్య శెట్టి |
| బాపట్ల | వెలగపూడి సుబ్బారావు |
| భీమవరం | నాచు వెంకట్రామయ్య |
| భీమునిపట్నం | కలిగొట్ల సత్యనారాయణనాయుడు |
| మచిలీపట్టణం | కె. నరసింహారావు |
| రాజమండ్రి | డాక్టర్ ఎ. బి. నాగేశ్వరరావు |
| విజయనగరం | భాగనగరపు వెంకట సంజీవరావు |
| విజయవాడ | డాక్టర్ తెన్నేటి చలపతిరావు |
| విశాఖపట్టణం | ఎ. వి. భానోజిరావు |
| శ్రీకాకుళం | ఇప్పిలి లక్ష్మీనారాయణ |
| సాలూరు | టి. రామారెడ్డి |
| హిందూపూర్ | బి. అబ్దుల్ వహీద్ |

# ఎన్నికలు

ఇండియా ప్రజారాజ్యం అయిన తరువాత, మొట్టమొదటిసారి ఎన్నికలు, ఇండియాలోని అన్ని రాష్ట్రాలతోపాటు, మదరాసు

రాష్ట్రంలో కూడా 1952 జనవరిలో జరిగాయి. అంతకుపూర్వం ఎన్నికలు 1946 లో జరిగాయి. అప్పుడు ఓటుచేసే హక్కు విద్యావంతులైన వయోజనులకు మాత్రమే వుండేది. వయోజనులందరికీ ఇతర అర్హతలతో నిమిత్తంలేకుండా ఓటుచేసే హక్కు ఇవ్వబడింది. ఈ విధానంవల్ల రాష్ట్రంలోని జనాభా 5,69,52,332 మందిలోనూ, 2,68,58,906 మంది వయోజనులు (స్త్రీలు, పురుషులూ కలిపి) ఎన్నికలలో ఓటు చెయ్యడానికి అర్హత పొందారు.

ఆంధ్ర రాష్ట్రంలోని పార్లమెంటరీ నియోజకవర్గాలలో, దేనిలో ఎంత మంది ఓటర్లు ఉన్నదీ, వివరాలు ఇవి :

పాతపట్నం-3,36,668. శ్రీకాకుళం- 3,67,310, పార్వతీపురం-3,58,375, విజయనగరం-3,74 684, విశాఖపట్టణం (2)-7,07,707, కాకినాడ-3,46;037, రాజమండ్రి (2)-7,41,484, ఏలూరు (2)-6,89,258, మచిలీపట్టణం- 3,32,762, గుడివాడ- 3,51,988, విజయవాడ-3,67,722, తెనాలి- 3,41,801, గుంటూరు- 3,64,562; నర్సారావుపేట-3,66,313 ఒంగోలు, (2)-7,34,287, నెల్లూరు-3,52,385; నంద్యాల -3,80.071; కర్నూలు-3,54,755,-బళ్లారి- 3,45,553, అనంతపురం- 3,64,429, పెనుకొండ- 3;52,629, కడప-3,68,052, చిత్తూరు (2) 7;17,441, తిరుపతి- 3;74,862.

# రాష్ట్ర ప్రభుత్వం

గవర్నర్ : శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేది

పదవీ స్వీకారం : 1953 అక్టోబరు 1

జీతం : నెలకు రు. 5,500. అయితే రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని బట్టి తమ జీతంలో రు. 1,350 లను తగ్గించి నెలకు రు. 4,250 లను మాత్రమే తీసుకుంటున్నారు.

కార్యదర్శి : డి. ఆర్. సుందరం

మిలిటరీ కార్యదర్శి : మేజర్ కె. టి. వి. నారాయణ నంబియార్
అంగరక్షకుడు : కెప్టెన్ రాజకుమార్ డి. భగవాన్ దాస్
మెడికల్ ఆఫీసర్ : డాక్టర్. సి. టి. తిలక్

## మంత్రిమండలి

1953 అక్టోబరు 1 తేదిన, రాష్ట్రస్థాపనతోపాటు, శ్రీ టంగుటూరిప్రకాశం ముఖ్యమంత్రిగా, అయిదుగురుసభ్యులుగల మంత్రిమండలి పదవీస్వీకారం చేసింది. మిగతావారు: శ్రీ నీలం సంజీవరెడ్డి, శ్రీ కోటిరెడ్డిగారి కోటిరెడ్డి, శ్రీ తెన్నేటి విశ్వనాథం, శ్రీ దామోదరం సంజీవయ్య.

అక్టోబరు 5 న శ్రీ పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి, శ్రీ బులుసు ప్రభాకర పట్టాభి రామారావుగార్లు, మంత్రులుగా నియమించబడినారు.

| | |
|---|---|
| టంగుటూరి ప్రకాశం : | ముఖ్యమంత్రి హోం (పొలిటికల్, పబ్లిక్ సర్వీసెస్); ప్రచారశాఖ; |
| నీలం సంజీవరెడ్డి : | ఉపముఖ్యమంత్రి హోం (పోలీసు, శాంతిభద్రతలు) రాష్ట్రశాసనసభ, ఎన్నికలు, పబ్లిక్ వర్క్స్, రవాణా. |
| కోటిరెడ్డిగారి కోటిరెడ్డి : | రెవిన్యూమంత్రి ఆహారము, రిజిస్ట్రేషను |
| తెన్నేటి విశ్వనాథం : | ఆర్థికమంత్రి న్యాయశాఖ, కోర్టులు, వాణిజ్యపన్నులు, మత సంస్థలు; షెడ్యూల్డు జాతులు. |
| దామోదరం సంజీవయ్య : | ఆరోగ్యమంత్రి సహకారము, కార్మికులు, గ్రామీణ హరిజనాభివృద్ధి, ప్లానింగ్. |
| బులుసుప్రభాకరపట్టాభిరామారావు: | విద్యామంత్రి పరిశ్రమలు, ఎక్సైజు మద్యనిషేధము, మహిళాభ్యుదయ శాఖ. |
| పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి : | స్థానిక పరిపాలన మంత్రి వ్యవసాయము; అడవులు, పశుసంరక్షణ, మత్స్య శాఖలు. |

1953 నవంబరు 7 తేదిన శ్రీ గౌతు లచ్చన్నగారు మరొక మంత్రిగా నియమింపబడినారు. వీరికి వ్యవసాయము, అడవులు, హరిజనోద్ధరణ, మాజీ సైనికుల పునరావాసము శాఖలు ఇవ్వబడినవి. కాని, రాజధాని స్థాపన విషయమై వీరిపార్టి (కృషికార్ లోక్‌పార్టి) కిని, మంత్రి మండలికిని అంగీకారం కుదరనందున, శ్రీ గౌతు లచ్చన్నగారు తమ మంత్రి పదవికి 1954 జనవరి 4 తేదిన రాజీనామా ఇచ్చారు. వీరి అధికారంలో వున్న శాఖలు మళ్లీ, శ్రీ పి. తిమ్మారెడ్డిగారికి ఇవ్వబడినవి.

## మంత్రుల జీతాలు

మంత్రులకు ఒక్కొక్కరికి నెలకు రు. 1,000 జీతమూ, రు. 250 ఇంటి అద్దె; రు. 250, కారు అలవెన్సు ఇవ్వవలెననీ, ప్రభుత్వం అద్దె చెల్లించే ఇంటిలో వుండే మంత్రికి ఇంటి అద్దె ప్రత్యేకం ఇవ్వనవసరం లేదనీ, 1953 నవంబరు 10 తేదిన ఒక ఆర్డినెన్సును గవర్నరు ప్రకటించారు.

కాని, ఈ ఆర్డినెన్సును శాసనంగా చెయ్యడానికి ఆంధ్ర అసెంబ్లీలో జరిగిన చర్చలో, 1953 డిసెంబరు 1 న, 1000 బదులు రు. 500 మాత్రమే వుండాలన్న సవరణ ఆమోదింపబడింది. కాని, ఈ జీతాలను వెయ్యి రూపాయలుగా వుంచాలనే ప్రతిపాదనమళ్లీ, 1954, జనవరి 9 తేదీన ఆమోదించబడింది.

మంత్రులకు, వారి కుటుంబాలకు ప్రభుత్వపు హాస్పిటల్సులో ఉచిత వైద్య సౌకర్యాలు వుంటవి.

## శాసనసభ

ఆంధ్రరాష్ట్రానికి శాసనసభ, ఒక అసెంబ్లీమాత్రమే. కౌన్సిలు లేదు. రాష్ట్రం 1953 అక్టోబరు 1 తేదిన ఏర్పడినప్పుడు, రాష్ట్ర అసెంబ్లీకి కొత్తగా ఎన్నికలు జరగలేదు. రాష్ట్ర విభజన జరగకపూర్వం, మదరాసు రాష్ట్ర అసెంబ్లీలో, తెలుగుజిల్లాలతరఫున ఏ సభ్యులు వున్నారో, ఆ సభ్యులతోనే ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీ ఏర్పడాలని నిర్ణ

యింప బడింది. అప్పటికి మదరాసు అసెంబ్లీలో తెలుగు జిల్లాలనుంచి 142 మంది సభ్యులు వున్నారు. ఆ సభ్యులతోనే ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీ ఏర్పడింది.

ఆంధ్రరాష్ట్ర అసెంబ్లీ ప్రథమసమావేశం, కర్నూలులో 1953 నవంబరు 23 తేదిన జరిగింది. ఈ సమావేశానికి శ్రీ నడింపల్లి వెంకట లక్ష్మీ నరసింహారావుగారు అధ్యక్షత వహించారు. ఈ సమావేశంలో స్పీకరు పదవికి ఎన్నిక జరిగింది. శ్రీ నల్లపాటి వెంకటరామయ్య, శ్రీ కె. కృష్ణారావుగార్లు పోటీచేశారు. వెంకటరామయ్యగారికి 86 ఓట్లు, కృష్ణారావుగారికి 48 ఓట్లు వచ్చినవి. వెంకటరామయ్యగారు స్పీకరుగా ఎన్నిక అయారు. మరునాడు డిప్యూటి స్పీకరు ఎన్నికలో, శ్రీ పసల సూర్యచంద్రరావుగారు గెలిచారు.

స్పీకరు : నల్లపాటి వెంకటరామయ్య

డిప్యూటి స్పీకరు : పసల సూర్యచంద్రరావు

సెక్రటరి : జి. వి. చౌదరి

డిప్యూటి సెక్రటరి : ఎం. సూర్యారావు

అసెంబ్లి సభ్యుల సంఖ్య మొత్తం 140.

స్పీకరుజీతం : నెలకు రు. 1,000; కారు అలవెన్సు రు. 250; ఇంటి అద్దె రు. 250, లేదా ఉచిత గృహవసతి.

డిప్యూటి స్పీకరు జీతం : నెలకు రు. 300.

శాసనసభ్యుల జీతాలు : నెలకు రు. 150, కాక, సభా సమావేశానికి హాజరైన ప్రతిరోజుకీ, రు. 12½ అలవెన్సు. సభ్యుల స్వస్థానంనుంచి కర్నూలుకు రావడానికి, రానుపోను రైలులో ఫస్టు క్లాసుకు అయేఖర్చుకు ఒకటిన్నరరెట్లు ప్రయాణపు ఖర్చు.

## పార్టీలబలం

1954 అక్టోబరు 1 తేదినాటికి ఆంధ్రశాసనసభలోని పార్టీల వివరాలివి :

కాంగ్రెసు, 46; కమ్యూనిస్టులు, 42; ప్రజాసోషలిస్టు, 16; కృషి

1909; బి. ఎస్. సి., హైదరాబాద్ 1928; ఎం. ఎస్. సి. మదరాస్, 1932. వీరు 1933 లో ఆంధ్ర యూనివర్శిటిలో ఫిజిక్స్ రీడర్ గా చేరారు. 1938 లో ప్రొఫెసర్ అయారు. 1941 నుంచీ యూనివర్శిటికాలేజి, ప్రిన్సిపాల్ గా ఉన్నారు. 1941 లో ఆంధ్ర యూనివర్శిటి, వీరికి ఆనరరీ డాక్టర్ ఆఫ్ సైన్సు డిగ్రీని ఇచ్చినది. 1946 లో ఇండియన్ సైన్సు కాంగ్రెస్ లో ఫిజిక్స్ శాఖకు వీరు అధ్యక్షులుగా వున్నారు. 1948 లో ఇండియా గవర్నమెంటు తరఫున సైంటిఫిక్ లయిజన్ ఆఫీసరుగా లండనులో చేరినారు. 1949 డిసెంబరునుంచి ఉస్మానియా యూనివర్శిటి ఫిజిక్సు రీసెర్చిశాఖకు డైరెక్టరుగా పని చేశారు. 1952 నుంచి ఉస్మానియా యూనివర్శిటి వైస్ ఛాన్సెలర్; అడ్రసు: హైదరాబాదు.

భాస్కరరావు నాయుడు, తామరపాకం; జననం. మే 10, 1896; బి. ఏ. మదరాస్ ప్రెసిడెన్సీకాలేజి లోను, ఆక్స్ఫర్డు యూనివర్శిటిలోను చదివారు. ఐ. స. ఎస్. లో చేరి 1922 నుంచి 1939 వరకు సబ్ కలెక్టరుగాను, 1945 వరకు కలెక్టరుగాను పని చేశారు. ఇండియా ప్రభుత్వపు నేషనల్ సర్వీసు ట్రిబ్యునల్ చైర్మన్ గాను, రీసెటిల్మెంటు ఎంప్లాయ్ మెంటు డైరెక్టరుగాను 1945-46 లలో పనిచేసి, 1946 ఫిబ్రవరిలో ఐ. సి. ఎస్. నుంచి రిటైరయారు. 1946 మార్చిలో బిన్నీ బ్రదర్స్ కంపెనీలో చేరారు. తుంగభద్ర ఇండస్ట్రీస్, జయశ్రీ టీ గార్డెన్సు లిమిటెడ్ ల లో డైరెక్టరు కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్ సభ్యులు. 1952 నుంచి, అడ్రస్: 28, నుంగంబాకం హైరోడ్, మదరాస్ 6.

మత్తయ్, డాక్టర్ జాన్, జననం, 1886 జనవరి 10. ఆక్స్ఫర్డు, లండన్, మదరాసు యూనివర్శిటీల గ్రాడ్యుయేట్. మదరాసు హైకోర్టు వకీలు, 1910-14. మదరాసు కో-ఆపరేటివ్ డిపార్టుమెంటు స్పెషల్ ఆఫీసర్, 1918-20. మదరాసు ప్రెసిడెన్సీ కాలేజిలో ఎకనమిక్సు ప్రొఫెసర్ 1920-29. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబర్ 1922-25, ఇండియన్ టారిఫ్ బోర్డు ప్రెసి

డెంటు 1931-34. డైరెక్టరు జనరల్ ఆఫ్ కమర్షియల్ స్టాటిస్టిక్స్, 1935-40 గవర్నమెంటు సర్వీసులో నుంచి రిటైరయి టాటా కంపెనీలో 1940 లో చేరారు. 1944 లో టాటాకంపెనీ డైరెక్టరయారు. ఇండియా ప్రభుత్వ ఆర్థిక శాఖామంత్రి, 1947-50. అడ్రసు: బొంబాయి.

మవలంకర్, గణేశ వాసుదేవ్; జననం, 1889 నవంబర్ 26; 1913లో వకీలు వృత్తి ప్రారంభం; విరమణ, 1921; గుజరాత్ రాష్ట్రి కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి: 1921-23; ఆలిండియా కాంగ్రెసు కమిటి ప్రధానకార్యదర్శి, 1921, 1930 లోను, 1933-34 లోను, 1940 లోను, 1942 లోను జెయిలుకు వెళ్ళారు. సెంట్రల్ అసెంబ్లీ స్పీకర్, 1936 జనవరి నుంచి 1947 ఆగష్టు వరకు; 1947 లో కన్స్టిట్యుయెంట్ అసెంబ్లీ స్పీకరుగా ఎన్నుకోబడినారు. 1950 జనవరి నుంచి ఇండియా పార్లమెంటు స్పీకరు. అడ్రసు : న్యూఢిల్లీ.

మహాతబ్, హారకృష్ణ; జననం, 1900 జనవరి; 1921 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. బీహార్-ఒరిస్సా లెజిస్లేటివ్ అసెంబ్లీ సభ్యులు, 1924; ప్రజాతంత్ర అనే ఒరియా పత్రిక సంపాదకులు 1924-41; ఉత్కళ కాంగ్రెస్ కమిటి అధ్యక్షులు 1930; 1937 కాంగ్రెస్ వర్కింగు కమిటి మెంబరు, 1938-46; ఒరిస్సా ప్రధాన మంత్రి, 1946-50, ఇండియాప్రభుత్వ పరిశ్రమ శాఖ మంత్రి, 1950-52; పార్లమెంటు మెంబరు, 1952 నుంచి. అడ్రసు: కటక్.

మహబూబ్ అలిశేగ్ ; జననం, 1894 ; బెజవాడలో అడ్వకేట్ 1930 నుంచి 1936 వరకు బెజవాడ మునిసిపల్ కౌన్సిల్ చైర్మను ఉత్తర సర్కారుల ముస్లిం నియోజక వర్గం తరపున మదరాసు కౌన్సిలు సభ్యులుగా వుంటేవారు. 1937 లో పశ్చిమగోదావరి-కృష్ణా ముస్లిం నియోజకవర్గ తరఫున మదరాసు అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు; మళ్ళీ 1946 లో ఎన్నుకోబడినారు; రాజ్యాంగ పరిషత్ సభ్యులు 1946 - 49; అడ్రసు : విజయవాడ.

మున్షీ, కన్యాలాల్ మాణెక్

లాల్; జననం; 1887 డిసెంబరు 29; బి. ఎ. ఎల్. ఎల్. బి., పేరు పొందిన లాయరు. యంగ్ ఇండియా, జాయింట్ ఎడిటర్, 1915; బొంబాయి హోం రూల్ లీగు సెక్రటరీ, 1919-20; బొంబాయి శాసనసభ సభ్యులు, 1927-46; 1930 ఉప్పుసత్యాగ్రహంలో ఆరునెలలు శిక్ష, 1932 లో రెండేళ్లు శిక్షపడ్డారు. బొంబాయి హోం మంత్రి 1937-39; 1940-41 లో నిర్బంధంలో ఉంచబడినారు. 1941 లో కాంగ్రెస్ నుంచి తొలిగిపోయి, 1946 లో మళ్ళీ చేరారు. హైదరాబాదులో ఇండియా ప్రభుత్వపు ఏజెంటు జనరల్ 1947-49; ఇండియా ప్రభుత్వం ఆహారశాఖ మంత్రి 1950-52; ఉత్తరప్రదేశ్ గవర్నర్, 1952 జూన్ నుంచి, అడ్రసు: లక్నో.

మూర్తి బి. ఎస్. (బయ్యా సూర్యనారాయణమూర్తి) జననం, 1909 అక్టోబర్ 29; బి.ఏ.బి.ఇ.డి. రాజమండ్రి ట్రెయినింగ్ కాలేజి; తొమ్మిదవ ఆంధ్ర విద్యార్థి సమావేశం ప్రధానకార్యదర్శి, 1930; పరిశ్రమశాఖా పార్లమెంటరీ సెక్రటరీ 1937-39, ఆంధ్రప్రభ అసిస్టెంటు ఎడిటర్, 1944-46, రెండుసార్లు కాంగ్రెస్ ఉద్యమంలో జెయిలుకు వెళ్లారు. మదరాస్ అసెంబ్లీకి సభ్యులు 1946-52; పరిశ్రమశాఖ పార్లమెంటరీ సెక్రటరీ, 1946-47. 'నవజీవన' సంపాదకులు; ఆంధ్రరాష్ట్ర హరిజన సేవాసంఘ అధ్యక్షులు. 1949 జూన్ లో జినివాలో జరిగిన ప్రపంచ కార్మిక మహాసభ భారత కార్మిక ప్రతినిధులలో ఒకరు. ఆంధ్రరాష్ట్ర వ్యవసాయ కూలీ కాంగ్రెస్ అధ్యక్షులు, పార్లమెంటు సభ్యులు, 1952 నుంచి. అడ్రస్ 2-20 రండాల్స రోడ్, వేపేరి, మదరాస్.

మెహతా, అశోక్; జననం, 1911 అక్టోబరు 24; బి. ఎ. 1930 నుంచి రాజకీయాలలో ప్రవేశం. సోషలిస్టుపార్టీ నాయకులు; ఆ పార్టీ స్థాపకులలో ఒకరు. నాలుగు సార్లు జయిలుకు వెళ్ళారు. సోషలిస్టుపార్టీ కార్యనిర్వాహకవర్గంలో గత 15 ఏండ్లనుంచీ సభ్యులు. అడ్రస్; 5, డాడీసెట్ రోడ్, బాబుల్ నాథ్, బొంబాయి.

రంగ, ఆచార్య ఎన్. జి.

(గోగినేని రంగనాయకులు). జననం, 1900 నవంబరు 7; ఇంగ్లండు వెళ్ళి ఆక్స్ఫర్డులో పట్టభద్రులై వచ్చారు. మదరాసు పచ్చయప్ప కాలేజిలో ఆర్థిక శాస్త్ర ప్రధానాచార్యులు 1937.30, కాంగ్రెస్, వర్కింగు కమిటి మెంబరు 1947-51; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు 1947-50, అఖిలభారతకిసాన్ కాంగ్రెస్, గ్రామీణ ప్రజలసమితిలకుకూడా అధ్యక్షులుగావున్నారు. నిడుబ్రోలులో రైతాంగ విద్యాలయాన్ని స్థాపించారు. గాంధిజీ బోధనలను ప్రచారం చెయ్యడంలో చాలా కృషిచేశారు. రైతు సమస్యలను గురించి చాలా గ్రంథాలు, వ్యాసాలు వ్రాశారు. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు సభ్యులు, 1952 నుంచి, కృషిక్ లోక్ పార్టీ స్థాపకులు. అడ్రసు, నిడుబ్రోలు.

రంగయ్యప్పారావు, మేకా, ఉయ్యూరు కుమార రాజా; వయస్సు, 40 ఏళ్ళు, ఎం. ఎ., ఆంధ్రమహాసభకు 6 సంవత్సరాలు, ఆంధ్ర నాటక కళాపరిషత్తుకు 8 సంవత్సరాలు అధ్యక్షులు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తు సెనెట్ లో 11 సంవత్సరాలుగాను, సిండికేట్ లో 9 సంవత్సరాలుగాను సభ్యులు, కృష్ణా జిల్లా నూజివీడు నియోజకవర్గంనుంచి అసెంబ్లీకి 1952 లో ఎన్నుకోబడినారు. అడ్రసు: నూజవీడు.

రంగారెడ్డి, నారు; జననం, 1896. కడప జిల్లా చిన్నిసెట్టిపల్లి. బి. ఎ. 1918, బి. ఎల్. కడపలో న్యాయవాదిగా ప్రాక్టీసు చేశారు. కడప జిల్లా బోర్డు అధ్యక్షులు, 1927-30; లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1946-52 ; 1952 లో అసెంబ్లీ సభ్యులచే లెజిస్లేటివ్ కౌన్సిలుకు ఎన్నుకోబడినారు. పబ్లిక్ వర్క్స్ శాఖా మంత్రి 1952 ఏప్రిల్ 10 నుంచి 1953 సెప్టెంబర్ 30 వరకు. అడ్రసు: కడప.

రఘురామయ్య. కొత్త; జననం. 1912. బి. ఏ. గుంటూరు; ఎం. ఎ. ఎల్. ఎల్. బి., లక్నో; 1933 లో ఇంగ్లండు వెళ్ళి, బారిష్టర్ అయి 1937 లో స్వదేశానికి వచ్చారు. నాలుగేళ్లపాటు ప్రాక్టీసు చేసి, 1941 లో జిల్లా మునసబుగా ఉద్యోగంలో చేరారు. 1947 లో ప్రభుత్వ

న్యాయశాఖకు డిప్యూటీ సెక్రటరీ అయి, 1949 లో సెక్రటరీ అయి, 1951 లో రాజీనామా యిచ్చి, కాంగ్రెసు అభ్యర్థిగా తెనాలి నియోజక వర్గంనుంచి పార్లమెంటుకు ఎన్నుకోబడినారు. అడ్రసు, తెనాలి.

రజనీకాంతరావు, బాలాంత్రపు; జననం, 1920 జనవరి 29 ; 1940 లో ఆంధ్ర యూనివర్శిటీ కాలేజి బి. ఏ. ఆనర్సు డిగ్రీ పొందారు. 1942 ఆల్ ఇండియా రేడియోలో చేరారు. 1944 నుంచీ ప్రోగ్రామ్సు అసిస్టెంటుగా వున్నారు. చాలాపాటలు, నాటకాలు స్వయంగా వ్రాసి, బ్రాడ్‌కాస్టు చేశారు. చాలా తెలుగు ఫిలిములకు పాటలను వ్రాశారు. వీరిపాటలపుస్తకం 'శతపత్రసుందరి'కి మదరాసు ప్రభుత్వం బహుమతిఇచ్చింది. అడ్రసు, ఆలిండియా రేడియో, ఎగ్మూరు.

రమాకాంతరావు దామర్ల; జననం, 1913 జూన్: ఎం. ఏ. (ఆంధ్ర యూనివర్శిటీ, 1935); జనవాణిలో సబ్-ఎడిటర్ 1936-37; తరువాత పొగాకు వ్యాపారంలో ప్రవేశించారు. ఆంధ్రదేశంలో, చేనేత పనివారి సంఘాన్ని చాలా ముందుకు తీసుకువచ్చారు. మదరాసురాష్ట్ర చేనేత పనివారి కాంగ్రెసు అధ్యక్షుడు. 1942.48; మదరాసు రాష్ట్ర చేనేత సహకారసంఘ డైరెక్టర్. 1939 నుంచి; రాష్ట్ర ప్రభుత్వ నూలు సలహా సంఘంలో సభ్యుడు, 1942; రాష్ట్ర ప్రభుత్వ చేనేత పనివారి జీత నిర్ణయ సంఘంలో సభ్యుడు, 1947. ఆలిండియా హాండ్‌లూమ్ బోర్డు మెంబరు 1949 నుంచి; భారత్ వారపత్రిక సంపాదకుడు, ఆంధ్రరాష్ట్ర చేనేత పనివారి కోఆపరేటివ్ సొసైటీ ప్రెసిడెంట్, 1953 అక్టోబరు 1 నుంచి, అడ్రసు మంగళగిరి, గుంటూరు జిల్లా.

రణదివ్, బాలచంద్ర త్ర్యంబక్ , జననం, 1904 డిసెంబర్ 19. 1928 నుంచి కమ్యూనిస్టు ఉద్యమంలో పాల్గొంటున్నారు. 1929-30 లో 1929 లో, 1934 లో జెయిలుకు వెళ్లారు. 1940 లో అరెస్టు చేయబడి రెండేళ్లు నిర్బంధంలో వుంచబడినారు, 1948-50 ఇండియాలోని కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి.

అడ్రసు, రాజభవన్, శాండ్ హర్‌స్టు రోడ్, బొంబాయి-4.

రాఘవరావు, న్యాయపతి. జననం 1905 ఏప్రిల్ 13, బ. ఏ. (విజయ నగరం), 1921 లో అసహాయోద్యమంలో చేరి చదువు వదలివేశారు. 1931 వరకూ కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. హిందూ పత్రిక సంపాదక వర్గంలో పని చేస్తూ 1945 లో పిల్లలకొరకు మొట్టమొదటిగా 'బాల' పత్రికను స్థాపించి ప్రస్తుతం ఆపత్రికను నడుపుతున్నారు. పిల్లల కొరకు నాటికలు, పాటలు వ్రాసి రేడియో పిల్లల ప్రోగ్రాములకు గత 11 ఏళ్ళ నుంచి నడుపుతున్నారు. అడ్రస్ ; 38, సల్లివన్ గార్డెన్ వీధి, మైలాపూర్. మద్రాస్-4.

రాఘవయ్య, వెన్నెలకంటి, జననం 1896, పేడరు, 1921 లో కాంగ్రెస్ ఉద్యమంలో చేరి చాలాసార్లు జైయిలుకు వెళ్ళారు. ఏనాదుల ఉద్ధరణ విషయంలో చాలా కృషిచేశారు. ఆదిమవాసులైన ఎరుకల, లంబాడి, కొరవ, యానాది జాతపులకు ఉచిత భోజనవసతి గృహములను స్థాపించారు. రాష్ట్రవ్యవసాయ కూలి సంఘమును స్థాపించారు: దక్షిణ భారత ఆదివాసి సేవకసంఘ అధ్యక్షులు. ప్రధాన మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి 1946-47, అడ్రస్, నెల్లూరు.

రాజగోపాలాచారి, చక్రవర్తి, జననం 1879. 1900లో, సేలంలో అడ్వొకేటుగా ప్రాక్టీస్ ఆరంభించి, సహాయ నిరాకరణోద్యమంలో చేరి, ప్రాక్టిస్ వదలివేశారు. 1921-25 లో కాంగ్రెస్ కార్యదర్శి. చిరకాలం కాంగ్రెస్ వర్కింగు కమిటిలో సభ్యులు, 1946 లో మళ్ళీ వర్కింగు కమిటి సభ్యులుగా నియమింపబడ్డారు 1930-33, తమిళనాడు రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు. 1929 నుంచి అనేకసార్లు జైలుకు వెళ్ళారు. 1937 లో మదరాస్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు, మదరాస్ రాష్ట్ర ప్రధాని, 1937-39, కేంద్ర ప్రభుత్వ పరిశ్రమశాఖా సభ్యులు, 1946 సెప్టెంబరు 2 నుంచి 1947 ఆగస్టు 15 వరకు. పశ్చిమబెంగాల్ గవర్నర్ 1947

ఆగస్టు 15 నుంచి, 1948 జూన్ 21 వరకు : ఇండియా గవర్నర్ జనరల్, 1948 జూన్ 21 నుంచి 1950 జనవరి 26 వరకు : ఇండియా హోం మంత్రి, 1950-51, మదరాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ లో నామినేటెడ్ సభ్యులు, రాష్ట్ర ముఖ్యమంత్రి, 1952 ఏప్రిల్ 10 నుంచి 1953 ఏప్రిల్ 13 వరకు. అడ్రస్, బజాలుల్లా రోడ్, త్యాగరాయ నగర్.

రాజమన్నార్, పాకల వెంకట. జననం, 1901 మే 10, బి. ఎ. (1921) రాష్ట్రమంతటికి ప్రధాన స్థానంతో ప్యాసయారు, బి. ఎల్. మదరాస్ యూనివర్శిటి. తెలుగులో అనేక నాటికలు వ్రాశారు. 1922 లో 'కళ' పత్రిక సంపాదకులు. మదరాస్ అడ్వొకేటు జనరల్. 1944-45, హైకోర్టు జడ్జి, 1935 నుంచి, ప్రధాన న్యాయమూర్తి, 1948 జనవరి నుంచి, అడ్రస్: విక్టోరియా క్రిసెంట్, ఎగ్మూరు మదరాస్.

రాజు, ఎం. టి. (మంతెన తిమ్మరాజు) జననం 1911 అక్టోబరు 5; బి. ఏ., ఆనర్స్ (లండన్); బారెట్లా, 1946 లో ఐ. సి. ఎస్. లో చేరారు. మదరాస్ రాష్ట్రంలో కొంతకాలం. సబ్ కలెక్టరుగా వుండి, 1945-46 లో కేంద్ర ప్రభుత్వ లేబరు శాఖలో డిప్యూటీ సెక్రటరీగా వున్నారు. 1945 లో లండనులో జరిగిన బొగ్గు గనులు, భూమధ్య రవాణాకు సంబంధించిన అంతరాతీయ సభలలో ఇండియా ప్రభుత్వ ప్రతినిధిగా పాల్గొనిరి. 1947 లో మదరాస్ ప్రభుత్వ వ్యవసాయ శాఖ జాయింటు డైరక్టరు గాను, తరువాత పరిశ్రమల శాఖ డైరక్టరుగాను పనిచేశారు. హైదరాబాదు లో ఇండియా ప్రభుత్వ ఏజెంటు జనరల్ సెక్రటరి 1947-48, మదరాస్ ప్రభుత్వ అభివృద్ధిశాఖ డెప్యూటీ సెక్రటరీ, సెక్రటరీ, 1949; మదరాస్ ప్రభుత్వ పరిశ్రమశాఖ డైరక్టరు, 1949 ఆగస్టు నుంచి 1953 అక్టోబరు వరకు, ప్రస్తుతం ఆంధ్ర ప్రభుత్వ రెవిన్యూ శాఖా కార్యదర్శిగా వున్నారు. అడ్రసు, కర్నూలు.

రాజేంద్ర ప్రసాద్, డాక్టర్. జననం, 1884 డిసెంబరు 3; ఎం. ఎ.; ఎం. ఎల్. ఎల్. ఎల్. డి; 1920 దాకా ప్లీడరీ ప్రాక్టిసు చేశారు. చాలా సంవత్సరాలు

బీహారు రాష్ట్ర కాంగ్రెసు అధ్యక్షులు గాంధీజీతో కలసి చంపారణ్య జిల్లాలో రైతుల స్వాతంత్ర్యానికి పనిచేశారు. కాంగ్రెస్ మహాసభ అధ్యక్షులు, 1932, 1934, 1939, 1947; 1942 ఆగస్టు 9 తేదిన అరెస్టు చేయబడి 1943 జూన్ 15 న విడుదల పొందారు. కేంద్రప్రభుత్వ ఆహార శాఖా సభ్యులు 1946 సెప్టెంబరు 2 నుంచి; ఆహారమంత్రి 1947 ఆగస్టు 15 నుంచి, 1949 నవంబరు వరకు. రాజ్యాంగ పరిషత్తు అధ్యక్షులు. 1946 నుంచి 1950 వరకు; భారతరాష్ట్రపతి (ప్రెసిడెంట్), 1950 జనవరి 26 నుంచి. అడ్రస్; రాష్ట్రపతి భవన్, న్యూఢిల్లీ.

రాధాకృష్ణ, డాక్టర్ సర్వేపల్లి; జననం, 1888 సెప్టెంబరు 5. కొంతకాలం మదరాస్ ప్రెసిడెన్సీ కాలేజిలో వేదాంతాచార్యులు. కాశీ విశ్వవిద్యాలయవైస్ ఛాన్సలెరుగా ఉన్నారు. ఆక్స్‌ఫర్డు యూనివర్శిటీలో స్పాల్డింగు ప్రొఫెసర్ ఆఫ్ ఈస్టర్న్ రెలిజియొన్సు, 1936. బ్రిటిషు అకాడెమిలో సభ్యత్వాన్ని పొందిన ప్రథమ భారతీయులు. వేదాంత శాస్త్రంమీద అనేక గ్రంథాలు వ్రాశారు. ఆంధ్రమహాసభ అధ్యక్షులు, 1938. ప్రజాపరిషత్తు సభ్యులు, 1946-49. రష్యాలో ఇండియా రాయబారి 1949-52 ఇండియా వైస్-ప్రెసిడెంట్‌గా 1952 ఏప్రిల్ లో ఎన్నుకోబడినారు. అడ్రస్. 2, కింగ్ ఎడ్వర్డ్ రోడ్, న్యూఢిల్లీ.

రామకృష్ణ, వెలగపూడి, జననం. 4 మార్చి 1896; ఎం. ఏ., బి. ఎస్. సి, సి. ఎడింబరో, లండన్, ఆక్స్‌ఫర్డ్ యూనివర్శిటీలలో. 1921 లో ఐ సి. ఎస్. లో చేరి సబ్ కలెక్టర్, కలెక్టర్; పరిశ్రమల శాఖ డైరెక్టర్, లేబర్ కమీషనర్, నేషనల్ సర్వీస్ లేబర్ ట్రిబ్యునల్ చైర్మన్, రిసెటిల్మెంట్ అండ్ ఎంప్లాయిమెంట్ శాఖ డైరెక్టర్‌గాను ఉద్యోగాలను నిర్వహించి, మదరాసు ప్రభుత్వ డెవలప్ మెంట్ కమిషనర్‌గా వుండగా 1947 లో పదవినుంచి రిటైరయారు. కేంద్ర శాసన సభలో సభ్యులుగా నామినేట్ చేయబడినారు. 1952 లో మదరాసు అసెంబ్లీ సభ్యులచే కౌన్సిలు

సభ్యులుగా ఎన్నుకోబడినారు. కృషిక్ లోక్ పార్టీ సభ్యులు; యూరప్, అమెరికా, జపాను దేశాలలో చాలాసార్లు సంచారం చేసి వచ్చారు. ఆంధ్ర సిమెంటు కంపెనీ, జయపూర్ సుగర్ కంపెనీ, జయపూర్ మైనింగ్ సిండికేట్, కావేరి సుగర్స్ అండ్ కెమికల్స్ కంపెనీలకు చైర్మన్; కె. సి. పి. లిమిటెడ్ కు మేనేజింగ్ డైరెక్టర్; చైర్మన్, రేడియో అండ్ ఎలక్ట్రికల్స్ లిమిటెడ్; అడ్రస్. 55, పీటర్స్ రోడ్; రాయపేట, మదరాసు-6.

రామకృష్ణరాజు, ఆర్. బి. జననం. 1891 ఫిబ్రవరి 10; 1921 లో బి. ఎల్, పట్టాన్ని పొంది, చిత్తూరులో ప్రాక్టీసు ఆరంభించారు. 1926 నుంచి 1935 వరకు కార్వేటినగరం తాలూకా బోర్డు ప్రెసిడెంటుగాను, చిత్తూరు జిల్లాబోర్డు ఉపాధ్యక్షులుగాను వున్నారు. మదరాస్ అసెంబ్లీ సభ్యులు 1937-39. 1940 వ్యక్తి సత్యాగ్రహంలో ఒక ఏడాది జెయిలు. 1942 ఉద్యమంలో 1944 వరకు నిర్బంధంలో వుంచబడినారు. మదరాసుకౌన్సిలు సభ్యులు 1946-52; మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు అధ్యక్షులు 1946-52, అడ్రస్, చిత్తూరు,

రామకృష్ణరావు, బూర్గుల జననం, 15 మార్చి 1899. బొంబాయి విశ్వవిద్యాలయంలో న్యాయవాది పట్టాన్ని పొంది, 1924 లో హైదరాబాదుకు వచ్చి ప్రాక్టీస్ పెట్టబోగా ఖద్దరు కట్టుకున్నారనే కారణంచేత రెసిడెన్సీ కోర్టులో వీరికి అనుమతి లభించలేదు. ఏడాదిన్నర అనంతరం ప్రాక్టీసు ప్రారంభించారు. 1948 తరువాత మూడుసార్లు అరెస్టయారు. రెండుసార్లు శిక్షలేకుండా విడుదల; మూడోసారి మూడు మాసాల ఖైదు. సంస్థాన, కాంగ్రెసు కార్యవర్గ సభ్యులు, హైదరాబాదు ప్రభుత్వ రెవిన్యూ విద్యాశాఖ మంత్రి 1950-52; ముఖ్య మంత్రి 1952 నుంచి; అడ్రస్: హైదరాబాద్ (దక్కను)

రామచంద్రమూర్తి, ఏలేశ్వరపు జననం, 1914 జనవరి, ఎం. ఎ. (మదరాస్) 1935; ఇండియన్ బాంకర్స్ ఇన్స్టిట్యూటులో సర్టిఫికెటు మెంబరు (1939); 1936 నుంచి జాయింటు స్టాకు బ్యాంకు

లలో పనిచేస్తున్నారు. ఆంధ్ర బ్యాంకిలో 1946 నుంచి అసిస్టెంటు మేనేజరుగాను, 1950 జులై నుంచి జనరల్ మేనేజరుగాను పనిచేస్తున్నారు. అడ్రస్: ఆంధ్రబ్యాంక్ లిమిటెడ్, మచిలీపట్టణం.

రామచంద్రరావు, తేకుమళ్ళ; జననం, 1905 అక్టోబర్ 16; ఎం.ఏ., బి. ఎల్., వకీలు (బందరు). ఆంధ్రదేశ గ్రంధాలయ సేవక మహాసంఘ ప్రధాన కార్యదర్శి; అకాడెమీ ఆఫ్ కల్చర్ అధ్యక్షులు (1934-49); ఆంధ్ర మహాసభ ప్రధాన కార్యదర్శి 1942, ఆంధ్రమహాసభ కార్యవర్గ సభ్యులు 1940 నుంచి; ఆంధ్ర విద్యార్థి మహాసభ ప్రధాన కార్యదర్శి 1927 28; చెన్నపురి ఆంధ్ర విద్యార్థి సంఘకార్యదర్శి 1926-27. రచనలు : తృష్ణా మార్పణము, ప్రణయచాంచల్యము, వీరయువతులు, (నవలలు) కనకదాసు. (నాటకం) బ్రిటిష్‌దేశ గ్రంథాలయోద్యమ చరిత్రము. గ్రంథవరణము, ఆంధ్రదేశ గ్రంథాలయోద్యమ చరిత్ర (ఇంగ్లీషు). మొదలైనవి. బందరులో వయోజన పాఠశాలను, జానపదకళాశాలను 1948 ఆగస్టు 22 నుంచి నడుపుతున్నారు. అడ్రెస్ ; మచిలీపట్టణం.

రామచంద్రరావు, డాక్టర్ ధన్వాడ ఎస్., లండనులో వైద్యవిద్యను అభ్యసించి, లండనుహాస్పిటలులో కొంతకాలం పనిచేశారు. మదరాస్ పచ్చయప్ప కాలేజిలో అర్థికశాస్త్ర ప్రొఫెసర్ గా ఆరేళ్లు పనిచేశారు; బెజవాడ మునిసిపల్ చైర్మన్ గాను, కృష్ణాజిల్లా బోర్డు ప్రెసిడెంటుగాను, జిల్లా విద్యాసంఘాధ్యక్షులుగాను, పశ్చిమ కృష్ణా జిల్లా కాంగ్రెస్ అధ్యక్షులుగాను ఆంధ్ర స్వరాజ్యపార్టీ కార్యదర్శిగాను వున్నారు. అఖిల భారత కాంగ్రెస్ కమిటిలో చాలకాలం సభ్యులు; ఆంధ్రరాష్ట్ర మెడికల్ అసోసియేషనుకు మూడుసార్లు ప్రెసిడెంటు; మైసూరు అసెంబ్లీలోను, కౌన్సిలులోను సభ్యులునా వున్నారు. మదరాసు-చెంగల్పట్ క్రైస్తవ నియోజక వర్గం నుంచి మదరాసు అసెంబ్లీ సభ్యులు 1946-52 లో. అడ్రసు : ఆనంద విహార్, హారింగ్టన్ రోడ్, చటపట్, మదరాసు.

రామచంద్రారెడ్డి, బెజవాడ,

జననం, 1894 నవంబర్ 24. బి. ఏ. పచ్చయప్ప కాలేజి, 1919. నెల్లూరు జిల్లాబోర్డు ప్రెసిడెంట్; 1929-30. నెల్లూరుజిల్లా ఎడ్యుకేషనల్ కౌన్సిల్ ప్రెసిడెంటు 1927-30, మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ మెంబరు 1927నుంచి1937 వరకు. ఈ కౌన్సిలు ప్రెసిడెంట్ 1930-37. ఆంధ్ర యూనివర్సిటి సిండికేటు మెంబరు, 1942-46. మదరాసురాష్ట్ర భూస్వాముల సంఘ అధ్యక్షుడు, ఆంధ్రనాటక కళాపరిషత్తు అధ్యక్షుడు, 1945. పార్లమెంటు సభ్యులు 1952 నుంచి అడ్రసు:బుచ్చిరెడ్డిపాలెం, నెల్లూరు జిల్లా.

రామమూర్తి, సర్ శొంఠి వెంకట. జననం : 1888 ఆగస్టు1. 1912 లో ఐ. సి. ఎస్. లో చేరి, మదరాసు రాష్ట్రంలో చాలా జిల్లాలకు కలెక్టరుగానూ వ్యవసాయ శాఖా డైరెక్టరుగాను పని చేశారు. గవర్నరుకు అడ్వైజర్, 1942-46. ఛీఫ్ సెక్రటరీ. 1946-47. బొంబాయి ఆక్టింగ్ గవర్నర్. 1947. ఉదయపూర్ దివాన్, 1947-48. అడ్రసు, గ్రీమ్సురోడ్, కెతిడ్రల్, మదరాసు.

రామస్వామి, దిగుమర్తి వెంకట : వయస్సు, 60. బి. ఏ. బి. ఎల్. మదరాసు యూనివర్సిటీ. విశాఖపట్టణం జిల్లాకోర్టులో ప్రాక్టీసు వదలి, సత్యాగ్రహోద్యమంలో జెయిలుకు వెళ్లారు. బందరు జాతీయ కళాశాలకు కొంతకాలం ప్రిన్సిపాల్. ఆంధ్ర యూనివర్సిటి సెనేటులో 18 ఏళ్లుగా సభ్యులు. మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1937-39, 1946-52. అడ్రసు : మహారాణిపేట, విశాఖపట్టణంజిల్లా.

రామస్వామి అయ్యర్, సర్ సి. పి. జననం 12, నవంబరు 1879; ప్లీడరు వృత్తిలో ప్రవేశం 1908; కాంగ్రెసు కార్యదర్శి 1917-18. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యత్వం, 1921; మదరాసు అడ్వొకేట్ జనరల్ 1920; మదరాసు గవర్నమెంటు లా మెంబరు, 1923-28; రౌండు టేబిల్ కాన్ఫరెన్సుకు ప్రతినిధి, 1930; కేంద్రప్రభుత్వ కౌన్సిలు మెంబరు, 1933; తిరువాన్కూరు దివాన్ 1936 నుండి 1947 సెప్టెం

బర్ 19 వరకు; అడ్రెసు: దిగ్రోవు; మైలాపూర్, మదరాస్.

రామస్వామి చౌదరి, శరణు; జననం; 1907 ఫిబ్రవరి 4. 1920 నుండి గ్రంథాలయోద్యమంలో పని చేస్తున్నారు. చాల సంవత్సరములు ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘము నకు ఉపాధ్యక్షులుగను, గుంటూరు జిల్లా గ్రంథాలయ సంఘమునకు అధ్యక్షులుగను, కార్యదర్శిగను వున్నారు. విశాఖపట్టణంలో జరిగిన ఆంధ్రదేశ గ్రంథాలయ సేవక సభకు అధ్యక్షులు. 1920 నుంచి కాంగ్రెసుతో సంబంధం వుంది. 1921 నుంచి 1942 వరకు, కాంగ్రెసు ఉద్యమము లన్నిటిలోను పాల్గొని, మొత్తం 5½ ఏండ్లు జెయిలులో గడిపారు. గుంటూరు జిల్లా బోర్డు సభ్యులు, 1950 మే నుండి. అడ్రెసు: అమృతలూరు, తెనాలి తాలూకా.

రామస్వామి మొదలియార్, సర్ ఎ. జననం, 1887 అక్టోబర్ 14. (సర్. ఎ. లక్ష్మణస్వామి మొదలియారూ, యీయన నా కవలలు). మదరాస్ క్రిస్టియన్ కాలేజిలోను; లా కాలేజిలోను చదివారు మదరాస్ లెజిస్లేటివ్ కౌన్సిలు మెంబరు 1920-26. మదరాస్ మేయరు, 1928-30. కేంద్రశాసనసభ సభ్యులు; 1931-34. రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సుకు ప్రతినిధిగా వెళ్లారు. వైస్రాయి ఎగ్జిక్యూటివ్ కౌన్సిలు మెంబరు, 1939-42. యునైటెడ్ నేషన్సు ఎకనమిక్ అండ్ సోషల్ కౌన్సిలు అధ్యక్షులు. 1946. ఇండియా తరపున అనేక అంతర్జాతీయ సమితిలలో పాల్గొన్నారు. మైసూరు దివాను, 1946-1949. అడ్రెస్; మదరాస్.

రామారావు, రావు బహదూర్ అవసరాల; జననం. 15 అక్టోబర్ 1890; బి. ఏ. 1910; బి. ఎల్. 1912; 1916 నుంచి రాజమండ్రిలో అడ్వొకేటుగా ప్రాక్టీస్ చేస్తున్నారు. తూర్పు గోదావరి పబ్లిక్ ప్రాసెక్యూటర్ 1926-35: రాజమండ్రి బార్ అసోసియేషన్ ప్రెసిడెంటు, 1923-46; జిల్లా స్కౌట్ కమిషనర్ 1929 నుంచి, రాజమండ్రి థియోసాఫికల్ సొసైటీ ప్రెసిడెంటు, 1925 నుంచి. అడ్రెస్: రాజమండ్రి.

రామారావు, కోటంరాజు;

జననం. 1896 నవంబరు 9; బి. ఎ. (మదరాస్); అనేక పత్రికలలో సబ్ - ఎడిటర్‌గా పని చేశారు. వాటిలో ముఖ్యమైనవి. టైమ్స్ ఆఫ్ ఇండియా, పయొనిర్, లీడర్. న్యూస్ ఎడిటర్‌గా ఇండియన్ డెయిలీ మెయిల్, పీపుల్, హిందూస్థాన్ టైమ్సు, పత్రికలలో; ఎడిటర్, ఫ్రీ ప్రెస్ జర్నలు, స్వరాజ్య, ఫ్రీ ఇండియా. డాన్, నేషనల్ హెరాల్డు సెర్చ్‌లైట్; 1945లో గాంధిజీతో వుండి, అనేక ప్రధాన పత్రికలకు విలేఖరి; చాలా పత్రికలకు స్వతంత్ర రచనలు పంపుదురు. పండిట్ నెహ్రూతో అమెరికా, కెనాడాలో సంచారం చేశారు. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు సభ్యులు, 1952-54; అడ్రసు, న్యూఢిల్లి.

రామిరెడ్డి, గంగసాని; జననం, 1899 లో చిత్తూరు జిల్లా ఓబుళం పల్లెలో; విద్యాభ్యాసం, మదనపల్లి అనంతపురములలో. 1923 లో రెవిన్యూ ఇన్స్పెక్టర్‌గా ఉద్యోగంలో చేరి, 1950 లో కలెక్టరు పదవికివచ్చారు. 1953 డిసెంబరు నుంచి, ఆంధ్రరాష్ట్ర పబ్లిక్ సర్వీసెస్ కమిషన్ మెంబరుగా నియమింపబడినారు. అడ్రసు; మదరాసు.

రామేశం, సర్ వేపా, జననం, 1875 జులై 27; బి. ఏ., బి. ఎల్. (మదరాసు), 1892 లో బి. ఏ. లో ఫస్టుక్లాసులో ప్యాసయారు. 1896 లో హైకోర్టు వకీలుగా ప్రాక్టీసు ప్రారంభించారు. 1916-20 లలో గవర్నమెంటు ప్లీడరు. 1920 నవంబరు నుంచి 1935 జులైవరకు హైకోర్టు జడ్జి. 1936-38 లలో రిజర్వు బ్యాంకి మదరాసు బోర్డులో మెంబరు. ఇండియన్ స్కూల్ ఆఫ్ మెడిసిన్ బోర్డు మెంబరు, 1935-48. మదరాసు యూనివర్శిటీ ఫెల్లో 1915-18; 1918-1921. 1930-1940. ఆహా నియమములు, సంతాన నిరోధములను గురించి ఉపన్యాసములను, వ్యాసములను వ్రాసి చాలా ప్రచారం చేశారు. రచనలు, సప్లిమెంట్ ఎలిమెంటరీ జ్యామెట్రీ. ఆంధ్ర క్రోనాలజీ (తేదిలవారిగా దేశ చరిత్ర), సూర్యుని వశములోవుండే గ్రహముల నిరూపణ. అడ్రస్ : మైలాపూర్.

రెడ్డి కె. చెంగల్రాయ :

జననం 1902 మే: బి. ఏ. బి. ఎల్. చిన్నతనంలోనే రాజకీయాలలో ప్రవేశించారు. 1938 వరకు మైసూరు సంస్థాన కాంగ్రెస్ అధ్యక్షులు, నాలుగు సార్లు జైలుకు వెళ్ళారు. 1946 లో మైసూరు కాంగ్రెస్ అధ్యక్షులుగా మళ్ళీ ఎన్నుకోబడి, సంస్థానంలో సత్యాగ్రహాన్ని జయప్రదంగా సాగించారు. మైసూరు ప్రధాన మంత్రి 1947-52, ఇండియా ప్రభుత్వ ఉత్పత్తి శాఖమంత్రి, 1952 మే 13 నుంచి; అడ్రసు న్యూఢిల్లీ.

రెడ్డి, బి. ఎన్. (బొమ్మిరెడ్డి నరసింహారెడ్డి) జననం. 1908 నవంబరు 16. కడపజిల్లా పులివెందల తాలూకా కొత్తపల్లిలో; జి. డి. ఎ. 1935; విద్యార్థిగా వున్నప్పటినుంచీ, నాట్యకళపట్ల అభిమానంతో చాలా నాటకాలలో పాల్గొన్నారు, 1937 లో ఫిలింపరిశ్రమలో ప్రవేశించి, హెచ్. ఎం. రెడ్డిగారితో కలిసి రోహిణి పిక్చర్స్ స్థాపించి, జాయింటు ప్రొడ్యూసరుగా గృహలక్ష్మి నిర్మాణంలో పాల్గొన్నారు. 1938 లో వాహిని పిక్చర్సును స్థాపించి, అప్పటి నుంచీ ఆకంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్ 1938-49. వీరు డైరెక్టు చేసిన చిత్రాలు: వందేమాతరం, సుమంగళి, దేవత, స్వర్గసీమ, మల్లీశ్వరి. అడ్రసు: 16 విజయ రాఘవాచార రోడ్, త్యాగరాయ నగర్, మదరాస్.

లచ్చన్న, గౌతు; జననం, 16 ఆగస్టు 1909 (బారువలో); 1930 ఉప్పు సత్యాగ్రహంనుంచీ కాంగ్రెసు ఉద్యమాలలో పాల్గొని, అనేకసార్లు జైలుకు వెళ్ళారు. 1937 లో ఇచ్ఛాపురంలో రైతాంగ విద్యాలయాన్ని నిర్వహించారు. 1940 లో పలాసాలో జరిగిన అఖిల భారత కిసాన్ కాంగ్రెసుకు ఆహ్వాన సంఘానికి కార్యదర్శి. 1940 లో ప్రభుత్వపు నిర్బంధపు ఉత్తరువును ఉల్లంఘించి, కనపడకుండా, కాంగ్రెసు ఉద్యమం సాగించుతూ, 1942 లో పట్టుబడి, ఏడాది శిక్షబడ్డారు. తరువాత 1945 వరకు నిర్బంధంలో వుంచబడినారు. ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు ఆంధ్ర శాఖకు అధ్యక్షులు. మద

రాసు శాసనసభ సభ్యులు, 1948-52. 1952 నుంచి మళ్ళీ. ఆంధ్ర ప్రభుత్వవ్యవసాయ శాఖా మంత్రి 1953 నవంబరు 7 నుంచి 1954 జనవరి 6 వరకు. అడ్రసు: బారువ.

లక్ష్మణస్వామి మొదలియార్ సర్ ఎ. జననం, 1887 అక్టోబరు 14. మదరాస్ క్రిస్టియన్ కాలేజిలోను, మెడికల్ కాలేజిలోను విద్యాభ్యాసం. ప్రసూతి వైద్యనిపుణులు. స్త్రీల ఆస్పత్రి సూపరింటెండెంటు, 1934-42. మదరాస్ మెడికల్ కాలేజి ప్రిన్సిపాల్, 1930-52. మదరాసు యూనివర్శిటి వైస్‌చాన్సెలర్, 1942 నుంచి, మదరాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు 1946 నుంచి. సర్ బిరుదు 1945 లో పొందారు. అడ్రస్: 'కెన్సింగ్టన్' పూనమల్లి హైరోడ్ కీల్పాక్, మదరాసు.

లక్ష్మీనారాయణ, వున్నవ. జననం, 1877 డిసెంబరు 4. బారిస్టర్ (డబ్లిన్). 1902లో గుంటూరులో వీరున్నూ, వీరి సతీమణిన్నీ వితంతు శరణాలయాన్ని స్థాపించి 39 వితంతు వివాహాలు చేశారు. 1921 లో జాతీయోద్యమంలో ప్రముఖపాత్ర వహించారు. ఆంధ్రదేశంలో ఆటవీ సత్యాగ్రహాన్ని జయప్రదంగా నడిపారు. 1921-22 1930, 1942, 1943 లలో జెయిలుకు వెళ్ళారు. 1922 లలో వీరు గుంటూరులో శారదానికేతాన్ని స్థాపించి నిర్వహిస్తున్నారు. ఆంధ్రోద్యమమును ప్రారంభించిన వారిలో లక్ష్మీనారాయణగారొకరు 1913 లో బాపట్లలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభ ఆహ్వానసంఘ కార్యదర్శులు. 1922 లో చిత్తూరులో జరిగిన ఆంధ్రరాష్ట్ర కాన్ఫరెన్సుకు అధ్యక్షులు. వీరి రచనలలో ముఖ్యమైనవి: మాలపల్లి, నాయకురాలు, తిక్కన్న, భావతరంగాలు, స్వరాజ్య సోది, బుడబుక్కలుల జోస్యం; అడ్రసు, బ్రాడీపేట, గుంటూరు.

లక్ష్మీపతి, డాక్టర్ ఆచంట; జననం, మార్చి 3, 1880, బి. ఎ., 1904 (రాజమండ్రి; ఎం. బి. పి. ఎం. (1909) మదరాసు; మదరాసులో వైద్యవృత్తి ప్రారంభం. 1910; విజ్ఞానచంద్రికా గ్రంథ

మండలి మేనేజరుగాను, తెలుగు అకడెమీ కార్యదర్శిగాను, తెలుగులో అనేక గ్రంథాలను ప్రకటించారు. పండిట్ డి. గోపాలాచార్యులవారివద్ద 1914-19 లలో ఆయుర్వేదాన్ని అభ్యసించారు. మదరాస్ ఆయుర్వేద కళాశాల ప్రిన్సిపాల్ 1920-28; భిషగ్రత్న బిరుదును 1924 లో పొందారు. అఖిలభారత ఆయుర్వేద కాంగ్రెస్ అధ్యక్షులు, 1933, 1947; గాంధిజీ కోరికపై సేవాగ్రాంలో 1939 లో కొంతకాలం వున్నారు. ఆయుర్వేదోద్ధారక బిరుదు 1944 లో పొందారు. గ్రామవైద్యుల పరీక్షకులు, 1950 (మదరాస్); గ్రామపునర్నిర్మాణంలో అభిమానం ఎక్కువ; అవడి ఆరోగ్యాశ్రమం మేనేజింగు డైరెక్టర్; రచన వ్యాయామశాస్త్రం; సంపాదకులు, ఆయుర్వేదం (తెలుగు); అడ్రస్: 43, హారిస్‌రోడ్, మౌంట్‌రోడ్, మదరాస్.

లాల్ బహాదుర్‌శాస్త్రి; జననం, 1904; కాశీవిద్యాపీఠంలో చదివారు. 17 వ ఏటినుంచి స్వరాజోద్యమంలో చేరి, చాలాసార్లు జెయిలుకు వెళ్ళారు. ఉత్తర ప్రదేశ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1935-38; ఉత్తర ప్రదేశ శాసనసభ సభ్యులు, 1937-38; 1947-52; ప్రధాన మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి, 1947-52; అఖిలభారత కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి; 1951 నుంచి ఇండియా ప్రభుత్వ రైల్వేలమంత్రి 1952 మే 13 నుంచి, అడ్రసు, న్యూఢిల్లీ.

లింగరాజు, క్రొవ్విడి; జననం, నవంబర్, 3, 1904; విద్యార్థిగా వుండగానే, 1921 లో కాంగ్రెసు ఉద్యమంలో చేరారు; చాలాసార్లు జెయిలుకు వెళ్లారు. 'కాంగ్రెసు' పత్రిక సహాయ సంపాదకులుగాను, సంపాదకులుగాను పని చేశారు. మదరాసు అసెంబ్లీ సభ్యులు; 1946-52. రెవిన్యూ మంత్రికి పార్లమెంటరీ కార్యదర్శి 1956 జూన్ నుంచి 1947 మార్చి వరకు; ప్రజాపత్రిక జాయింట్ ఎడిటర్, 1953 ఫిబ్రవరి నుంచి 1953 జూన్ వరకు. రచన, అమ్మ; అడ్రస్: రాజమండ్రి.

విజయ ఆనంద్, డాక్టర్; విజయనగరం మహారాజకుమార్;

కాశీ జమీందారీల యజమాని; జననం. 1905 డిశెంబర్ 28. విజయనగర సంస్థాన రాజవంశీకులు; క్రికెట్ ఆటలో నేర్పరి; 1926 లో ఇంగ్లండుకు వెళ్లిన భారతీయ క్రికెట్ జట్టు నాయకులు. యు. పి. శాసనసభ సభ్యులు, 1934-36; 1937-46. కేంద్ర శాసనసభ సభ్యులు; 1945-47; ఆంధ్రమహా సభాధ్యక్షులు, 1940-46. సర్ బిరుదును 1947 లో త్యజించారు; అఖిల భారత క్షత్రియమహాసభ అధ్యక్షులు. ఉత్తర ప్రదేశ లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు 1952 నుంచి. అడ్రస్ : బెనారస్.

విజయలక్ష్మి పండిట్ శ్రీమతి, జననం 1900 ఆగస్టు 18. రంజిత్ సీతారాం పండిట్‌తో వివాహం, 1921. యు. పి. అసెంబ్లీ సభ్యురాలు 1937. యు. పి. ఆరోగ్య శాఖామంత్రి 1937-39. అఖిల భారత మహిళాసభ అధ్యక్షురాలు 1940-42. కాంగ్రెస్ ఉద్యమంలో మూడుసార్లు జైలుకు వెళ్ళారు, 1946-57. రష్యాలో భారతదేశపు రాయబారి, 1947-49. అమెరికాలో ఇండియా రాయబారి, 1948-1951 నవంబరు; పార్లమెంటు సభ్యురాలు. యునైటెడ్ నేషన్స్ జనరల్ అసెంబ్లీ ప్రెసిడెంట్ 1953 54; అడ్రసు, అలహాబాద్.

వివేకానందమూర్తి, చిర్రావూరి; జననం, 1898; పెద్దాపురం; రాజమండ్రిలలో విద్యాభ్యాసం; 1918లో రెవిన్యూబోర్డు ఉద్యోగంలో చేరారు. 1929 లో డిప్యూటి తాసిల్దారుగా సేలంజిల్లా వెళ్ళారు. 1942 లో డిప్యూటి కలెక్టర్; 1947 నుంచి 1953 వరకు జిల్లా కలెక్టరుగా పనిచేసి రిటైరయారు. 1953 డిసెంబరు 3 నుంచి, ఆంధ్ర రాష్ట్ర పబ్లిక్ సర్వీసెస్ కమిషన్ చైర్మనుగా నియమింప బడినారు. అడ్రసు, మదరాసు.

విశ్వనాద్, డాక్టర్ భాగవతుల జననం, 1889. జనవరి 1. 1934 వరకు ప్రధాన వ్యవసాయ రసాయనశాస్త్రి; కోయంబత్తూరు. ఇంపీరియల్ అగ్రికల్చరల్ రిసెర్చి ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్ 1934-44. మదరాస్ రాష్ట్ర వ్యవసాయ శాఖ డైరెక్టర్, 1944-47. బెనారెస్ వ్యవసాయకాలేజి ప్రిన్సిపాల్ 1947-48. రాజస్థాన్ వ్యవ

సాయశాఖ డైరక్టరు 1949; యునైటెడ్ నేషన్సు ఆహార వ్యవసాయ సమితి తరఫున సలహాదారుగా చైనాలో 1948 లో పని చేశారు. ప్రస్తుతం ఇండియా ప్రభుత్వపు వ్యవసాయ మంత్రివర్గములో సలహాదారుగా వున్నారు. అడ్రస్: 84-85, డబ్ల్యు. ఇ. ఏరియా, పూనా రోడ్; ఢిల్లి-5.

విశ్వనాథం, తెన్నేటి. జననం 1896. బి. ఎల్. త్రివేండ్రం. విశాఖపట్టణం జిల్లా కాంగ్రెస్ కమిటీకి చిరకాలం అధ్యక్షులు. 1937 లో మదరాసు అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. ప్రభుత్వపార్లమెంటరీ సెక్రటరీ, 1937-39. 1946 లో మళ్ళీ అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. ఛీఫ్ పార్లమెంటరీ సెక్రటరీ, 1946-47; మునిసిపల్ చైర్మన్, విశాఖపట్టణం, 1947-51; మదరాసు శాసనసభ సభ్యులు, 1946-52; 1952-53; అసెంబ్లీలో ప్రతికూల పక్షనాయకులు, 1952; 1953 అక్టోబరు 1 నుంచి ఆంధ్ర ప్రభుత్వ ఆర్థిక శాఖామంత్రి. అడ్రసు, కర్నూలు.

వీరభద్రరావు, డాక్టర్ అయ్యగారి; జననం. 1908 అగస్టు 4: ఆంధ్ర యూనివర్సిటీ బి. ఏ. 1927. మదరాసు యూనివర్సిటీ, ఎం. ఎ. 1929. 1931-33 లో మదరాసు యూనివర్సిటీలోనూ, 1933-37 లో ఆంధ్ర యూనివర్సిటీలోనూ రిసెర్చి చేశారు. 1935 లో ఆంధ్ర యూనివర్సిటి మొట్టమొదటి పి. హెచ్. డి. (డాక్టరేట్) ను పొందారు. 1937 లో ఆల్ ఇండియా రేడియోలో చేరారు. అడ్రసు: స్టేషన్ డైరెక్టర్ ఆల్ ఇండియా రేడియో, బరోడా.

వీరభద్రస్వామి, పసుమర్తి. జననం, 20 డిసెంబరు 1890. విజయనగరం కాలేజీలో 20 ఏండ్లు ఉపాధ్యాయులుగాను, మునిసిపల్ కౌన్సిలరుగా 25 ఏండ్లు, చైర్మన్‌గా 9 ఏండ్లు వున్నారు. జిల్లా కాంగ్రెసు అధ్యక్షులు. 1936 లోను, 1940 లోను మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులుగా ఎన్నుకోబడినారు. 'మాతృసేవ' పత్రిక సంపాదకులుగా 15 ఏండ్లుగా పని చేస్తున్నారు. గాంధి గ్రామ సౌభాగ్య అశ్రమం స్థాపించి

నిర్మాణ కార్యక్రమాన్ని సాగిస్తు న్నారు. అడ్రస్ : విజయనగరం.

వీరరాఘవరావు; పింగళి జననం : జులై 1906 (కవుత వరం) విద్యాభ్యాసం, బందరు, హైదరాబాదు. 1926 లో బి. ఎస్. సి. లో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులైనారు. 1927 నుంచి 1935 వరకు మదరాస్ అకౌం టెంటు జనరల్ ఆఫీసులోను, 1935 నుంచి 1942 వరకు ఒరిస్సా కంట్రోలరు, ఒరిస్సా సెక్రటరియట్ లోను పని చేసి, 19 3 లో ఇండియన్ ఆడిట్, అకౌంట్సు సర్వీసుకు ప్రమోషను పొందారు. ఇండియా గవర్న మెంట్ ఆర్థిక సప్లయి శాఖలో కాస్ట్ అకౌంట్సు ఆఫీసరు, 1943-45. 1946 నుంచి 1950 మార్చి వరకు, ఇండియా ప్రభుత్వ వాణిజ్యశాఖలలో టారిఫ్ బోర్డు కాస్టు అకౌంట్సు ఆఫీసరు. 1950 మార్చినుంచి బొంబాయిలో సీనియర్ డిప్యూటి అకౌంటెంట్ జనరల్. అడ్రస్, డిప్యూటి అకౌంటెంట్ జనరల్, బొంబాయి.

వెంకటచలం, వారణాసి. జన నం 1906 మార్చి 6. 1930, 1931, 1932 లలో మొత్తం మూడు సంవత్సరాలు సత్యాగ్ర హోద్యమంలో జైలుకు వెళ్లారు. 1935 నుంచీ ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ మదరాస్ బ్రాంచి మేనే జరు 1944-50 ; హిందూస్థాన్ ఐడి యల్ ఇన్సూరెన్సు కంపెనీ, ఏజెన్సీ సూపరింటెండెంట్, 1951-52; 1952 నవంబరునుంచి ఆంధ్ర ఇన్సూ రెన్సు కంపెనీ మదరాస్ బ్రాంచి మేనేజర్. అడ్రస్ : 24-డి, షెనాయ్‌నగర్, అమింజికరై, మదరాస్.

వెంకటరత్నం, భోగరాజు. జన నం, 1911 ఫిబ్రవరి 4. డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్య గారి కుమారుడు. బందరు జాతీయ కళాశాలలో విద్యాభ్యాసం; భారత లక్ష్మీబ్యాంకి సెక్రటరి 1929-44. మేనేజింగ్ డైరక్టరు, 1944 నుంచి. ప్రెసిడెంటు, మదరాస్ సెంట్రల్ లాండ్ మోర్ట్‌గేజ్ బ్యాంకి; 1949 మార్చినుంచి. డైరె క్టర్; ఇండస్ట్రియల్ ఫైనాన్స్ కార్పొరేషన్, 1948 నుంచి అడ్రస్ : గాంధినగర్, అడయార్, మదరాస్.

వెంకటరంగారెడ్డి, కొండా.

జననం 1891; మహబూబ్ నగరంలో 1910 లో న్యాయవాదిగా వృత్తి ప్రారంభించారు. 1922 లో సంస్థానంలో ఆంధ్ర మహాసభను స్థాపించడానికి కృషి చేశారు. రెండుసార్లు ఆంధ్రమహాసభ అధ్యక్షులుగా ఎన్నుకోబడిరి. 1934లో వేమన గ్రంథాలయాన్ని స్థాపించారు. సంస్థాన ఆంధ్ర మహాసభ అధ్యక్షులు. 1947 లో సంస్థాన సత్యాగ్రహంలో మూడు నెలలు జైలుకు వెళ్ళారు. ప్రస్తుతం హైదరాబాద్ కాంగ్రెస్ అధ్యక్షులు; హైదరాబాదు ఎక్సైజుమంత్రి; అడ్రస్ : శ్రీసదను, ఫలీకాన, హైదరాబాద్.

వెంకట రమణనాయుడు, ఎం. ఎ.; జననం, 1900, మదరాసులో. అడ్వొకేట్ గా ప్రాక్టీసు ప్రారంభించి, మదరాసు సిటీ సివిల్ కోర్టు జడ్జిగా పని చేశారు. తరువాత మదరాసు ఛీఫ్ ప్రెసిడెన్సీ మేజస్ట్రేటుగా నియమింపబడి, 1953 అక్టోబరు 1 నుంచి ఆంధ్ర ప్రభుత్వ న్యాయశాఖ కార్యదర్శిగా నియమింపబడినారు. 1953 డిసెంబరులో ఆంధ్రరాష్ట్ర పబ్లిక్ సర్వీసెస్ కమిషన్ సభ్యులుగా నియమింపబడినారు. అడ్రసు : మదరాసు.

వెంకటరావు, కళా. జననం, 1900 జులై 7. బి. ఏ. చదువుతూ 1929 లో కాంగ్రెస్ ఉద్యమంలో చేరి, చదువు మానేశారు. 1922 లో ఒక సంవత్సరమూ, 1930 లో ఒక సంవత్సరమూ; 1932 లో ఆరు నెలలూ శిక్షపడ్డారు. 1937 లో మదరాస్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకో బడ్డారు. 1941 లో ఆరునెలల శిక్ష, 4 నెలలడిటెన్షన్. 1942లో అరెస్టయి, 1945 లో విడుదల అయారు. 1946 లో మదరాస్ అసెంబ్లీ సభ్యులుగా ఎన్నుకోబడినారు. రెవిన్యూ శాఖా మంత్రి 1947 మార్చినుంచి 1949 జనవరి వరకు. అఖిలభారత కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి 1949-51; పార్లమెంట్ సభ్యులు 1950-51; మదరాసు ఆరోగ్య శాఖమంత్రి 1951 సెప్టెంబరు నుంచి 1952 ఫిబ్రవరి వరకు. అడ్రసు : అమలాపురం.

వెంకటరావు, దామెర్ల; జననం 30 ఏప్రిల్ 1894. ఎం. ఎ. ఎల్. టి. (మదరాసు); 1919 నుంచి

ప్రభుత్వవిద్యాశాఖలో ఉద్యోగం; రాజమండ్రి ప్రభుత్వ కళాశాల, ట్రెయినింగ్ కాలేజి; అనంత పురం కళాశాల, మదరాసు ప్రెసి డెన్సి కళాశాలలో ప్రొఫెసర్. 1949 లో వుద్యోగంనుంచి విర మించారు. ఆంధ్ర సొసయిటీ ఆఫ్ ఇండియన్ ఆర్ట్సుకు స్థాపక కార్య దర్శి; ఆంధ్రేతిహాస పరిశోధక మండలికి సహ కార్యదర్శి; దామెర్ల రామారావు మెమోరియల్ ఆర్టు గ్యాలరీ అండ్ స్కూలుకు సహా ధ్యక్షులు; రావుసాహెబ్ ఆదుర్తి రామారావు విద్యావర్ధక ధర్మసంస్థకు నిర్వాహక ధర్మకర్త; రాజమండ్రిపయోజన విద్యాసమితికి అధ్యక్షులు; మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1952-53; ఆంధ్రవిశ్వకళాపరిషత్ సెనెట్ సభ్యులు. అడ్రసు : దానవాయి పేట, రాజమండ్రి.

వెంకటరెడ్డి కె. (కె. వి. రెడ్డి) జననం, 1 జులై 1912. తాడిపత్రి లో: ప్రెసిడెన్సీ కాలేజిలో 1935 సంవత్సరం బి.యస్.సి. (ఫిజిక్సు) ఆనర్సు డిగ్రీని పొందారు. 1938 లో రోహిణివారి గృహలక్ష్మి ప్రొడక్షన్సులోఅకౌంటెంట్ గా పనిచేశారు. 1938 లో వాహినిలో భాగస్వామిగా చేరి వందేమాత రమ్, సుమంగళీ, 'దేవత' లో ప్రొడ క్షన్ ఎగ్జిక్యూటివ్ గా పనిచేశారు. భక్తపోతన, యోగివేమన, గుణ సుందరి కథ, పాతాళభైరవి, డైరక్టుచేశారు. అడ్రసు: 15, విజయ రాఘవాచారి రోడ్, త్యాగరాయ నగర్, మదరాస్.

వెంకటరెడ్డి, ఆర్. జననం, ఫిబ్రవరి 10, 1899; 1921 లో బి. ఏ. ప్యాసయి, ఒక సంవత్సరం ఉపాధ్యాయులుగా పనిచేసి, 1942 లో బి. ఎల్. ప్యాసయి, చిత్తూ రులో ప్రాక్టీసు పెట్టారు. జిల్లా కాంగ్రెస్ సెక్రటరీ, 1930-37, చిత్తూరు పబ్లిక్ ప్రాసిక్యూటర్; 1938; ఆ పదవికి రాజీనామా యిచ్చి, సత్యాగ్రహోద్యమంలో చేరి జైయిలుకు వెళ్ళారు, కాం గ్రెసు శాసనసభ పార్టీకి కార్య దర్శి, 1947-48; మద్యనిషేధ శాఖామంత్రికిపార్లమెంటరీ కార్య దర్శి, 1947-48; మదరాస్ అసెంబ్లి సభ్యులు, 1948-52, చిత్తూరుజిల్లా కాంగ్రెస్ అధ్య క్షులు, 1948; అడ్రస్. చిత్తూరు.

వెంకట శేషయ్య, నీలంరాజు

జననం 1905 డిసెంబరు 22. 1928 లో పత్రికారచనలో ప్రవేశించారు. మొదట్లో స్వరాజ్యపత్రికలో. 1926 నుంచీ ఆంధ్రపత్రికలో రిపోర్టరుగాను, సహాయ సంపాదకుడుగాను, 1945 వరకు పనిచేశారు. 1933 మొదలు 1935 వరకు "నాట్యకళ" అనే పత్రికకు సంపాదకులు, "ఉషాపరిణయం" అనే చిత్రంలో నటించారు. మదరాస్ నగర జర్నలిస్టులసంఘాధ్యక్షులు 1944 డిసెంబరు నుంచి. ఆంధ్రరాష్ట్ర పత్రికా రచయితల సంఘ కార్యదర్శి, 1946-50. మదరాస్ ఫిలిం సెన్సారుబోర్డు సభ్యులు 1947. ఆంధ్రప్రభ అసిస్టెంట్ ఎడిటర్ 1949 ఏప్రిల్ నుంచి, అడ్రసు: షెనాయ్ నగర్, మదరాసు.

వెంకటస్వామి నాయుడు, ద్వారం; జననం; 1893; ప్రసిద్ధాంధ్ర ఫిడేలు గాయకులు, విజయనగరం సంగీత కలాశాల ప్రిన్సిపాల్. 1924 లో 'గాంధర్వ విద్యాభూషణ' బిరుదాన్ని పొందారు. 1935 లో జయపురం మహారాజాగారి కనక కంకణాన్ని పొందారు. తిరువాన్కూరు, మైసూరు మహారాజుల మన్ననలనుపొందారు. 1949 మార్చి 26 న మదరాసులో పౌర ప్రముఖులచే సన్మానింపబడినారు. 1953 మార్చి 15 న రాష్ట్రపతి రాజేంద్రప్రసాద్ వీరికి సన్మానంచేసి, బహూకరణ ఇచ్చారు. అడ్రసు: విజయనగరం.

వెంకటేశ్వరరావు, నార్ల. జననం, 1908 డిసెంబరు 1. బి.ఎం.(బందరు) 1934. విద్యార్థిగా వుండగానే కృష్ణా పత్రికలో పని చేస్తూ వుండేవారు. 1935 లో స్వరాజ్యపత్రికలో పనిచేశారు. జనవాణి సబ్ ఎడిటర్, 1936-37. ప్రజామిత్ర అసిస్టెంటు ఎడిటర్, 1937-38. ఆంధ్రప్రభ న్యూస్ ఎడిటర్. 1938-42. ఆంధ్రప్రభ ఎడిటర్, 1942 నుంచి. స్వదేశ సంస్థానాలు, నేటి రష్యా, రష్యన్ కథలు, ఆస్ట్రియా ఆక్రమణ; చెక్ రాజ్యవిచ్ఛేదం, పాలస్తీనా మొదలైన రాజకీయ గ్రంథరచయిత. ఇటీవల నాటకరచనలో ఎక్కువ కృషిచేస్తున్నారు. "కొత్తగడ్డ" అనే పేరుతో కొన్ని ఏకాంక నాటికలను ప్రకటించారు. ఆంధ్ర రాష్ట్ర పత్రికా రచయితల సంఘ అధ్యక్షుడు, 1945-48. మదరాసు

ఫిలిం సెన్సార్స్ బోర్డు సభ్యులు 1948-51. అడ్రస్: ఆంధ్రప్రభ మౌంటురోడ్, మదరాస్.

వెంకటేశ్వరశాస్త్రిలు, వావిళ్ల జన్మస్థానం; నెల్లూరుజిల్లా అల్లూరు. చెన్నపట్టణంలో ఎఫ్. ఎ. ప్యాసయినారు. చదువు మానినప్పటినుంచి వీరి తండ్రిగార్లు స్థాపించిన వావిళ్లరామస్వామిశాస్త్రిలు అండ్ సన్సు అను గ్రంథప్రకటన వ్యాపారమును వృద్ధిచేయుటలోను, ప్రజోపయోగ సంస్థలలో చేరి వాటికి సహాయము చేయుటలోను నిమగ్నులైవున్నారు. భాషాభివృద్ధికి వీరు చేసిన గొప్ప సేవకు కృతజ్ఞతగా, వీరికి ఆంధ్ర ప్రజా నాయకులు 'భాషోద్ధారక' అనే బిరుదును ఇచ్చారు. అడ్రస్: 49) తిరువత్తియూర్ హైరోడ్, చాకలపేట, మదరాస్-21.

వెంకటేశ్వర్లు పిల్లలమర్రి; వయస్సు, 40; విజయవాడ వాస్తవ్యులు; మదరాసు అసెంబ్లీ సభ్యులు; 1946-52: ఆంధ్రరాష్ట్రట్రేడ్ యూనియన్ కాంగ్రెసు అధ్యక్షులు. 1947-49; 1948-51 లో నిర్బంధంలో వుంచబడినారు. 1952 లో కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా, జగ్గయ్యపేట నియోజక వర్గంనుంచి అసెంబ్లీకి ఎన్నుకో బడినారు. అడ్రసు: కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు, విజయవాడ.

వెంకటకృష్ణరావు, భావరాజు, జననం, 1896 జూలై 1. బి. ఏ, పచ్చయప్ప కాలేజి. బి. ఎల్. మదరాసు లా కాలేజి. ఫస్టుక్లాసులో ప్యాసయ్యారు. ఏ. ఏ. ఆంధ్ర యూనివర్శిటి. 1920 లో రాజమండ్రిలో లాయరు ప్రాక్టీసు ప్రారంభం. 1921 డిసెంబరులో రాజమహేంద్రవరములో ఆంధ్ర ఇతిహాస పరిశోధక మండలి స్థాపించిన వారిలో ముఖ్యులు. ఇంగ్లీషు భాషలో ఏ హిస్టరీ ఆఫ్ ది ఎర్లీ డైనాస్టిస్ ఆఫ్ ఆంధ్రదేశ ' అను పేరుతో ఆంధ్రదేశ చరిత్రలో ఒక భాగము క్రీ. శ. 200 మొదలు 625 వరకు రచించారు, దీనికే ఆంధ్ర యూనివర్శిటీవారు వీరికి ఎం. ఎ. డిగ్రీని ఇచ్చారు. మదరాసు హిందూ ధర్మాదాయముల బోర్డు కమిషనరు 1943 ఆగస్టు నుంచి 1948 ఆగస్టు వరకు; హైదరాబాదు ప్రభుత్వ ధర్మాదాయశాఖకు స్పెషల్ ఆఫీసరు. అడ్రసు: రాజమండ్రి.

వేమూరెడ్డి, కె, సి. జననం. జనవరి 6; 1908 ; బి.ఎ. బి.ఎల్. అడ్వొకేటుగా ప్రాక్టీసు ప్రారంభం, 1938; 1938 నుంచి కాంగ్రెసులో సభ్యులు; అనంతపురం జిల్లా బోర్డు వుపాధ్యక్షులు, 1940-41; జిల్లా కాంగ్రెసు కమిటి సభ్యులు: నిర్మాణ కార్యక్రమంలో పాల్గొన్నారు. రాయలసీమ మహాజనసభ అధ్యక్షులు, నంద్యాల 1949; అనంతపురం జిల్లాబోర్డు అధ్యక్షులు, 1949-53. మదరాసు అసెంబ్లీ సభ్యులు, 1952 నుంచి అడ్రసు: అనంతపురం.

శంకరరెడ్డి, నాయకంటి. జననం, 1898; కర్నూలు తాలూకా ముడుమాలలో; 1920-21, లో బి. ఎ. సీనియర్ క్లాసు చదువుతూ, సహాయ నిరాకరణోద్యమంలో చేరి చదువు విసర్జించారు. రాష్ట్ర లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యులు, 1937; జిల్లాబోర్డు ప్రెసిడెంట్, 1937-38; స్వరాజ్యోద్యమంలో జెయిలుకు వెళ్లారు. 1947 లో ప్రకాశం మంత్రి మండలిలో, ప్రకాశం గారికి పార్లమెంటరీ సెక్రటరి; ఆంధ్రకాంగ్రెసు కార్యవర్గ సభ్యులు, 1937. 1952 లో కర్నూలు నుంచి అసెంబ్లీకి యెన్నికయినారు. రాష్ట్రప్రభుత్వ స్థానిక పరిపాలనా శాఖమంత్రి 1952 ఏప్రిల్ 19 వ నుంచి 1953 అక్టోబరు 1 వరకు, అడ్రసు, కర్నూలు.

శంభుప్రసాద్, శివలెంక ; జననం 1911 జనవరి 25. 1923-27 లో బందరు జాతీయ కళాశాల, 1928-29 లో అడయారు థియొసాఫికల్ హైస్కూల్, 1936-32 లో శాంతి నికేతనములో చదివారు. 1932 లో ఆంధ్రపత్రికలో సంపాదకీయ శాఖలో ప్రవేశించారు. 1935-38 లలో ఆంధ్ర వార పత్రికను నిర్వహించారు. 1938 లో వీరి మేనమామ, మామగారు అయిన, శ్రీ కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారి మరణానంతరం, ఆంధ్రపత్రిక, ఆంధ్ర వారపత్రిక, భారతిలకు సంపాదకులై, వాటిని నిర్వహిస్తున్నారు. అఖిలభారత పత్రికా సంపాదకుల స్థాయీసంఘ సభ్యులు 1942-43, 1947-49, 1948-51. కౌన్సిల్ ఆఫ్ స్టేట్సు సభ్యులు, 1952 మార్చి నుంచి. అడ్రెస్ : ఆంధ్రపత్రిక ఆఫీసు; 7, తంబుచెట్టివీధి, జి. టి. మదరాసు.

శివరామ కృష్ణయ్య, మద్దూరి. (54 ఏండ్లు). రాజమండ్రి వీరేశ లింగ పాఠశాలలో ఉపాధ్యాయ పదవికి 1921 లో రాజీనామా నిచ్చి, కాంగ్రెసులో ప్రచారము సాగించారు. కాంగ్రెసులో నిర్మాణ కార్యక్రమములలో పాల్గొన్నారు. 1927 నుండి ప్లీడరుగా ప్రాక్టీసు ప్రారంభించి, దేశ సేవకులకు ఎక్కువగా సహాయ పడ్డారు. తూర్పు గోదావరి జిల్లాలోని ప్రధాన కాంగ్రెసు సహాయకులలో ఒకరు. అడ్రసు, ఇన్నీసుపేట, రాజమండ్రి.

శోభనాద్రిశాస్త్రి, దోర్బల; జననం, ఆగస్టు 13, 1898; ఎం.ఏ. మదరాసు యూనివర్శిటీ; 1920 నుంచీ వీరు బ్యాంకింగు వ్యాపారంలో వున్నారు. 1922 లో లండన్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ బ్యాంకర్సు పరీక్షప్యాసయారు. సెంట్రలు బ్యాంకిలో కొంతకాలం పనిచేసి, ఆంధ్రబ్యాంకులో చేరారు. దానిని అభివృద్ధికి తీసుకురావడంలోచాలా కృషిచేసి, తరువాత మళ్ళీ సెంట్రలు బ్యాంకి ఏజెంటుగా చేరి; కోయంబత్తూరు, హైదరాబాదు, మైసూరు నగరాలలో పనిచేశారు. ప్రస్తుతం మదరాసు బ్రాంచికి ఏజెంటు; ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ డైరెక్టరు; అడ్రసు: 51, గోపతి నారాయణ స్వామిచెట్టి రోడ్, త్యాగరాయ నగర్, మదరాసు.

శేషగిరిరావు, డాక్టర్ శిష్టా, జననం, 1907 అక్టోబర్ 5. 1924 వరకు పచ్చయప్ప కాలేజీలో చదివి, తరువాత స్కూలు ఆఫ్ ఇండియన్ మెడిసిన్‌లో చదివి, 1928 లో ఎల్. ఐ. ఎం. డిప్లొమా తీసుకున్నారు. 1928 లో కేసరి కుటీరం మేనేజరుగా చేరారు; ఇప్పుడు ఆసంస్థకు డైరెక్టర్; చాలా పత్రికలలో, వైద్య సలహాలను ప్రచురిస్తూ వుంటారు, "నమ్మ, నమ్మకపో" అనే వీరి సలహాలు: దైనందిన జీవితంలో ఆరోగ్య సూత్రాలుగా చాలా ఉపకరిస్తవి. అడ్రసు: కేసరి కుటీరం, రాయపేట, మదరాస్.

శ్రీధరరావు, ఇరువంటి. జననం, 15 మే 1915. బి. ఎస్. సి; ఇంజనీరింగ్ (బెనారెసు). 1928. ఎ. ఎం. ఐ. ఇ. ఛార్టర్డు ఇంజనీర్; క్రాంప్టన్ ఇంజనీరింగ్ కంపెనీలో అసిస్టెంట్ వర్క్సు మేనేజరుగాను, ధనబాద్ బొగ్గు

గనులలో అసిస్టెంట్ ఇంజనీర్ గాను మధురమీనాక్షి మిల్స్‌లో ఛీఫ్ ఇంజనీర్ గాను, తిరుపతి దేవస్థానం లో ఎలక్ట్రికల్ ఇంజనీర్ గాను పనిచేసి, మదరాసులో కుట్టి అండ్ రావ్ (ఇంజనీర్స్) కంపెనీలో భాగస్తులుగా ఆకంపెనీని స్థాపించారు. ఆ కంపెనీ లిమిటెడ్ కంపెనీ అవగా, దానిలో డైరెక్టరు. 1951 లో ప్రత్యేకంగా శాయనాస్ లిమిటెడ్ అనే ఇంజనీర్ల సంస్థను స్థాపించి దానికి మేనేజింగ్ డైరెక్టర్ గా ఉన్నారు. స్ట్రామెక్ ఇంజనీర్స్‌కు ఈస్టర్న్ టెక్నికల్ లేబరేటరీస్ లిమిటెడ్‌కు కూడా మేనేజింగ్ డైరెక్టరు. 'మాతృసేవ' వారపత్రిక సంపాదకులు. అడ్రస్ : 2, సారంగపాణి వీధి, త్యాగరాయనగర్, మదరాస్.

శ్రీనివాసరావు; శ్రీరంగం. జననం; 1910 జనవరి 2, బి.ఏ., 1931; ఆంధ్ర ప్రభలో సబ్-ఎడిటర్, 1938-42; ఆల్ ఇండియా రేడియోలో 1943; మిలిటరిలో, 1944; పేరుపొందిన తెలుగు కవి; అనేక గీతాలు కాక, వచన రచనలు, పరిణయ రహస్యం, ప్రభవ, వారం వారం. మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు, 1953 నుంచి. అడ్రసు 10, అరుణగిరి ముదలివీధి, మైలాపూర్.

శ్రీ ప్రకాశ; జననం, 1890 ఆగస్టు 3; బారిస్టర్, లీడర్, ఇండిపెండెంట్, ఆజ్ అనే పత్రికల సంపాదకశాఖలో పనిచేశారు; కాశీ విద్యా పీఠ స్థాపకులలో ఒకరు; యు. పి. రాష్ట్ర కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1928-34; ఆలిండియా కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి. 1929-31; కేంద్ర శాసనసభ సభ్యులు, 1935-47; 1930, 1932, 1942 లలో జెయిలుకు వెళ్ళారు. చాలా పుస్తకాలు వ్రాశారు. పాకిస్తాన్‌లో భారత దేశం తరఫున హైకమిషనర్ ఆగష్టు 15, 1947 నుంచి 1949 ఫిబ్రవరి 15 వరకు; అస్సాం గవర్నరు, 1949 ఫిబ్రవరి 16 నుంచి 1950 మే అంతం వరకు; ఇండియా ప్రభుత్వమంత్రి, 1950-52; మదరాసు గవర్నర్, 1952 మార్చినుంచి. అడ్రసు. రాజభవన్-గిండి.

శ్రీ రంగాచార్యులు, ముక్తేవి; జననం, 1912 జూన్ 5; బి. ఏ. ఆంధ్ర; హోమియో డిప్లొమా

హెచ్. ఎల్. యమ్ అండ్ ఎస్.; సైమన్ కమిషన్ బహిష్కరణ సభల్లో జాతీయోద్యమంలో పాల్గొన్నారు. ఆంధ్రరాష్ట్ర హోమియోపతీ వైద్యుల సమ్మేళన సంఘ ప్రధాన కార్యదర్శి, 1949 నుంచి. తూర్పు కృష్ణా జిల్లా ఆంధ్ర మహాసభ ప్రధాన కార్యదర్శి, 1941-54; ఆంధ్ర హోమియోపత్ పత్రిక ఎడిటర్ 1938; జైహింద్ పత్రిక ఎడిటర్ 1947-48; మోటారు ట్రాన్స్‌పోర్టు పత్రిక ఎడిటర్ 1951 నుంచి; ఇతర తెలుగు పత్రికలకు వ్యాసాలు వ్రాస్తూ వుంటారు. అడ్రసు, పెదముత్తేవి, కృష్ణా జిల్లా.

శ్రీరాములు, తాడేపల్లి; జననం, 1907 బందరు వర్తకులు; ఆంధ్ర బ్యాంకు మేనేజింగ్ డైరెక్టర్; 1949 వరకు, ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, హిందూస్తాన్ ఐడియల్ ఇన్సూరెన్సు కంపెనీల డైరక్టరు. అడ్రసు . మచిలీపట్టణం.

సత్యనారాయణరాజు, అల్లూరి; జననం, 1914; చిన్నతనంలోనే జాతీయ యోద్యమంలో చేరి జెయిలుకు వెళ్ళి, జెయిలులోనే హిందీ భాషను బాగా నేర్చుకొని 'వోల్గాసేగంగా' అనే గ్రంథాన్ని తెలుగులోకి తర్జుమా చేశారు. 1933 నుంచీ ఏ. ఐ. సి. సి. సభ్యులు. ఆంధ్రరాష్ట్ర యువజన సంఘ ప్రధాన కార్యదర్శి 1935; దీనికి అధ్యక్షులు, 1936; మద్రాస్ అసెంబ్లీ సభ్యులు 1946-52; కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్ మెంబరు, 1954 నుంచి; అడ్రస్; జన్నారు, పశ్చిమ గోదావరి జిల్లా.

సత్యనారాయణ, కప్పగంతుల; జననం. 1916 జులై 20. జనవాణి సబ్ - ఎడిటర్; 1936 జులై 1937 మార్చి; ఆంధ్ర పత్రిక రిపోర్టర్, 1937 మే-1938 ఆగస్టు; ఆంధ్రప్రభ సబ్ - ఎడిటర్. 1938 ఆగస్టు-1942 ఏప్రిల్; దేశాభిమాని సబ్ ఎడిటర్, 1943 జనవరి-జులై; ఫ్రీప్రెస్ సబ్ ఎడిటర్ 1944 జనవరి-జులై; 1945 జనవరినుంచి ' మెయిల్ '' లో సబ్-ఎడిటర్; ఆంధ్రరాష్ట్ర పత్రికారచయితల సంఘ వర్కింగుకమిటీ మెంబరు 1941-48. ప్రపంచ దర్శిని ఎడిటర్; రచనలు , మాణిక్యం, ఎవరికివారేనా, తెల్లవారు ఝాము పాటలు,

సెలవు, ఋణవిముక్తి అనే కథల సంపుటిలు; కబుర్లు : అడ్రసు : 5, వీరభద్రన్ స్ట్రీట్, మైలాపూర్, మదరాస్ 4.

సత్యనారాయణమూర్తి, తుమ్మలపల్లి—జననం 1918 ఆగస్టు 14. పిప్పర. ప. గోదావరి జిల్లా. విద్యార్థి యువజనోద్యమ నాయకులు. భూస్వాములు, జిలాలో పలుకుబడిగల వ్యాపారస్తులలో ఒకరు. వీరు ఆంధ్ర ప్రదేశ్ యువజన కాంగ్రెసు అధ్యక్షులుగానూ; తాడేపల్లిగూడెం తాలూకా కాంగ్రెసు అధ్యక్షులుగాను, ప. గో. హరిజన సేవాసమితి, ప. గో. భారత స్కౌట్స్ గ్రంథాలయ సంఘం అధ్యక్షులుగానూ వున్నారు. ఆంధ్ర ప్రదేశ కాంగ్రెసు సభ్యులు. ఇదివరలో అఖిలభారత కాంగ్రెసు సభ్యులుగా వున్నారు. అఖిలభారత యువజన కాంగ్రెసు (నాగపూర్) సభకూ, అఖిల ఆసియా యువజన కన్వెన్షన్ (బొంబాయి) కూ వీరు ఆంధ్రబృందానికి నాయకత్వం వహించారు. కవిత్వం: గ్రంథపఠనం, తోటల పెంపకం, వీరిఅభిమాన విషయాలు. చిరునామా : పిప్పర, పశ్చిమ గోదావరిజిల్లా.

సత్యనారాయణ, బొమ్మకంటి, జననం, 7 ఆగస్టు 1916. 1936 లో ఖమ్మంలో సబ్ కలెక్టరు ఆఫీసులో గుమాస్తాగాచేరి, 1944 లో రాజకీయాలలో చేరి ఉద్యోగం విరమించారు. వరంగల్ జిల్లా ఆంధ్ర మహాసభ కార్యదర్శిగా ఉన్నారు. హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు నాయకులలో ఒకరు. ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెసు కార్యవర్గంలో సభ్యులు. హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు వర్కింగు కమిటీ సభ్యులు. అడ్రసు : హైదరాబాదు.

సత్యనారాయణరావు, పెండ్యాల, జననం, 1895; మదరాసులోను, ఆక్స్‌ఫర్డులోను చదివి, 1918 లో ఐ. సి. ఎస్. లో చేరారు. సెంట్రల్ ప్రావిన్సెసులో అసిస్టెంటు కమిషనర్, డిప్యూటీ కమిషనర్ పదవులను నిర్వహించి 1936 లో ఆర్థికశాఖ కార్యదర్శి అయారు. 1939-42 లో నాగపూర్ డివిజన్ కమిషనర్; ఇండియా గవర్నమెంటు ఆహారశాఖకు డైరెక్టర్ జనరల్,

1942-43; సి. పి. రెవిన్యూ ట్రిబ్యునల్ చైర్మన్. 1945-46; సి. పి. ప్రభుత్వ ప్రధాన కార్య దర్శి, 1946-48: జోధపూర్ సంస్థాన దివాన్, 1948-49: మధ్య భారత్ మంత్రి మండలికి సలహాదారు 1952-54; దామోదర్ లోయ అథారిటీ అధిపతి 1954 మార్చినుంచి.

సత్యనారాయణరావు, యండ మూరి; జననం, 1913 మే 21: బి. ఏ, (కాకినాడ); బి. ఇడి. (రాజమండ్రి); తూర్పు గోదావరి జిల్లాలో కొన్నాళ్లు స్కూలు టీచరుగా పనిచేశారు. జనవాణి సబ్-ఎడిటర్ 1937-39; ఆలిం డియా రేడియోలో న్యూసు అనౌ న్సర్ 1939-43; ప్రోగ్రామ్స్ అసిస్టెంట్, ఢిల్లీలోను, మదరాసు లోను 1943-48; ప్రోగ్రామ్స్ అసిస్టెంట్, 1948 జనవరి నుంచి; 1948 జనవరి నుంచి 1949 జనవరి వరకు ప్రోగ్రామ్స్ ఎగ్జిక్యూటివ్ విజయవాడ; 'సత్య', 'శ్రీవా త్సవ' అనే పేర్లతో పత్రికలలో వ్రాస్తారు. అడ్రస్: ఆలిండియా రేడియో, మదరాస్.

సంజీవరెడ్డి, నీలం; జననం, 19 మే 1913; అనంతపురం ఆర్ట్సు కాలేజిలో చదువుతూ, సత్యాగ్రహోద్యమంలో చేరి చదువు మానివేశారు. 1938 లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు, కార్య దర్శిగా ఎన్నుకోబడి, 1940 లో సత్యాగ్రహోద్యమంలో జెయిలుకు వెళ్లేవరకు ఆ పదవిలో వున్నారు. 1946 లో మదరాసు అసెంబ్లీ సభ్యులుగాఎన్నుకోబడినారు. మద రాసు ప్రభుత్వ మద్యనిషేధశాఖా మంత్రి 1949 ఏప్రిల్ 1951 ఏప్రిల్; ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు, 1951 ఏప్రిల్ నుంచి; కౌన్సిల్ ఆఫ్ స్టేట్స్ మెంబరు, 1953-52; ఆంధ్ర ప్రభుత్వ ఉప ముఖ్యమంత్రి, 1953 అక్టోబరు 1 నుంచి; అడ్రసు, కర్నూలు.

సంజీవయ్య, డి. జననం, 14 ఫిబ్రవరి 1921; కర్నూలు జిల్లా పెద్దపాడు; బి. ఎ.. బి. ఎల్. 1950లో పార్లమెంటు సభ్యులుగా ఎన్నుకోబడినా. 1952 లో కర్నూలు రిజర్వుడు స్థానంనుంచి అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. మదరాసు రాష్ట్ర ప్రభుత్వ గృహ నిర్మాణ శాఖామంత్రి 1922ఏప్రిల్ 10 నుంచి 1953 సెప్టెంబర్ 30

వగకు; ఆంధ్ర ప్రభుత్వ ఆరోగ్యశాఖా మంత్రి, 1953 అక్టోబర్ 1 నుంచి; అడ్రస్, కర్నూలు.

సాంబమూర్తి, బులుసు; జననం, 1886 మార్చి 4, కాకినాడలో పేరుపొందిన లాయరుగా వుండి, 1920 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరి ప్రాక్టీసు వదలిపెట్టారు. చాలాసార్లు జైలుకు వెళ్ళారు లాఠీ దెబ్బలు తిన్నారు. కాంగ్రెసు మహాసభ ప్రధాన కార్యదర్శి, 1923; వర్కింగు కమిటీ సభ్యులు, 1922. రాష్ట్ర కాంగ్రెసు కార్యదర్శి 1935-37, మదరాసు అసెంబ్లీ సభ్యులుగా 1937 లో ఎన్నుకోబడ్డారు. మదరాసు అసెంబ్లీ స్పీకరు 1937-39; మదరాసుజిల్లా ఆంధ్ర కాంగ్రెసు కమిటీ అధ్యక్షులు. 1949; అడ్రసు కాకినాడ.

సీతాపతి, డాక్టర్ గిడుగు వెంకట; జననం, 1885 జనవరి 28; బి. ఏ. (1906) మదరాసు: ఎల్. టి. (1908) రాజమండ్రి: పర్లాకిమిడి రాజా కాలేజిలో 1908-1910 లలోను, జయపురం బోర్డు హైస్కూలు హెడ్ మాస్టరుగా 1910-11 లోను, పర్లాకిమిడి కాలేజిలో హిస్టరీ లెక్చరర్ గా 1931-32 లలోను పనిచేశారు. ఆంధ్ర విశ్వకళా పరిషత్ రీసెర్చి ఫెలో, 1931-32: పర్లాకిమిడి మున్సిపల్ కౌన్సిలర్ 1916-29; పర్లాకిమిడి తాలూకా బోర్డు అధ్యక్షులు, 1932-33, గంజాం జిల్లాబోర్డు సభ్యులు, 1932-38: పర్లాకిమిడి తాలూకా మొదలైన ఆంధ్ర ప్రాంతములను ఒరిస్సా రాష్ట్రంలో చేర్చకూడదని ప్రతిఘటించి, 1938 లో ఇంగ్లండుకు వెళ్ళిన ఆంధ్రనాయకులలో ఒకరు. 1939-47 లలో సినిమాలలో నటించారు. 1948 నుంచి తెలుగుభాషా సమితి వారి తెలుగు విజ్ఞాన సర్వస్వమునకు ప్రధాన సంగ్రాహకులు గాను, సూర్యరాయాంధ్ర నిఘంటువునకు సమీక్షకులు గాను వున్నారు. రచనలు: భారతీశతకము, బాలానందము, కువలయావళి నాటికకు ఆంధ్రానువాదము మొదలైనవి. అడ్రసు: 9, ఆఫీసు వెంకటాచల మొదలివీధి, ట్రిప్లికేన్, మదరాస్-5.

సీతారామరెడ్డి, హాలహరివి; జననం, 1901; బి. ఎ. పచ్చ

యప్ప కాలేజి; బి. ఎల్., లా కాలేజి, మదరాస్, బళ్ళారి లో ప్రాక్టీసు ప్రారంభం, 1930; 1937 లో కాంగ్రెసు అభ్యర్థిగా మదరాస్ లెజిస్లేటివ్ అసెంబ్లీకి బళ్ళారి నియోజక వర్గంనుంచి ఎన్నుకోబడినారు; మళ్ళీ 1946 లో కూడా ఎన్నుకోబడినారు; పరిశ్రమల శాఖామంత్రి 1947 మార్చినుంచి 1949 జనవరి వరకు; రెవిన్యూమంత్రి 1949-52; పార్లమెంటు సభ్యులు, 1952 నుంచి 1953 వరకు; అడ్రసు బళ్ళారి.

సుబ్బారావు, కల్లూరి; జననం, 1897 మే 25; 1920 లో సహాయ నిరాకరణోద్యమంలో చేరి జైలుకు వెళ్లారు. మళ్లీ 1922 లో కూడా శిక్షపడ్డారు. 1937 లో మదరాసు అసెంబ్లీకి ఎన్నుకోబడినారు. మళ్ళీ 1946నుంచి 1952 వరకు. అడ్రసు అనంతపురం.

సుబ్రహ్మణ్యం, ధూర్జటి; జననం, 1905 అక్టోబర్ 27; ఎం. ఏ. (మదరాసు), బి. ఇ. డి. (ఆంధ్ర) ఎఫ్. ఐ. ఎ, (లండన్), ఎఫ్. ఎస్. ఎస్. (లండన్); 1938 లో ఇంగ్లండు వెళ్లి, ఎలయన్సు ఎస్యూరెన్సు కంపెనీలో పనిచేసి,ఇండియాకువచ్చినతరువాత ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ సెక్రటరీగాను అక్చ్యుయరీగానుఉన్నారు. ఇంగ్లండువెళ్లక ముందు గుంటూరు హిందూ కాలేజిలో లెక్చరర్ గా ఉన్నారు. బందరు థియోసాఫికల్ లాడ్జి ప్రెసిడెంట్; సెక్రటరీ, రోటరీక్లబ్; అడ్రసు: జనరల్ మేనేజర్ ఆంధ్ర ఇన్సూరెన్సు కంపెనీ, మచిలీపట్టణం.

సుందరయ్య, పుచ్చలపల్లి. జననం, 1913. పద్నాలుగవఏట నే రాజకీయోద్యమంలో చేరారు. 1927 లో మదరాసు కాంగ్రెసు మహాసభలో పాల్గొన్నారు. 1930 జనవరిలో మదరాసులో లయోలా కాలేజినుంచి విద్యార్థుల ఊరేగింపు జరిపారు. రెండేళ్లు శిక్షపడి, బోర్స్టల్ స్కూలులో వున్నారు. 1932 లో కమ్యూనిస్టు పార్టీలోచేరి, 1934 ఆంధ్ర దేశంలో కమ్యూనిస్టుపార్టీని స్థాపించారు. 1938, 1939 లలో ఏ.ఐ. సి.సి. సభ్యులుగా కూడావున్నారు. 1952 లో కౌన్సిలు ఆఫ్ స్టేట్సు కు మెంబరుగా ఎన్నుకోబడినారు.

అడ్రసు: కమ్యూనిస్టుపార్టీ ఆఫీసు, విజయవాడ.

సుందరరామశాస్త్రి నరసింహా దేవర: జననం; 27 ఫిబ్రవరి 1908, (అలమూరు); బి. ఏ. (రాజమండ్రి) ఎం. ఏ. (మదరాసు); ఎం. ఎస్. సి. (మదరాసు) పి. హెచ్. డి. (లండన్); మదరాసు యూనివర్శిటీలో స్టాటిస్టిక్సు డిపార్టుమెంటు ప్రధానోపన్యాసకులు 1934 నుంచి 1943 నవంబరు వరకు. సిమ్లాలో, ఇండియాప్రభుత్వపు లేబరుడిపార్టుమెంటుకు స్టాటిస్టిషియన్, 1933 నవంబరు నుంచి 1945 సెప్టెంబరు వరకు. ప్రస్తుతం; డైరక్టర్ ఆఫ్ స్టాటిస్టిక్సు రిజర్వ్‌బ్యాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి. ఇండియా ప్రభుత్వపు స్టాటిస్టికల్ డిపార్టుమెంట్ స్టాండింగు కమిటి మెంబరు; ఇండియా ప్రభుత్వపు ఇండియన్ కౌన్సిలు ఆఫ్ అగ్రికల్చరల్ రీసెర్చి శాఖ స్టాటిస్టికల్ కమిటీ మెంబరు: అడ్రసు. రిజర్వ్‌బాంక్ ఆఫ్ ఇండియా, బొంబాయి.

సూరయ్య; కొల్లిపర; 1921 నుంచీ కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొని చాలాసార్లు జైయిలుకు వెళ్ళారు. తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెసుకు 15 సంవత్సరాలు అధ్యక్షులు, రాష్ట్ర కాంగ్రెసు లోనూ చాలాకాలం సభ్యులు; చాలా ప్రజోపయోగ సంస్థలను స్థాపించడంలో కృషి చేశారు. 'సాహితి' పత్రిక సంపాదకులు; మదరాస్ అసెంబ్లీ సభ్యులు 1946-52. అడ్రసు; కపిలేశ్వరపురం; కృష్ణాజిల్లా,

సూర్యనారాయణ,పంచాగ్నుల; జననం, 4 ఏప్రిలు 1897; స్వరాజ్యోద్యమంలో చేరి గవర్నమెంటు ఉద్యోగానికి రాజీనామా ఇచ్చారు. కొంతకాలం మదరాసు లోని కాంగ్రెస్ కార్యాలయం లోనూ, స్వరాజ్యపత్రికలోను పని చేశారు, తరువాత, వ్యాపారంలో ప్రవేశించారు. వస్త్ర వ్యాపారంలో ప్రముఖులు; మేటూరుమిల్లు వస్త్రాలకు సోల్ డిస్ట్రిబ్యూటర్లుగా వున్న ఎస్. కృష్ణస్వామి, పి. సూర్యనారాయణ కంపెనీలో భాగస్థులు; చాలా మిల్లు కంపెనీలలో డైరెక్టర్; స్వయంకృషివల్ల పెద్ద వ్యాపారస్థులైన కొద్ది మంది ఆంధ్రులలో వీరొకరు; అడ్రస్: 11-12, సెకండ్ లైన్ బీచ్ మదరాసు-1

సూర్యనారాయణమూర్తి, అప్పికట్ల; జననం, 1894 నవంబరు 29; సహకారోద్యమ వ్యాప్తికి చాలా కృషిచేశారు. ఢిల్లీలోని ఇండియన్ కౌన్సిల్ ఆఫ్ వరల్డు అఫేర్స్ సభ్యులు; హోంరూల్ ఉద్యమంలో పాల్గొని, అప్పటినుంచీ రాజకీయాలలో ప్రముఖపాత్రను నిర్వహిస్తున్నారు. 1917 నుంచీ ఆంధ్ర రాష్ట్రోద్యమంలో కృషి చేస్తున్నారు; బరంపురం హరిజన సేవక్ సంఘానికి అధ్యక్షులు: ఆంధ్ర యూనివర్శిటి సెనెటు సభ్యులు, 1926-29; గంజాం జిల్లా వ్యవసాయదారుల సంఘ కార్యదర్శి; పత్రికారచయిత: ఒరిస్సారాష్ట్ర ఆంధ్రసంఘానికి అధ్యక్షులు; అడ్రసు, సర్వోదయభవన్, ఛత్రపూర్, గంజాంజిల్లా.

సూర్యనారాయణరావు, కొత్తా; జనవరి, 1876, గుంటూరు జిల్లా కొండవీడులో; నరసాపూర్ లో విద్యాభ్యాసం; స్కూల్ మేష్టరుగా 1901 లో జీవితం ప్రారంభించారు. 1905 లో మిల్లుస్టోరు వ్యాపారం, ఇండియన్ కామెర్స్ అండ్ ఇండస్ట్రీస్ కంపెనీ అనే పేరుతో బెజవాడలో స్థాపించారు. 1914 లో ఈ వ్యాపారాన్ని మదరాసులో దీ హైవ్ ఫౌండ్రీ ఇంజనీరింగ్ వర్క్సును స్థాపించారు. దీనిని 1937 లో లిమిటెడ్ కంపెనీగా మార్చారు. 1942 లో కొత్తా బిజినెస్ సిండికేటును, రామవరప్పాడులో వుక్కుపోత పరిశ్రమ కొత్తాస్టీల్ ప్రాడక్ట్సును స్థాపించారు ఆంధ్ర చేంబర్ ఆఫ్ కామెర్స్ వైస్ ప్రెసిడెంటు; కొత్తా బిజినెస్ సిండికేట్ లిమిటెడ్‌కూ ఇండియన్ కామెర్స్ అండ్ ఇండస్ట్రీస్ లిమిటెడ్‌కూ గవర్నింగ్ డైరెక్టర్; అడ్రెసు. ది హైవ్ బిల్డింగ్స్, 96, బ్రాడ్వే, మదరాసు.

సూరి, జి. ఎస్. (సూర్యనారాయణ గోళ్ళమూడి) జననం. 1913 మే 31, బి. ఏ. (గుంటూరు); బి. ఎల్. (మదరాసు); 1939 లో అడ్వొకేట్‌గా ఎన్‌రోల్ అయారు. 1944 నుంచి మదరాసులో ప్రాక్టీసు చేస్తున్నారు. విద్యార్థిగా వున్నప్పటినుంచీ కథలు, నాటికలు, ఏకాంకికలు వ్రాస్తూవున్నారు. ప్రస్తుతం తెలుగు వారపత్రికలకు 'లా' మీద వ్యాఖ్యానాలు

వ్రాస్తూ వున్నారు. ఆంధ్ర వార పత్రికలలో ఖు లా సా కబుర్లు వ్రాస్తూ వున్నారు. వీరి రచనలో ప్రసిద్ధిపొందినవి: టింగణ్ కథలు, బ్రహ్మలోకం (నాటిక), సరాగం, (రేడియో నాటిక), ఇంగ్లీషు తెలుగు నాటకాలలోను 'నారద-నారది' ఫిలింలోను నటించారు. రేడియో నాటకాలలో పాల్గొంటున్నారు. 'ప్రపంచదర్శిని' లోని 'లా' విషయాలు వీరు వ్రాసినవే. అడ్రసు: గుంటూరు.

సోమశేఖరశర్మ, మల్లంపల్లి; జననం, 1891 (మినుమించిలిపాడు) 1911 లో ఆంధ్రుల చరిత్ర వ్రాస్తున్న చిలుకూరి వీరభద్ర రావుగారి సహాయకులుగా, చరిత్ర పరిశోధన ప్రారంభించారు. 1914-18, దేశమాత పత్రిక సంపాదకులుగా పనిచేశారు. 1918 లో 'ఆంధ్రాభ్యుదయ గ్రంథమాల' ను స్థాపించారు. 1924-40, 'ఆంధ్ర విజ్ఞాన సర్వస్వం' తయారు చెయ్యడంలో, ఆంధ్ర పత్రికా కార్యాలయంలో వున్నారు. 1940-46, ఆంధ్ర యూనివర్సిటీలో చారిత్రక పరిశోధక పండితులుగావున్నారు. రచనలు: ఆంధ్రవీరులు, అమరావతీ స్తూపములు చారిత్రక వ్యాసములు, ఆంధ్రదేశచరిత్ర; సుమారు 30 శాసనములు టీకా టిప్పణులతో సహా.

హనుమంతరావు, పల్లెర్ల. జననం, 27 మే 1908; మిడిల్ స్కూలులో చదువు ముగించుకొని, హైదరాబాదు రెవెన్యూ డిపార్ట్‌మెంటులో వుద్యోగం చేస్తూ,ఆరుసంవత్సరాలు ఉద్యోగం చేసిన తరువాత 1932 లో మెట్రిక్యులేషన్ ప్యాసయారు 1937 లో న్యాయవాది పట్టాన్ని పొంది మహబూబ్ నగరంలో ప్రాక్టీసు పెట్టారు. 1938 లో స్టేటు కాంగ్రెసు ఉద్యమంలోచేరి 19 నెలలు శిక్షపడ్డారు. తరువాత జిల్లా కాంగ్రెసు సంయుక్త కార్యదర్శిగా పనిచేశారు. హైదరాబాదు సంస్థాన కాంగ్రెసు కార్యవర్గంలో సభ్యులు అడ్రసు, మహబూబ్ నగర్.

హనుమంతరావు, మద్దూరి; జననం, 1909 అక్టోబర్ 22; బి. ఏ., రాజమండ్రి కాలేజి 1932, పత్రికా విలేఖరి, కథకుడు: ఆనరరీ మేజిస్ట్రేట్, 1934; రాజమండ్రి నగర జర్న

లిస్టుల సంఘానికి అధ్యక్షుడు 1945. ఆంధ్రరాష్ట్ర పత్రికావిక్రేతల సంఘాధ్యక్షుడు 1946; ఆంధ్రరాష్ట్ర ఓరియంటల్ భీమా కంపెనీ ఏజెంట్ల సంఘాధ్యక్షుడు, 1948, అడ్రస్ : దానవాయిపేట, రాజమండ్రి.

హనుమంతరావు, మాడపాటి; జననం, 1885 జనవరి 22. (కృష్ణాజిల్లా, నందిగామ తాలూకా పొక్కునూరులో). కొంతకాలము నిజాము ప్రభుత్వమునకు ట్రాన్సులేటరుగాను. చాలా కాలము హైకోర్టు వకీలుగాను వుండిరి. శ్రీకృష్ణదేవరాయ ఆంధ్రాభాషా నిలయము హైదరాబాదు నకు చాలా సంవత్సరాలు కార్యదర్శి రచనలు : మల్లికాగుచ్ఛము, మాలతీగుచ్ఛము, తాత్రకాలపు హిందార్యులు; తెలంగాణా ఆంధ్రోద్యమము మొదలైనవి. నిజాంరాష్ట్రంలోని అనేక ఉద్యమాలతో వీరికి సంబంధం వుంది. అచ్చట ఆంధ్ర పితామహుడని వాడుక. హైదరాబాదు మేయరు. అడ్రసు: ఆంధ్రదకుటీరం సుల్తాన్ బజారు, హైదరాబాదు.

హరిసర్వోత్తమరావు, గాడిచర్ల; జననం. 1883 సెప్టెంబరు; బి. ఏ. (మదరాసు); ఎం. ఏ. (మదరాసు) విజ్ఞానచంద్రికా గ్రంథ మండలి స్థాపకులు సంయుక్త సంపాదకులు 1906-7, స్వరాజ్య వారపత్రిక ఎడిటర్ 1907-8; రాజద్రోహ వ్యాసం వ్రాసినందుకు మూడేళ్లు ఖైదు 1908-11; ఆంధ్రమహాసభ అధ్యక్షులు. 1916 ఆంధ్రరాష్ట్రంలో హోం రూల్ లీగ్ కార్యదర్శి 1917-18; ఆంధ్రరాష్ట్ర సమావేశం అధ్యక్షులు, 1924; 1934 వరకు అఖిలభారత కాంగ్రెసు కమిటీ సభ్యులు; 1926-30 లలో కాంగ్రెసు తరఫున మదరాసు లెజిస్లేటివ్ కౌన్సిలు సభ్యులు; ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘాధ్యక్షులు 1936 నుంచి; ఆంధ్ర మహాసభ కార్యనిర్వాహకవర్గం అధ్యక్షులు 1947 నుంచి; మహాసభ అధ్యక్షులు, 1951; దక్షిణ భారత వయోజన విద్యా సంఘాధ్యక్షులు 1946-47 నుంచి 1950 వరకు; అఖిల భారత వయోజన విద్యా గ్రంథాలయ సంఘములలో కార్య నిర్వాహక సభ్యులు, ఆంధ్రదేశ వయోజన విద్యాగౌరవ డైరెక్టరు,

1943 నుంచి; తెలుగు విజ్ఞాన సర్వస్వము కమిటి సభ్యులు: ఆంధ్ర రాష్ట్ర గ్రామోద్యోగసభ ఉపాధ్యక్షులు; రచనలు: అబ్రహాం లింకను చరిత్ర. ఢిల్లీ దర్బారు. ప్రభుత్వము, చైనా-జపాన్ ప్రళయము. వయోజన విద్య - మొదటి పుస్తకం, వయోజన విద్య - బోధన క్రమము, సభలు సమావేశములు, గ్రీసుచరిత్ర, మొదలైన అనేక గ్రంథములు. అడ్రసు. 2 వ వీధి, గోపాలపురం, మదరాస్. 6.

హీంచంద్ కె. షా రాయ్ బహదూర్; జననం, బరోడా సంస్థానంలో భాదుకొడ్ లో 1895 లో. గుజరాతీ విద్యా పీఠంలో స్నాతక పరీక్ష ప్యాసయ్యారు; జీవన్‌లాల్ (1929) లిమిటెడ్ మేనేజింగ్ డైరక్టరు; డైరెక్టర్. ఇండియన్ అల్యూమినియం కంపెనీ కలకత్తా. మైసూర్ ప్రీమియర్ మెటల్ ఫ్యాక్టరీని, హిందూస్థాన్ మెటల్ రిఫైనరి అండ్ రోలింగ్ మిల్సును స్థాపించారు, నాన్ ఫెర్రెస్ మెటల్స్ ప్లానింగ్ బోర్డు మెంబరు; భారతదేశంలో అల్యూమినియం; కంచు, ఇత్తడి పాత్ర పరిశ్రమల అభివృద్ధికోసం 1946లో ఇంగ్లండుకు వెళ్ళి, అక్కడ పరిశ్రమల నిర్వహణము పరిశీలించి వచ్చారు. 1940 లో రాయ్‌బహాదూర్ బిరుదుపొందారు. అడ్రసు: 9-ఎ. జస్టిస్ చంద్రమాధవరోడ్; భవానిపూర్; కలకత్తా.

# కొత్త సంగతులు

ప్రపంచదర్శిని 1954-55 సంపుటి ముద్రణ ప్రారంభమై ముగిసే లోపల జరిగిన సంఘటనలుగాని, మార్పులుగాని ఆయా శీర్షికలలో ప్రకటించడానికి వీలులేని వాటిని యీ క్రింద సంగ్రహంగా ప్రకటిస్తున్నాము.

ఇండియాలో ఫ్రెంచి ప్రభుత్వ పాలనలోవున్న ప్రాంతాలను, ఇండియా ప్రభుత్వ పరిపాలనలోకి తీసుకొని రావాలనీ, అచ్చటి ఫ్రెంచి ప్రభుత్వం అంతరించిపోవాలనీ ఉద్యమం 1954 మార్చిలో తీవ్రరూపం దాల్చింది. ఫ్రెంచి ఇండియా మంత్రులు అయిదుగురు, ఫ్రెంచి ఇండియాలో రిఫరెండం అవసరంలేకుండానే, ఆ ప్రాంతాలను ఇండియాలో కలిపివెయ్యాలని కోరుతూ, ఒక మెమొరాండమును కమిషనర్ మేనార్డుకు 1954 మార్చి 19 న సమర్పించారు. అదిగాక, ఫ్రెంచి ఇండియాలోని మునిసిపల్ కౌన్సిళ్లుకూడా ఇదే విధంగా తీర్మానించాయి. ఈ విషయాలను మేనార్డ్, పారిస్‌లోని ఫ్రెంచి ప్రభుత్వానికి తెలియ జేశాడు. ప్రశాంతంగా యీ ఫ్రెంచి సెటిల్మెంట్లను ఇండియాకు అప్పగించడం మంచిదనికూడా, ఇండియా ప్రభుత్వం ఫ్రెంచి ప్రభుత్వానికి వ్రాసింది. ఫ్రెంచి ఇండియాలోని ప్రజలుకూడా, మార్చి 27 తేదిన, స్వాతంత్ర్యోద్యమాన్ని ప్రారంభించారు.

సంగీత, నాటక అకడమీవారి సలహా ననుసరించి, 1953 లో యీ క్రింది గాయకులకు ప్రెసిడెంటు బహుమతులు ఇవ్వబడినవి. హిందుస్తానీగాత్రం, రజాబ్ ఆలి; హిందుస్తానీ వాద్యం (తబలా), అహమద్ జాన్ తిరాక్వా; కర్నాటకగాత్రం. మైసూరు ఆస్థాన విద్వాన్ కె. వాసుదేవాచార్; కర్నాటక వాద్యం (ఫ్లూట్), పల్లడం సంజీవరావు.

1953 డిసెంబరు 31 తరువాత, ప్రతిసంవత్సరమూ దేశంలో తయారైన ఫిలిములలో ఉత్తమమైన వాటికి మూడిటికి బహుమతులను ఇవ్వడానికికూడా సంగీత,నాటక, అకడమీ నిశ్చయించింది.

హైడ్రోజెన్ బాంబును తయారుచేసి, దానిని ప్రేలిస్తే ఏవి పరిణామాలు కలుగుతాయో చూడడానికి మూడుసార్లు, 1954 మార్చి 1, మార్చి 26, ఏప్రిల్ 6 తేదిలలో, యీ బాంబులను ఫసిఫిక్ సముద్ర ప్రాంతంలో ప్రేల్పించడం జరిగింది, ఈ ప్రేల్పుడులు అన్నీ అమెరికా ప్రభుత్వపు అధ్వర్యాన జరిగాయి.

ఆఫ్ఘనిస్తాన్ తరఫున ఇండియాలో రాయబారిగా సర్దార్-ఇ-అలా అబ్దుల్ హుసేన్ అజీజ్, 1954 ఏప్రిల్ 6 న పదవీస్వీకరించారు.

1953 మార్చి 31 నాటికి ఇండియా పోస్టల్ శాఖలో 1,78,233 మంది ఖాయపు ఉద్యోగులూ, 55,864 మంది టెంపొరరీ వుద్యోగులూ, మొత్తం 2,34,097 మంది ఉద్యోగులు వున్నారు. 1953 మార్చి 31 తో అంతమయే సంవత్సరంలో ఇండియాలోని పోస్టాఫీసులు మొత్తం 279.4 కోట్ల ఉత్తరాలనూ, పార్సెళ్ళనూ బట్వాడా చేసినవి. రు. 216 కోట్ల విలువగల 5,84,00,000 మనియార్డర్లను బట్వాడా చేసినవి. రెండుకోట్ల 90 లక్షల టెలిగ్రాములను అందిచ్చినవి. 1954 మార్చి 31 తో అంత మయే సంవత్సరంలో ఇండియా ప్రభుత్వపు పోస్టల్ శాఖ ఆదాయం రు. 44 కోట్ల 12 లక్షలు ఖర్చులుపోగా నికర ఆదాయం రు. 2,00,00:.

విలాస్‌పూర్‌ను హిమాచల ప్రదేశ్‌లో కలిపి వెయ్యడానికి ఇండియా ప్రభుత్వం నిశ్చయించింది. తదనుకూలంగా, హిమాచల ప్రదేశ్ లెఫ్టినెంట్ గవర్నర్‌నే విలాస్‌పూర్‌కు చీఫ్‌కమిషనర్‌గా నియమించింది.

ఆంధ్రరాష్ట్రంలో 1954 ఏప్రిల్ 1 తేదినాటికి 3,890 పోస్టాఫీసులు, 526 పోస్టు, టెలిగ్రాఫ్ ఆఫీసులు, 25 టెలిఫోన్ ఎక్స్‌చేంజి ఆఫీసులు వున్నాయి.

మదరాసు ముఖ్యమంత్రి సి. రాజగోపాలాచారిగారు, తమ పదవికి రాజీనామా ఇచ్చినందున, 1954 ఏప్రిల్ 13 న మదరాసులో కొత్త మంత్రి మండలి ఏర్పాటు చేయబడినది. ఆ మంత్రి మండలి వివరాలివి: ముఖ్యమంత్రి, పోలీసు, పబ్లిక్, కె. కామరాజనాడార్;

ఆరోగ్యమంత్రి, సహకారము. గృహనిర్మాణము, ఎ. బి. షెట్టి, వ్యవసాయమంత్రి, పరిశ్రమలు, కార్మికులు, గ్రామాభ్యుదయము, మహిళాభ్యుదయము, ఎం. భక్తవత్సలం; ఆర్థికమంత్రి, ఆహారము; ప్రచురణ, న్యాయశాఖ; సి. సుబ్రమణ్యం; రెవిన్యూమంత్రి, వాణిజ్య పన్నులు, ఎం. ఎ. మాణిక్యవేలు నాయకర్; పబ్లిక్ వర్క్సుమంత్రి, ఇండ్ల అద్దె కంట్రోలు, షణ్ముగరాజేశ్వర సేతుపతి రామ్నాడ్‌రాజా; రవాణా మంత్రి, మద్యనిషేధం, రిజిస్ట్రేషన్; బి. పరమేశ్వరన్; స్థానిక పరిపాలన. ఏస్. ఎస్. రామస్వామి పడయాచి.

మైసూరు యూనివర్శిటీ వైస్‌ఛాన్సెలర్ గా వి. ఎల్. డిసూజా నియమింపబడినారు.

1952 లో ఇండియాలో 27,012 మోటారు సైకిళ్లు, 1,47,982 ప్రైవేటు మోటారుకార్లు, 11,789 టాక్సీలు, 34,373 బస్సులు, 83,413 లారీలు, 3,694 ఇతర మోటారు బండ్లు వున్నాయి.

1953 ఆగస్టు 31 నాటికి ఇండియాలో 7,00,771 మంది ఇళ్ళలో రేడియోసెట్లు పెట్టుకోడానికి లైసెన్సులు తీసుకున్నారు. ఆంధ్రరాష్ట్రంలో ఇలా తీసుకున్నవారి సంఖ్య, 1953 అక్టోబరు 31 నాటికి, 30,787.

హైదరాబాదునుంచి కౌన్సిల్ ఆఫ్ స్టేట్సుకు ఖాళీగావున్న స్థానానికి కాంగ్రెసు పార్టీ సభ్యులు నారాయణదాస్ డాగా ఎన్నికోబడినారు.

తిరువాంకూరు కొచ్చిన్ అసెంబ్లీ స్పీకరు, తమ జీవితంలో రు. 200 తగ్గించుకొని, నెలకు రు. 500 మాత్రమే తీసుకుంటున్నారు.

ఇండియాలో అర్జెంటైనా రాయబారిగా రెనిలాసన్ నియమింపబడినారు.

1954 ఏప్రిల్ 17 నుంచీ, ఈజిప్టు ప్రధానమంత్రిగా కర్నల్ గామెల్ అబ్దుల్ నసీర్ నియమింపబడినారు.

పంజాబ్ అసెంబ్లీ స్పీకరు డాక్టర్ సత్యపాల్, 1954 ఏప్రిల్ 18 న మరణించారు.

సింహళం గవర్నర్ జనరల్ గా సర్ ఆలివర్ గుణతిలక నియమింపబడినారు. వీరు 1954 జూలై 17 న పదవీస్వీకారం చేస్తారు.

# సూచిక

| విషయం | పేజి |
|---|---|